# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

25-31, జులై, '86
రు. 2-50

కొత్త రవీంద్రబాబు
సంకెళ్లెవరికి?
సరికొత్త సీరియల్

సూపర్ హీరోయిన్
విజయశాంతి
సమాధానాలు

# మీ పాపాయికి ఫారెక్స్ ప్రేమ కానుక.

**ఫారెక్స్ గోరుముద్ద చెమ్చా. పాపాయికి మొట్టమొదటి ఘన ఆహారం ముద్ద తినిపించడానికి మొట్టమొదటి చెమ్చా**

మీ పాపాయి బువ్వ తిన్నప్పుడల్లా పరమానందంగా తినేలా చూడండి. రంగురంగుల ఫారెక్స్ గోరుముద్ద చెమ్చాలతో ఫారెక్స్ తినిపించండి. ఆహారంతోబాటే ఆనందం కూడా జుర్రుకోనీండి.




మీ పాపాయి గోరుముద్ద చెమ్చా అడిగి మరీ తీసుకోండి— ప్రతి ఫారెక్స్ డబ్బాతో ఒకటి ఉచితం.

ఈ సదుపాయం స్టాకు ఉన్నంతవరకే

క్రొత్త మేలు పర్చబడిన **ఫారెక్స్®**

CLARION/B/GX/14/244TEL

## కథలు

శోభన (20-26)ముఖ చిత్రంతో వెలువడిన వారపత్రికలో డాక్టర్ బి. ఎ. జి. నరసింహారావ్ గారి "చెదిరిన మబ్బులు", మాదుగుల కృష్ణకుమారిగారి 'గుడ్డివాడు" కథలు చాలా బాగున్నాయి.

సింగం దత్తాత్రేయమూర్తి, రఘురామారావ్,
ఒంగోలు

* * *

శ్రీ పులిగడ్డ విశ్వనాథరావుగారి విచిత్ర యదార్థ గాథలు వారం వారం అద్భుతంగా ఉంటున్నాయి. ఈ వారం అద్భుత శస్త్ర చికిత్సకుడు గాథ మనదేశపు ప్రాచీన శస్త్ర చికిత్సల్ని జ్ఞాపకం చేసింది.

శ్రీ ఇసుకపల్లి లక్ష్మి నరసింహశాస్త్రి గారి "తాబేలు" కథ చాలా బాగుంది. "తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు" అనే సామెత కాంతారావు విషయంలో యదార్థం అయింది.

ఆకెళ్ల సుబ్బారావు, కందికుప్ప

## సీరియల్స్

నటి శోభన ముఖచిత్రంతో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయంగా వుంది. వీరపల్లి వీణావాణిగారి 'సర్పయాగం', కాకాని కమలగారి 'జీవితం చేజారిందా?' సీరియల్ హృదయరంజకంగా వున్నాయి.

బి. జైసింగ్, బి. శ్రీరాములు,
దోర్నకల్

* * *

'కాల్‌గర్ల్' సీరియల్ మిగిలిన నవలల కంటే వెరైటీగా ఉంది. ఒక స్త్రీ పదిమంది మగవాళ్ల మధ్య ఉద్యోగం చేసేటప్పుడు ఎటువంటి ఇబ్బందులు పడవలసి వస్తుందో రచయిత శ్రీ దూరి వెంకటరావు గారు చక్కగా వివరించారు.

జయంతి కల్యాణి, బచేలి (మ. ప్ర.)

## శీర్షికలు

'సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? చర్చ' శీర్షికలోని పాఠకుల అభిప్రాయాలు బాగా ఉంటున్నాయి.

డి. డి. థామస్, సత్తుపల్లి

# ఉత్తరాలు

## విచిత్ర యధార్థ గాథలు

'అద్భుత శస్త్ర చికిత్సకుడు' అంగో గురించి చదివి ఆశ్చర్యపోయాము. నమ్మశక్యం కాని ఈ నిజం మమ్మల్ని అబ్బుర పరచింది. ఇది చూస్తుంటే 'పునర్జన్మ' వున్నదా? అనే సందేహం పునరావృతమౌతుంది. అతనిపై చేసిన పరిశోధనలు ఫలించకుండానే 'అరిగో' మరణించడం విచారకరం. ఒక విధంగా ఈ విచిత్ర వైద్యుడు మన సమకాలీనుడు కావడం మన అదృష్టం.

ఐరేని శ్రీనివాస్‌గౌడ్,
రామాయంపేట

## న్యూఢిల్లీ లేఖ

నటి శోభన ముఖచిత్రముతో వెలువడిన ఆంధ్రపత్రిక వీక్లీ చాలా ఆకర్షణీయంగా ఉన్నది. డా. జయదుభాషి గారి న్యూఢిల్లీలేఖ "సమాచారము అంటే ప్రచారము కాదు" నాకు చాలా నచ్చింది.

ఏ. శ్రీకాంత్, నల్గొండ

## మద్రాసు తెలుగు అకాడెమీ

మద్రాసు తెలుగు అకాడెమి, సాంస్కృతిక సంస్థ తన ఆదర్శాలలో భాగంగా దేశంలోని యువ గాయనీ గాయకుల నాటక, నృత్య, వాద్య కళాకారుల, ప్రతిభని గుర్తించి తగిన అవకాశాలను తమ కార్యక్రమాలలో కలిగించి ప్రోత్సహించాలని నిశ్చయించింది. ఈ అవకాశాన్ని వినియోగించుకో దలచిన వారు అకాడెమి చీఫ్ కన్వీనర్ శ్రీ టి. ఏ. కె. శాస్త్రి, 25, మెతోనీ రోడ్, మద్రాసు–17ని సంప్రదించవచ్చు. □




# ఆంధ్రసచిత్రవారపత్రిక

25-31 జూలై 1986

శ్రీ అక్షయ నామ సం. ఆషాఢ బ. చవితి

సంపుటము 78 : సంచిక 46

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2·50 |
| పోస్ట్‌లో 6నెలల చందా | రు. 71.50 |
| పోస్ట్‌లో 12నెలల చందా | రు. 143.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధినగరం, విజయవాడ-520 003

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు : (1938-1972)


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

"అరుణ కిరణం"లో విజయశాంతి

### కథలు :


| | |
|---|---|
| మాలిన్యం.... | 18 |
| నిస్వార్థ సేవకి నీరాజనం ... | 40 |
| ఎవరిది లోపం?.... | 43 |
| మిత్ర చతుష్టయం (పెద్ద కథ).... | 52 |


### సీరియల్ నవలలు:


| | |
|---|---|
| సంకెళ్లెవరికి? (ప్రారంభం) | 8 |
| సర్పయాగం | 26 |
| కరిగిన శిల | 44 |
| జీవితం చేజారిందా? | 58 |


### వ్యాసాలు, శీర్షికలు :


**ఉత్తరాలు-4,** బాబూ జగ్‌జీవన్‌రామ్ అస్తమయం-5, న్యూఢిల్లీ లేఖ-6, వ్యక్తగతం, వారఫలం-14, ఇ'వేమన' పద్యాలు-22, చరిత్ర మరుగున పడిన సిద్ధవటం కోట-24, డాక్టర్ సలహాలు-30, సినిమా విశేషాలు-31, సౌండ్ ఇంజనీర్ శివరామ్-33, అభిమాన తారల అభిప్రాయం!-37, సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు-39, ప్రశ్నావళి-42, సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? - చర్చ-50, ధర్మపథం-63, హైదరాబాద్ నోట్ బుక్-64, ఇద్దరూ ఉద్యోగస్తులైతే!-65

# బాబూ జగ్జీవన్‌రామ్ అస్తమయం

స్వాతంత్ర్యోద్యమ ప్రముఖ నాయకులలో ఒకరు, మాజీ ఉప ప్రధాన మంత్రి బాబూ జగ్జీవన్ రామ్ జూలై 6న కొత్త ఢిల్లీలోని రామ్ మనోహర్ లోహియా ఆసుపత్రిలో అంతిమ శ్వాస విడిచారు. ఆయన వయస్సు 78 సంవత్సరాలు. శ్రీ జగ్జీవన్ రామ్‌కి భార్య శ్రీమతి ఇంద్రాణీదేవి, కుమార్తె శ్రీమతి మీరా కుమార్ ఉన్నారు. శ్రీమతి మీరాకుమార్ లోక్ సభలో కాంగ్రెసు(ఐ) సభ్యురాలిగా ఉన్నారు. శ్రీరామ్ ఏకైక కుమారుడు శ్రీ సురేష్ రామ్ గత ఏడాదే గుండె పోటుతో మరణించారు.

దళిత వర్గాల అభ్యున్నతి కోసం పాటుపడిన బాబూ జగ్జీవన్ రామ్ భారత దేశంలోని ప్రముఖ జాతీయ నాయకులలో ఒకరుగా పేరు తెచ్చుకున్నారు. 1946లో నెహ్రూ నాయకత్వంలో ఏర్పాటైన తాత్కాలిక జాతీయ ప్రభుత్వంలో ఆయన మొట్ట మొదట మంత్రిగా చేరారు. కాంగ్రెసు ప్రభుత్వంలో మూడు దశాబ్దాల పాటు కేంద్రంలో కాబినెట్ మంత్రిగా రక్షణ, వ్యవసాయ, కార్మిక, కమ్యూనికేషన్, రైల్వే శాఖలని సమర్థ వంతంగా నిర్వహించారు. పార్టీ విధాన నిర్ణయాలలో ప్రముఖ స్థానాన్ని అలంకరించారు. పరిపాలనా దక్షునిగా పేరు పొందారు. ఆయన మంచి వక్త కూడా. పార్లమెంటులో ఆయన ఉపన్యాసాలు అందరిని ఆకట్టుకునేవి.

బాబూజీగా పేరు పొందిన శ్రీ జగ్జీవన్ రామ్ బీహార్‌లోని భోజపూర్ జిల్లాలో ఉన్న ఛాంద్వాలో 1908లో జన్మించారు. ఆగ్రా టౌన్ హైస్కూలులో, బెనారస్ హిందూ విశ్వ విద్యాలయంలో, కలకత్తా విశ్వ విద్యాలయంలో విద్యాభ్యాసం చేసి 1930లో బి. ఎస్‌సి. పట్టా పొందారు. హరిజనోద్ధరణకి అంకితమైన కార్య కర్తగా ఆయన తమ రాజకీయ జీవితాన్ని ప్రారంభించి స్వాతంత్ర్య పోరాటంలో చురుకుగా పాల్గొన్నారు. 1930లో కాంగ్రెసు ఉద్యమానికి సంబంధించిన కరపత్రాల రహస్య పంపిణీకి ఆయన ఎంత గానో సహకరించారు. 1940లో వ్యక్తి సత్యాగ్రహం చేసి ఏడాది కారాగార శిక్ష అనుభవించారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో తిరిగి పాట్నాలో అరెస్టు అయినారు. 1942లో అనారోగ్య కారణంగా జైలు నించి విడుదలై దళిత వర్గాల సంస్థలని పటిష్ఠం చేసేందుకు ఆయన వివిధ రాష్ట్రాలలో పర్యటించారు. 1936 నుంచి 46 వరకూ ఆయన అఖిల భారత దళిత వర్గాల పార్టీ అధ్యక్షుడిగా పని చేశారు.

1936లో శ్రీ రామ్ బీహార్ శాసన మండలికి నామినేట్ చెయ్యబడ్డారు. 1937లో బీహార్ శాసన సభకి ఎన్నికై అభివృద్ధి శాఖా మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శిగా నియమింపబడ్డారు. 1946లో దళిత వర్గాల ప్రతినిధిగా తమ అభిప్రాయాలని వివరించటానికి ఆయనని బ్రిటిష్ కాబినెట్ మిషన్ ఆహ్వానించింది. 1946 నుంచి 50 వరకూ ఆయన సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ, రాజ్యాంగ పరిషత్తు సభ్యులుగా ఉన్నారు. 1950 నుంచి 52 వరకూ తాత్కాలిక పార్లమెంటు సభ్యులుగా ఉన్నారు.

బీహార్‌లోని ససారామ్ నియోజక వర్గానికి ప్రతినిధిగా శ్రీ రామ్ 1952 నుంచి లోక్‌సభ సభ్యుడిగా ఉన్నారు. మూడు దశాబ్దాల పాటు ఆయన కాంగ్రెసు ప్రభుత్వంలో (కామరాజ్ పథకం కింద 28 నెలల కాలం మినహా) కేంద్ర మంత్రి వర్గంలో కాబినెట్ మంత్రిగా ఉన్నారు. 1966లో శ్రీమతి గాంధీ ఆయనని తిరిగి కేంద్ర మంత్రి వర్గంలో



చేరవలసిందిగా ఆహ్వానించారు. 1940 నుంచి 1977 వరకూ ఆయన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభ్యుడిగా ఉన్నారు. 1950 నుంచి 22 ఏళ్ల పాటు కేంద్ర పార్లమెంటరీ బోర్డులో ఉన్నారు. కాంగ్రెసులో చీలిక వచ్చినప్పుడు శ్రీ రామ్ శ్రీమతి గాంధీ సన్నిహిత మద్దతుదారులలో ఒకరుగా ఉన్నారు. 1969 డిసెంబరులో ఆయన కాంగ్రెసు (ఆర్) అధ్యక్షులైనారు.

1975 జూన్‌లో విధింపబడిన అత్యవసర పరిస్థితిని ఆమోదించ వలసిందిగా కోరుతూ లోక్ సభలో ఆయన తీర్మానాన్ని ప్రతిపాదించారు. కాని అత్యవసర పరిస్థితి చివరి దశలో ఆయన శ్రీమతి గాంధీతో విభేదించి కాంగ్రెసు (ఐ) పార్టీతో తెగతెంపులు చేసుకున్నారు. కాంగ్రెస్ ఫర్ డెమోక్రసీ (సి. ఎఫ్. డి) పార్టీని స్థాపించారు. అనంతరం ఆయన తమ పార్టీని జనతా పార్టీలో విలీనం చేశారు. జనతా పార్టీ ప్రభుత్వంలో శ్రీ రామ్ ఉప ప్రధాన మంత్రిగా పని చేశారు. అంతః కలహాల వల్ల జనతా ప్రభుత్వం విఫలం కావటంతో ఆ పార్టీ నుంచి విడిపోయి కాంగ్రెసు (జె) పార్టీని పెట్టారు. కాని ఆ పార్టీ అంతగా ప్రచారంలోకి రాలేదు.

ఇటీవల కొంత కాలంగా ఆయన కాంగ్రెసు (ఐ) పట్ల మొగ్గు చూపుతూ వచ్చారు. ఆయన ఆశీస్సులతోనే ఆయన కుమార్తె శ్రీమతి మీరా కుమార్ కాంగ్రెసు (ఐ) లో చేరి ఉత్తర ప్రదేశ్ నించి లోక్‌సభకి ఎన్నికైనారు. ప్రధాన మంత్రి రాజీవ్ గాంధీ ఆయనని ఇటీవలే పంజాబ్ సమస్యపై సలహా సంఘం అధ్యక్షుడిగా నియమించారు.

బాబూ జగ్జీవన్ రామ్ కొంత కాలంగా రాజకీయాలలో గణనీయమైన పాత్ర నిర్వహించకుండా దూరంగానే ఉంటున్నారు. భారత జాతీయోద్యమంలో, ఆ తరువాతి కాలంలో ప్రముఖ పాత్ర పోషించిన జాతీయ నాయకులలో ఒకరైన బాబూ జగ్జీవన్ రామ్ ఇంకా ఉన్నత పదవులు అలంకరించి ఉండవలసింది. ఆయన ఏ శాఖ మంత్రిగా ఉన్నా ఆ శాఖ బాగా నిర్వహించబడేదన్న పేరు తెచ్చుకున్నారు. బలహీన వర్గాలకి చెందిన రాజకీయవాదులు భారత దేశంలో ఎంత వరకు నెగ్గుకు రాగలరన్న దానికి శ్రీ రామ్ రాజకీయ జీవితమే ఒక సమాధానం అనే వారు ఉన్నారు. బాబూ జగ్జీవన్ రామ్ అస్తమయంతో భారతదేశం ఒక అగ్రశ్రేణి నాయకుడిని కోల్పోయింది.

—(ఒ. వి)

# న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# బూటకపు సంస్కృతి!

బాతులా కనిపిస్తూ, బాతులాగే అరుస్తూ ఉంటే అది తప్పకుండా బాతే అయి ఉండాలి కాని అది కాదు ఈ కాల్పనిక జగత్తులో అది బాతులా ఉండవచ్చు, అరవవచ్చు. కాని తీరా చూస్తే మరేదో కావచ్చు. ఆఖరికి రెండు కాళ్ళున్న చిన్న గాడిద కూడా అయి ఉండవచ్చు.

కొత్తఢిల్లీలోని రాజీవ్‌గాంధి ప్రభుత్వాన్నే తీసుకోండి అది ప్రభుత్వం లాగే కనిపిస్తుంది. ఇంత మెరుగుగా ఉన్న ప్రభుత్వం గతంలో మనం ఎరగం అన్నట్లుగానే ఉంటుందది. నార్త్ బ్లాక్‌లో ఉన్న విలాసవంతమైన ఆ కార్యాలయాలకి నేను వెళ్ళినప్పుడల్లా వాటిలోని మంది మార్బలం నన్ను ముగ్ధుణ్ణి చేస్తూ ఉంటుంది ఒక మంత్రివర్యుని కింద కార్యదర్శులు, డెప్యూటీ కార్యదర్శులు, సెక్షన్ ఆఫీసర్లు లాంటి వారు ఎంతో మంది ఉంటారు. విశ్వనాధ్ ప్రతాప్‌సింగ్ లాంటి మంత్రి తాము ఒక ఆర్థికమంత్రినని, అన్ని నిర్ణయాలూ తామే చేస్తామన్నట్లు మీరు మరిచిపోలేని విధంగా ప్రవర్తిస్తూ ఉంటారు ఆయన గది ఒక చిన్న ఫుట్‌బాల్ మైదానం అంత ఉంటుంది. మీరు ఆయనతో టీ తీసుకుంటుంటే రెండు బృందాల ఆటగాళ్ళు మీ ముందుకు వచ్చి ఆడతారు అనిపించే లాగా ఉంటుంది ఆ గది. ఇక రకరకాల టెలిఫోన్‌లు ఇంకా సర్వాంతర్యామి లాంటి కంప్యూటర్ కూడా మీకు దర్శనమిస్తాయి. ఇలాగే అందరి మంత్రులకి, ఆఖరికి చిదంబరం వంటి వారికి కూడా ఉంటాయి ఈయన పేరు శ్రీలంకలో గొడవలు జరుగుతున్నప్పుడే వినిపిస్తూ ఉంటుంది.

అయితే ఇదంతా మన బాతు వ్యవహారం వంటిదే. అలాగే కనిపిస్తుంది కాని ఏది సవ్యంగా ఉండదు విశ్వనాధ్ ప్రతాప్‌సింగ్ బుర్రలోనే కాక, ఆయన బల్ల మీద కూడా, జనతా హయాములో మధులిమాయేకి లాగే, చాలా పథకాలు ఉంటాయి. ప్రతి వారం ఆయన కార్యాలయం నుంచి ఏదో ఒక దానికి దీర్ఘకాలిక పథకం ఒకటి బయటపడుతూ ఉంటుంది. ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తంగా ఉందన్న సంగతి అందరికి తెలిసినట్లుగానే ఆయనకి తెలుసు. ఆయన మనకి చెప్పిన దానికి పూర్తి విరుద్ధంగా జరుగుతూ ఉంటుంది. నల్లడబ్బు తగ్గుతున్నదని ఆయన అంటున్నారు కాని ఆయన కింద ఉన్న కుర్రకారు మాత్రం దేశం అంతటా వ్యాపారవేత్తల మీద నిర్విరామంగా దాడులు చేస్తూనే ఉన్నారు. ధరలు అదుపులో ఉన్నాయంటారాయన. కాని చివరికి ఆయన భార్య కూడా అవి తగ్గలేదనే అంటారు. దీనిని బట్టి ఆయన అసలు ఆర్థికమంత్రే కాదని, ఎవరికో సహాయ పడటానికే ఆయన ఆ స్థానంలో ఉన్నారని మీకు అనిపిస్తుంది. వాస్తవానికి ఆయన ఒక బూటకపు మంత్రి, బూటకపు పన్నులు వసూలు చేస్తూ, బూటకపు పద్దులతో బడ్జెట్‌ని సరిపెడుతున్నటువంటి వారు. ఆయన లెక్కలన్నీ ఎలా ఉంటాయంటే గృహిణులు తమ వద్ద డబ్బు తక్కువై, పత్రికలలో ప్రకటనలు చూసి, ఎక్కువ వస్తువులు కొనటానికి చూపించే దొంగ లెక్కల లాగా ఉంటాయి

పంజాబ్ ఒప్పందాన్నే తీసుకోండి. అది సరైన అధికార పత్రంలాగే కనిపిస్తుంది. అందులో నిబంధనలు, ఉప నిబంధనలు ఉన్నాయి. అధికారం పొందిన వారి సంతకాలు కూడా సరిగానే ఉన్నాయి. తెలిసిన వారందరూ దాన్ని ఒక రకమైన 'మాగ్నాకార్టా' అని పొగిడారు. అప్పటి నుంచి అది పనిచేయడమే లేదు. అసలది ఒప్పందమే కాదు దాని మీద సంతకం చేసిన వ్యక్తులకి కూడా అది నిరుపయోగమైనటువంటిదన్న విషయం తెలుసు బూటకపు ఒప్పందానికి, బూటకపు అధికార పత్రానికి అదొక చక్కని ఉదాహరణ పైకి అలా కనిపించినా నిజానికి అది ప్రయోజనం లేనటువంటిది. యుద్ధం సమయంలో కృత్రిమ కాఫీ ఒకటి వస్తూ ఉండేది. మీరు జాగ్రత్తగా ఉండకపోతే ఇప్పుడు కూడా కృత్రిమ చక్కెర వచ్చినా రావచ్చు ఆ ఒప్పందం కూడా అలాంటి నకిలీ సరుకువంటిదే ఆ కృత్రిమ కాఫీ అచ్చం కాఫీలాగే ఉండేది, కాఫీ రుచే కలిగి ఉండేది కానీ అది కాఫీ మాత్రం కాదు. కాఫీ వాసన కలిగినటువంటి ఎండబెట్టిన బురద అది. అది బూటకపు కాఫీ. దాన్ని నకిలీ పాలతో, నకిలీ బిస్కట్లు, నకిలీ జీడిపప్పుతో తీసుకునేవారు. అంతా నకిలీయే!

మనకి ఇప్పుడున్నది బూటకపు ప్రభుత్వమే బూటకపు విధానాలు కలిగిన బూటకపు నాయకులతో కూడినటువంటిది అది. అలాగే బూటకపు సంస్థలు, వాటి విధులు కూడా అలాంటివే. ఈ సాగి

టి. వి. లో మీరు రాజీవ్ గాంధిని చూసినప్పుడు ఆయనన్ని జాగ్రత్తగా గమనించండి. అప్పటికప్పుడు అశువుగా ఆయన చెప్పే ఉపన్యాసాలలో ముఖ్యంగా సాంకేతిక విజ్ఞానంపై ఆయన చెప్పే విషయాలు చాలా ఆసక్తి కరంగా ఉంటాయి ఆ విషయాలపై ఆయన తమకి తెలియనిది అంటూ ఏదీ లేదన్నట్లుగా ఉంటారు. ఆయన ఉపయోగించే మాటలు, ఇంపైన పదజాలంతో ఉన్న వాక్యాలు గుర్తుపెట్టుకోండి. అంతకు ముందు వాటిని మీరు విన్నారన్న విషయం తెలిసే వరకూ ఆయన మాటలు మిమ్మల్ని ముగ్ధుల్ని చేస్తాయి. స్వంత ఊహ అన్నది అందులో ఒక్కటి కూడా లేదని మీకు అనిపిస్తుంది. సైన్సు ప్రతిభా పాటవ పరీక్షలకి వెళ్ళే 12 ఏళ్ళ పిల్లలు రాసే వ్యాసం కంటే అది ఏమి గొప్పగా లేదనిపిస్తుంది. అప్పుడు మీకు ఆశ్చర్యం కలుగుతుంది. అసలు దాని అర్థం ఏమిటో ఆయనకి తెలునా అని అనిపిస్తుంది. టి. వి. తెరమీద కనిపించిన ఆయన నిజాయితీకల వ్యక్తేనా అని అనిపిస్తుంది. మీరు ప్రధాన మంత్రి లేదా విశ్వనాధ్ ప్రతాప్ సింగ్‌లు చెప్పింది వింటుంటే ఆ నిజాయితీ అన్నది లోపిస్తున్నట్లుగా కనిపిస్తుంది. అదే ప్రభుత్వంపై నమ్మకం తగ్గిపోవటానికి కారణం అవుతుంది. ప్రభుత్వం సరిగా నడవటానికి నమ్మకం అన్నది ఎంతైనా అవసరం. బూటకపు సంస్థల విషయంలో కూడా అదే జరుగుతున్నది. దానికి బూటకపు సంస్కృతే కారణం. అలాంటి సంస్కృతినే అర్జున్ సింగ్ పూర్వం తమ మధ్య ప్రదేశ్ ప్రభుత్వంలో పెంపొందించే ప్రయత్నం చేసారు. అది చాలా వెనుకబడిన రాష్ట్రం. ఇప్పుడు ఆ రాష్ట్రం దాని నుంచి బయట పడుతున్నందువల్లనే అక్కడ సెక్స్, హింస వంటివి తల ఎత్తుతున్నట్లు కనిపిస్తున్నది. మంచి చెడుల సంఘర్షణలో అలాంటివి తప్పనిసరి అవుతాయి.

సాంస్కృతిక విలువలు తగ్గి పోతున్న సమాజంలో మనం జీవిస్తున్నాము. బూటకపు ప్రభుత్వాలు, బూటకపు పెద్ద మనుషులు పెంచి పోషిస్తున్న ఒక బూటకపు సంస్కృతే సమాజంలోని విలువలని దిగజారుస్తున్నది. టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక శనివారం అనుబంధాలని ప్రచురించటం ప్రారంభించింది. అవి వార్తాపత్రికల లాగే ఉంటాయి, చదవటానికి కూడా అలానే అనిపిస్తాయి. కానీ వాటి విలువలు ఎంతగా పడి పోయాయంటే, మీరు రెండు నిముషాల కంటే ఎక్కువ సేపు వాటిని చదవలేరు. వార్తా పత్రికలలో విప్లవం అన్నది కూడా ఒక బూటకపు సిద్ధాంతమే. ఏవో ఒకటి రెండు మినహా మిగిలిన వన్నీ బూటకపు సమాజానికి కావలసినటువంటి విషయాలని అందచేస్తున్నాయి. ఈ సమాజం కూడా వాస్తవాలని, నిజాయితీని కావాలనే ఖాతరు చేయనట్లుగా కనిపిస్తున్నది. కొన్ని పత్రికలు లక్షల కాపీలు అమ్ముతున్నాయి. కానీ వాటిలో ఉండేది ప్రముఖుల గురించి, ప్రముఖులు కాని వారి గురించి ప్రచారం చెయ్యబడే పుకార్లే అంతకు తప్ప వాటిలో మీకు మరేమీ కనిపించదు. అయినప్పటికీ అవి నిజమైన పత్రికలే, నిజమైన కాగితంపై ముద్రింపబడినటువంటివే, వాటిలో ఉండే వ్యాసాలు కూడా నిజమైన పత్రికా రచయితలు రాసినవే, అవి అమ్ముడవుతున్నది కూడా నిజమైన డబ్బుకే. నిజానికి ఇదంతా బూటకపు పత్రికా రచన సమీర్ జైన్‌లు వాటిపై అంత ఆసక్తి చూపటానికి గల ఒకే ఒక కారణం మరింత డబ్బు చేసుకోవచ్చున్నదే. నిజమైన బంగారు నగల వ్యాపారం కన్నా గిల్టునగల అమ్మకంలోనే ఎక్కువగా డబ్బు వస్తుంది. అన్నింటి కంటే ప్రధానమైనది విజయాన్ని సాధించటమే. అది కూడా రూపాయి, పైసల రూపంలో, అందుకు మిగిలిన విలువలు ఎలా పోయినా ఫర్వాలేదు.

కానీ ప్రపంచం అన్నది చాలా విచిత్రమైనటువంటిది. ఎప్పుడూ నకిలీపై అసలైనదే విజయాన్ని సాధిస్తుంది. ఆ నకిలీ బాతు ఎంతకాలం అరుస్తూ ఉంటుందన్నది మనకి అనవసరం. అదే మన బూటకపు నాయకులకి, వారి బూటకపు ప్రభుత్వానికి ఇప్పుడు తెలుస్తున్నది. పైకి కనిపిస్తున్నట్లుగా పరిస్థితులు లేవని వారికి తెలుస్తున్నది. అది బాతులా ఉన్నా, అరుస్తున్నా అది బాతుకాదని కనీసం టర్కీకోడి కూడా కాదని, కేవలం బాతు వేషంలో ఉన్న కంచర గాడిద పిల్ల అన్న విషయం అర్థమవుతున్నది.

# కోటయ్య అనుభవం - సూరయ్య నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ళ రైతులు.
ఎన్నాళ్ళనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























SAA/NIA/2802/TL

పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.

న్యూ ఇండియా ఎష్యూరెన్స్

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్

విజయా మెటర్నిటీ నర్సింగ్ హోమ్ లో
డాక్టర్ విజయ, నర్సు రీటా హడావిడిగా
డెలివరీ రూమ్ వద్దకు పరిగెత్తుకు వెళ్లారు.



కాన్పు నొప్పులు అంటువ్యాధిలా ఒకేసారి వస్తాయేమిటి? అనుకుంటూ డెలివరీ రూమ్‌లో అడుగు పెట్టింది డాక్టర్ విజయ.

పొద్దుట్నుంచీ రాఘవరావుగారి భార్య వనజ కాన్పు నొప్పులతో బాధ పడుతూనే వుంది.

ఎప్పటికప్పుడు 'ఇదిగో కాన్పు అవుతుంది' అని మనసులో అనుకుంటున్నది కాని వనజకు బేరింగ్ డౌన్ పెయిన్సు రాలేదింకా.



పిండం పొజిషన్ చూసుకుంటు ఆగకుండా కదలిపోతున్న గడియారం ముళ్లవంక చూస్తూ వుండటం తప్ప మరేమి చేయలేకపోయింది డాక్టర్ విజయ పగలంతా!

చీకటిపడ్డాక రాఘవరావుగారి బిజినెస్ పార్ట్నర్ శివానంద భార్య గిరిజను తీసికొని వచ్చారు ఆస్పత్రికి! నిజానికి గిరిజకు ఇంకా నెలలు నిండలేదు. ఎనిమిదోనెల వచ్చి నాలుగు రోజులే అయింది! పొద్దున వచ్చి ఆమె స్నేహితురాలు వనజను పలుకరించి వెళ్లింది కూడా! సాయంత్రానికి నడుం నెప్పి అనిపించితే డాక్టరుగారి దగ్గరకు తీసుకువచ్చారామెను. తీరా చూస్తే కాన్పు నొప్పులు – హడావిడిగా డెలివరి రూమ్‌కు తీసుకుని వెళ్లే లోపలే కాన్పు అయిపోయింది... చక్కటి ఆడపిల్ల!

"ఒరేయి! నీ కోరిక ప్రకారం ఆడపిల్ల పుట్టిందిరా" అన్నాడు రాఘవరావు శివానందతో ఆస్పత్రివరండాలో!

"నీ కోరిక ప్రకారం చెల్లెమ్మ మొగపిల్లవాడ్ని కనాలి!" అన్నాడు శివానంద.

"తప్పకుండా! అందుకు సందేహమా?" ఉదయంనుండి వంటరిగా ఆస్పత్రివరండాలో కూర్చుని విసుగు పుట్టిపోయిన రాఘవరావుకు శివానంద రావడంతో వుషారొచ్చింది.

వనజ గిరిజకంటె రెండునెలల ముందు నీళ్లోసుకుంది. విషయం తెలిసిన దగ్గర్నుండి వనజకు అబ్బాయి, గిరిజకు అమ్మాయి పుడతారని తామిద్దరం వియ్యమందవచ్చని రాఘవరావూ, శివానంద పరాచికాలాడుకోవడం మొదలెట్టారు. రాఘవరావు, శివానంద యిద్దరూ చిన్నప్పట్నుంచి ఒకే క్లాసులో చదువుతూ కాలేజీలో ఇంటర్‌దాకా వచ్చారు. కాలేజీ చదువువంట బట్టక ఇద్దరూ ఒకేసారి చదువుకు నామంపెట్టి వ్యాపారం చేద్దామని 'డైమండ్ టొబాకో కంపెనీ'లో జీతంలేని గుమాస్తాలుగాజేరి అయిదారు సంవత్సరాలలోనే తగినంత అనుభవం సంపాదించారు. కొద్ది పెట్టుబడితో వ్యాపారం ప్రారంభించి క్రమంగా నిలదొక్కుకుంటూ వస్తున్న సమయంలో ఇద్దరికి వివాహాలు అయ్యాయి. వనజ, గిరిజ కూడా కలుపుగోలు మనుష్యులు కావడంతో రెండు కుటుంబాల మధ్య స్నేహం, రాకపోకలెక్కువయాయి. వనజకు అబ్బాయి గిరిజకు అమ్మాయి పుడతారనీ, స్నేహితులిద్దరూ వియ్యంకులవుతారని పరాచికాలాడు కోవడం ఎక్కువయింది.

"వొరే శివా! ఆడపిల్ల తండ్రివి! కాబోయే వియ్యంకుడికి కాఫీ అయినా యిప్పించవేమిరా?"

"అలాగేరా రఘూ! రావెళ్దాం"

ఇద్దరూ ఆస్పత్రి పక్కన వున్న హోటల్‌కు వెళ్లారు. శివానంద స్వీట్‌కు ఆర్డరిస్తూ,

"ఇకనుంచి నిన్ను ఒరే అనగూడదేమో! బావగారూ అని పిలవాలి కాబోలు"

"పోరా వెధవా! నీ వెధవ మాటలు ఆపు! అసలు నిన్ను చూసికాదు మీ అమ్మాయిని నా కోడలుగా చేసుకోవాలనుకునేది. దేవతలాంటి మా చెల్లెమ్మ గిరిజ కిచ్చిన మాటకోసం అలా చేసుకోవాల్సి వస్తుందిగాని..."ఉక్రోషం ప్రదర్శించాడు రాఘవరావు.

"ఇంకా చెల్లెమ్మ మగపిల్లవాడ్ని కనలేదు. అప్పుడే జులుం మొదలెట్టావన్నమాట! అయినా రాఘవరావు కొడుక్కి పిల్ల నివ్వటానికి యీ ప్రపంచంలో ఏ ఆడపిల్ల తండ్రీ ముందుకురాడు. నేనంటే చెల్లెమ్మకిచ్చిన మాటకు కట్టుబడి వుండాలి గనుక తప్పదనుకో"

"ఆరి రాస్కెల్! చిన్నప్పట్నుంచి వున్న స్నేహితం మర్చిపోయి నిన్నగాక మొన్న వచ్చిన వనజ అంటే అభిమానం చూపుతున్నావా? ఒరేయి! ముందొచ్చిన చెవులకంటే వెనకొచ్చిన కొమ్ములు వాడి అన్నారందుకే!"

"వొరేయి నీ వాలకం చూస్తే 'మా అబ్బాయికంటే మీ అమ్మాయి ఇన్నిగంటల ఇన్నినిముషాలు పెద్దది. వరుహీనం అవుతుంది. మీ అమ్మాయిని చేసుకోవడం కుదరదు' అంటేవేమోనని నా కనుమానంగా వుంది! ఏం చేస్తావో?"

గుమాస్తా కృష్ణారావు పరిగెత్తుకు రావడంతో తాగుతున్న కాఫీకప్పులు వదలి ఆస్పత్రి వైపుకు పరిగెత్తారిద్దరూ!

డాక్టరు విజయ ముఖంలో ఆదుర్దా ప్రస్ఫుటంగా కనపడుతున్నది.

"రాఘవరావుగారూ! పరిస్థితి ఆందోళనగా వుంది. రక్తస్రావం అవుతున్నది. వెంటనే ఆపరేషన్ చేయకపోతే బిడ్డ దక్కడం కష్టం. తల్లి ప్రాణానికి కూడా రిస్కు ఎక్కువ అవుతుంది. వెంటనే రక్తం ఎక్కించాలి. బ్లడ్ బ్యాంక్‌కు వెళ్ళి రక్తం తసుకొని వచ్చే ఏర్పాట్లు చేయండి." అంటూండగానే రీటా పరిగెత్తుకు వచ్చి "మళ్లీ బ్లీడింగ్ అయింది! బిపి రీడింగ్ డెబ్బై కంటె అందడం లేదు" అన్నది.

"ఆ! అలాగా! రాఘవరావుగారూ వెంటనే మూడు బోటిల్స్ రక్తం తీసుకు రండి. త్వరగా రావాలి! ఈలోపు మేము ఆపరేషన్ మొదలెడతాము" అంటూ హడావిడిగా పరిగెత్తింది.

రాఘవరావు బెంచి మీద చతికిలబడిపోయాడు. శివానంద బ్లడ్ బ్యాంక్ దగ్గరకు పరుగెత్తాడు, బ్లడ్ శాంపిల్స్ తీసుకుని.

బ్లడ్ బ్యాంక్ డాక్టర్ సుబ్బారావుగారు శాంపిల్స్ పరీక్ష చేసి "బి- నెగిటివ్ బ్లడ్! మూడు సీసాలు ఇవ్వమంటె నేనెక్కడ తెస్తాను. బంధువు లెవరూ రక్తం యివ్వటానికి ముందుకు రారు. డబ్బు కోసం రక్తం యిచ్చే వాళ్లెవరూ యీ గ్రూప్‌కు చెందినవారు లేరు. ఈ బ్లడ్ బ్యాంక్ డాక్టరుగా వుండే కంటె అడవిలో ఆకులలములు ఏరుకుంటూ వుంటె బాగుంటుంది" అంటూంటె-

"డాక్టర్‌గారూ! నా రక్తం పరీక్ష చేయండి. సరిపడితే ఎన్ని సీసాల రక్తం అయినా తీసుకోండి! అవతల చెల్లెమ్మకు ప్రమాదంగా వుంది" అన్నాడు శివానంద.

డాక్టర్ సుబ్బారావు ముఖంలో ఆశ్చర్యం స్పష్టంగా కనపడింది. అడిగి, బతిమిలాడి కొప్పడి చెప్పినా ఎవరూ రక్తం ఇవ్వటానికి ముందుకు రారు- ఇతనెవరో చెల్లి మీద ప్రేమగల అన్న, రక్తం యిస్తానంటున్నాడు అనుకుంటూ మైక్రోస్కోపు ముందు కూర్చుని శివానంద రక్తం పరీక్ష చేయసాగాడు.

"మీది బి-నెగిటివ్ గ్రూపే! బల్ల మీద పడుకోండి. రక్తం తీద్దాం."

శివానంద బల్ల మీద పడుకున్నాడు. అతని మోచేతిపైన టూర్నికే కట్టి చేతిలో గాజ్‌రోల్ వుంచాడు డాక్టర్ సుబ్బారావు. దబ్బనం ప్రమాణంలో వున్న సూదిని మోచేతి దగ్గర సిరలోకి సర్రున గుచ్చాడు. సూదికి తగిలించిన ట్యూబ్‌లోంచి చిక్కటి నల్లటి రక్తం కింద వున్న సీసాలోకి పడసాగింది. సూది గుచ్చినప్పుడు కలిగిన నొప్పి వళ్ళంతా ఒక్కసారి కుదిపి విడిచింది. వంట్లోంచి రక్తం పోతుంటే ఏమిటో తెలియని నీరసం, మత్తు వచ్చింది. ఒక సీసా నిండాక సూది తీయబోయాడు డాక్టర్ సుబ్బారావు.

"డాక్టరుగారూ! మరొక సీసా కూడా తీయండి".

"ఒకోసారి ఒక్క సీసాకంటె రక్తం తీస్తే నీరసం వస్తుందయ్యా."

"ఫరవాలేదండి! నాకేం నీరసం లేదు! మరో సీసా రక్తం తీయండి! ప్లీజ్."

రెండో సీసా రక్తం కూడా తీసాడు డాక్టరు సుబ్బారావు.

శివానందకు వళ్ళంతా పగుల గొట్టినట్లు, కణతలు సుత్తితో మోదినట్లు అనిపించసాగింది. లేవగానే కళ్ళు గిర్రున తిరుగసాగాయి. లేని వోపిక తెచ్చుకొని డాక్టర్ విజయ నర్సింగ్‌హోమ్ వైపుగా వెళ్లాడు. వార్డు బాయ్ తెల్లటి ఎనామిల్ ట్రేలో ఎర్రటి బ్లడ్ బాటిల్సు పెట్టుకుని బయల్దేరాడు.

డెలివరి రూమ్‌లో డాక్టర్ విజయ, నర్సు రీటా హడావిడి పడిపోసాగారు. నెలలు నిండిన తర్వాత అయిదు వారాలు గడిచింది వనజకు. నొప్పులు ఆరంభం అయి ఒక రోజు దాటిపోయింది. ఇంతలో విపరీతంగా రక్తస్రావం అయి కాన్పు అయిపోయింది. మగ శిశువు అంత దృఢంగా లేదు! కాన్పు అయిపోతే రక్తస్రావం ఆగిపోతుందని ఆశపడ్డారు. కాని బ్లీడింగ్ ఎక్కువయింది. బ్లడ్ బ్యాంకుకు వెళ్ళిన వాళ్ళు ఇంకా రాలేదేమా అని ఆదుర్దా పడుతుంటే శివానంద బ్లడ్ బోటిల్సు వెంట తీసుకుని వచ్చాడు.

వెంటనే వనజకు రక్తం ఎక్కించారు. రక్తం ఒకో చుక్కా పడుతుంటే

డాక్టర్ విజయకు మనసులో ధైర్యం రాసాగింది. రెండు సీసాల రక్తం ఎక్కాక వనజ స్థితిలో మార్పు కనపడింది. రక్తస్రావం ఆగిపోయింది.

ప్రాణం కుదుటపడ్డట్టు నిట్టూర్పు విడిచింది డాక్టర్ విజయ!

వరండాలో దిగులు పడి కూర్చున్న రాఘవరావును వుషారు చేయటానికి,

"ఏరా రఘూ! మొగపిల్లవాడి తండ్రి కాబోతున్నా, ఏం అంత బెట్టుగా కూర్చున్నావు?" అన్నాడు.

ముఖాన చిరునవ్వు పులుముకుని "పోరా! ఇప్పుడు కూడా నీకు పరాచికాలేనా?" అన్నాడు కాని రాఘవరావు మనసులో భయం చాలా పెరిగి పోయింది.

"నువ్వు మాట తప్పినా చెల్లెమ్మ మాట తప్పదు లేరా! అనుకున్నట్లే అల్లుడ్ని కన్నది. నువ్వట్లా బెట్టుగా కూర్చుని చూస్తూ వుండు. పద్దెనిమిదేళ్ళయేసరికి మా అమ్మాయిని ఇంటి కోడలుగా చేసుకొని నెత్తిన పెట్టుకుంటుంది! అత్తా కోడలూ కలిసి నిన్ను ఎక్కడ వుంచాలో అక్కడ వుంచుతారు!"

డాక్టర్ విజయ బయటకు వచ్చింది.

"కంగ్రాచ్యులేషన్స్ రాఘవరావుగారూ! మీరు కోరుకున్నట్లే మగపిల్లవాడు పుట్టాడు. తల్లీ బిడ్డా ఇద్దరూ కులాసాగా వున్నారు.

అప్పటిదాకా వూరుకుని వున్నవాడు "ఒరేయి శివా! నీ ఋణం ఎన్ని జన్మలెత్తి తీర్చుకోగలనురా?" అంటున్న మాటలు శివానంద చెవికెక్కలేదు!

ఎదురుగా లారీ పెద్ద రొద చేసుకుంటూ వస్తున్నది. రాంగ్‌సైడ్‌న రావడమేగాక కారును చూసినా స్పీడు తగ్గించలేదు లారీ డ్రైవర్! బహుశా బ్రేకులు లేవేమో!

రానున్న ప్రమాదాన్ని గమనించి కారుని ఎడమ వైపుకు తిప్పాడు శివానంద. సరిగా అదే సమయానికి లారీ కూడా ఎడమ వైపుకు తిరిగింది! పల్టీలు కొట్టుకుంటూ కారు అవతలకు దొర్లిపోయింది!

శివానంద స్టీరింగ్ వీలుకీ సీటుకీ మధ్యన పడి వున్నాడు. ఫ్రంట్ అద్దం ముక్కలయి అతని వంటిని చురుకుపోయింది. రాఘవరావు డోరు తెరుచుకుని పడిపోవడంతో పెద్దగా దెబ్బలు తగలలేదు.

పట్టపగలు నడిరోడ్డున ఏక్సిడెంట్‌పాలయి రక్తం కారిపోతూ శివానంద అలా పడి వున్నా చుట్టూ గుమిగూడిన జనం ఎవరూ అతన్ని హాస్పిటల్‌కు తీసుకుని వెళ్ళటానికి ముందుకు రాలేదు! హాస్పటల్‌కు తీసుకు వెళితే పోలీస్ కంప్లెయింట్ మీద సంతకం పెట్టవలసి వస్తుందని కోర్టుల చుట్టూ తిరుగవలసి వస్తుందని భయపడి ఎవరికి వారు చూస్తూ నిలబడిపోయారు.

# గడుసులోకం

—బాబు




శివానందగారు సమయానికి రక్తం తెచ్చి యివ్వడంతో ప్రమాదం తప్పిపోయింది!" అంటూంటే కృతజ్ఞతాపూర్వకంగా ఆమె వంక చూసాడు రాఘవరావు.

"వనజకేం ఫర్వాలేదు కదా" అని రాఘవరావూ,

"మా చెల్లెమ్మ కోలుకుందా డాక్టర్" అని శివానంద ఒకేసారి అడిగేసరికి-

"ఏం ఫరవాలేదు! రక్తస్రావం ఆగిపోయింది. రెండు సీసాల రక్తం ఎక్కించాక షాక్ నుండి బాగా కోలుకుంది" అన్నది డాక్టర్ విజయ రూమ్‌కు వెళుతూ.

నర్సు రీటా వచ్చి ముఖం అంతా నవ్వు నింపుకుని "కాబోయే వియ్యంకుల కోరికలు తీరాయి. మరి మాకు ఏం కానుక యిస్తారో?" అని, "కొబ్బరి నూనె, సబ్బు, పాతగుడ్డలూ..." లిస్టు యిచ్చి తీసుకు రమ్మంది.

రాఘవరావూ, శివానంద కారు దగ్గరకు వెళ్లారు. రాఘవరావుకు ఇంకా గుండె దడ తగ్గలేదు.

"అరే! నేను డ్రైవ్ చేయలేనురా!" అంటే శివానంద స్టీరింగ్‌వీల్ ముందు కూర్చుని డ్రైవ్ చేయసాగాడు. అతనికి నీరసంగానూ, మత్తుగానూ వుంది. కళ్ళు మూరుకుపోతున్నాయి. కాని తనంటే ప్రాణాలిచ్చే వనజ ప్రాణాలు నిలుపగలిగాననే సంతోషం అతనికి కొత్త శక్తిని, ఓపికనూ యిస్తున్నది. కారు మెయిన్ రోడ్డుకు వచ్చింది.

ఆస్పత్రిలో చేర్పించాడు శివానందనూ, రాఘవరావునూ!

రాఘవరావుకు పెద్దగా దెబ్బలేం తగల్లేదు. శివానంద స్పృహ కోల్పోయాడు. నాడి చాలా బలహీనంగా వున్నది. యక్స్‌రే తీసి పక్కటెముకలు విరిగి వూపిరితిత్తి దెబ్బతిని రక్తస్రావం జరుగుతున్నదని నిర్ధారించారు.

సెలైన్ డ్రిప్ పెట్టి రక్తం కోసం బ్లడ్ బ్యాంకుకు కబురు చేసారు. బి- నెగిటివ్ బ్లడ్ దొరకలేదని తిరిగి వచ్చాడు మెసెంజరు.

మెసెంజరు తిరిగి వచ్చేసరికి రక్తం అవసరం తీరిపోయింది. శివానంద ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి!

పొద్దున రెండు సీసాలు రక్తం తీసినందు వలన నీరసించిపోయిన శివానంద శరీరం ఏక్సిడెంటు వల్ల వచ్చిన షాక్‌కు తట్టుకోలేకపోయింది!

గంట క్రితం తన భార్యకు ప్రాణదానం చేసి ఛలోక్తులు విసురుతూ తనను వుషారు చేసిన ప్రాణస్నేహితుడు మరి లేడనే విషయం రాఘవరావును నిలువునా కుంగదీసింది!

రెండు చేతులూ ముఖాన కప్పుకుని భోరున ఏడ్వడం మినహా మరేం చేయలేకపోయాడతను.

ఇప్పుడే ముఖం పెట్టుకు వెళ్ళి యీ వార్త గిరిజకు చెబుతాడు? చెప్పక తప్పేది మాత్రం ఏముంది? శివానందకూ, గిరిజకు దగ్గర బంధువులెవరూ లేరు!

స్నేహితుడైనా, హితుడైనా తనకంటే ఎవరూ లేరు!

# సంకెళ్లు వరికి?

వనజ కోసం శివానంద రక్తం దానం చేయకపోయినట్లయితే అతను షాక్‌లోకి వెళ్ళి మరణించే వాడు కాడేమో అని మనసులో పీకుతుంటే కదలలేకపోయాడు రాఘవరావు.

రాఘవరావు కంపెనీలో పని చేసే వర్కర్లు వచ్చి శివానంద శవాన్ని యింటికి జేర్చారు! మాట్లాడ లేని బొమ్మలూ అన్నీ చూస్తూ అలా వూరికే వుండిపోయాడు రాఘవరావు.

"సార్! హాస్పిటల్ నుండి ఫోను వచ్చింది".

ఉలిక్కి పడ్డాడు రాఘవరావు. మళ్లీ వనజకు ప్రమాదం రాలేదు గదా? కొన్ని గంటల క్రితం తన రక్తం కాదు తన ప్రాణం ధారపోసి ఆమె ప్రాణాలు నిలబెట్టాడు శివానందు. ఇప్పుడు మరలా ఏం వచ్చిందో?

ఫోను అందుకుంటుంటే చేతులు వణికాయి.

"ఎవరూ? రాఘవరావుగారా! గిరిజకు చాలా ప్రమాదంగా వుంది వెంటనే రండి!" డాక్టరు విజయ గొంతులో ఆదుర్దా ఫోనులో స్పష్టంగా వినబడింది.

పూనకం పూనిన వాడిలా పరిగెత్తాడు రాఘవరావు ఆస్పత్రి వైపు. కనీసం గిరిజనైనా రక్షించుకోవాలి! లేకపోతే శివానంద కూతురు తల్లీ దండ్రి లేని అనాథ అవుతుంది!

రాఘవరావు ఆస్పత్రిలో గిరిజ రూమ్ దగ్గరకు వెళ్లేసరికి వాకిట్లో పక్క గదులలోని జనం గుమిగూడి వున్నారు. డాక్టర్ విజయ రూమ్ నుండి బయటకు వస్తూ " మీ గదుల్లోకి మీరు వెళ్ళండి! అవతల అవాంతరం వస్తే మధ్య మీ హడావిడి ఏమిటి! ఓ రాఘవరావుగారా! రండి నా రూమ్‌కు వెళదాం" అంటూ రాఘవరావును తన రూమ్‌కు తీసికొని వెళ్ళింది.

"రాఘవరావుగారూ! ప్రమాద సమయాలలోనే మనిషి నైజం బయట పడుతుందంటారు. ఇప్పుడు గుండె దిటవు చేసుకుని వుండవలసిన సమయం.

శివానందగారికి ప్రమాదమైనదన్న విషయం పక్క రూములోని పుణ్యాత్మురాలెవరో పోయి గిరిజ చెవిలో వేసింది.

పచ్చి బాలింతరాలు. ఆమెకు స్వల్పంగా గుండె జబ్బు వుంది. ఆ విషయం ఆమెకు తెలియకుండా శివానందగారూ, నేనూ రహస్యంగా అట్టిపెట్టాము. కాన్పు అప్పుడు ఏం ప్రమాదం జరుగుతుందోనని భయపడ్డాం! నెలలు నిండక ముందే పురుడు రావడంతో ప్రమాదం జరగలేదని సంతోషిస్తుంటే అనుకోకుండా ఈ అవాంతరం వచ్చింది!

భర్త పోయాడని ఒక్కసారి వినగానే గిరిజ అప్‌సెట్ అయిపోయింది. విపరీతమైన వుద్రేకానికి లోనయి ఏడ్వటం మొదలెట్టింది. నేను వెళ్లేసరికి జరుగవలసిందంతా జరిగిపోయింది!

గిరిజ గుండె ఆగిపోయింది! మానవ ప్రయత్నంగా చేయవలసినవన్నీ చేసాను! ఫలితం లేకపోయింది. పుత్తడి బొమ్మలాటి బిడ్డను అనాథను చేసి పోయింది గిరిజ!"

తల బల్ల మీద ఆనించి రోదించసాగాడు రాఘవరావు! గంట నుంచి అతని గుండెలో గూడు కట్టుకున్న శోకం కన్నీళ్ళ రూపంలో వెలికి రాసాగింది. సర్వస్వం కోలుపోయి దిక్కుతోచని స్థితిలో వచ్చే శోకానికి అడ్డు కట్టవేయటం మానవ సాధ్యం కాదు.

ఆ స్థితిలో ఆయన్ని వూరడించటం కష్ట సాధ్యమని డాక్టర్ విజయకు తెలుసు! కొంతసేపు అలా రోదించినట్లయితే మనసు తేలిక పడవచ్చు!

చప్పుడు చేయకుండా కన్సల్టింగ్ రూమ్ తలుపు దగ్గరకు వేసి అవతలకు వెళ్ళిపోయింది డాక్టర్ విజయ.

* * * * *

చావు కబురు ప్రయాణం చేసినంత వేగంగా మరే వార్తా ప్రయాణం చేయదు.

రాఘవరావు టొబాకో కంపెనీలో పని చేసే వాళ్ళు శివానంద స్నేహితులూ పరిచయస్తులూ నిముషాల మీద వచ్చి డాక్టర్ విజయ నర్సింగ్‌హోమ్ ముందు చేరారు.

గంట వ్యవధిలో దంపతులిద్దరూ మరణించారనే వార్త రేకెత్తించిన కుతూహలంతో వచ్చిన వారి సంఖ్య తక్కువ కాదు.

రాఘవరావు లేచి కనులు తుడుచుకొని గిరిజ గదిలోకి వెళ్లి పుట్టిన పసి కందును చేతుల్లోకి తీసుకున్నాడు. వనజ గదిలోకి వెళ్ళి ఆమె మంచం ప్రక్కన వున్న వుయ్యాలలో తన బిడ్డ పక్కన పడుకోబెట్టాడు చేతిలో బిడ్డను.

వార్త విని కండ్ల నీరు కుక్కుకుంటున్న వనజతో "వనజా! మనం దిగులు పడవలసిన సమయం కాదు. ఇకనుంచి ఈ పాప కూడా మన బిడ్డే! గుండె రాయి చేసుకుని జరుగవలసిన పనులు చేయాలి.

శివ, గిరిజ మనమీద వదిలివెళ్లిన ఈ పవిత్రమయిన బాధ్యత సక్రమంగా నిర్వర్తించు రావాలంటే నీవు త్వరగా ఆరోగ్యవంతురాలి వవాలి" అంటూ వెళ్లిపోయాడు.

శివానంద కుమార్తెకు రూప అని, తమ కుమారుడికి స్వరూప్ అని పేరు పెట్టారు వనజ, రాఘవరావు.

రాఘవరావుకు రూపని చూడగానే జాలి, అభిమానం, స్వరూప్‌ని చూడగానే కోపం, ఒక విధమైన ద్వేషం!

వీడి వలనే వనజకు ప్రమాదం వచ్చింది. ఆమెను రక్షించబోయి తను ఆహుతి అయాడు శివ! అతనికి తోడుగా వెళ్ళిపోయింది గిరిజ!

భ్రష్టుడు! నష్ట జాతకుడు!

గిరిజ, శివానందల కర్మ కాండలు పూర్తి అయిన మర్రోజు వెళ్ళి వాసెక్టమి చేయించుకొచ్చాడు!

వనజకు మళ్లీ పురుడొస్తే ఏం ప్రమాదం ముంచుకొస్తుందో! ఆపదలో ఆదుకోటానికి శివ లేడు!

ఖర్మం చాలక వనజకు ఏమయినా అయితే ఈ ఇద్దరు పసి బిడ్డలూ అనాథలయిపోతారు!

అదిగాక "మందెక్కువయితే మజ్జిగ పలచన" అని ఎక్కువ మంది పిల్లలు కలిగిన కొద్దీ రూప బాగోగులు చూడటానికి వీలు కాకపోవచ్చు!

ఈ విషయం వనజకు కూడా తెలియకుండా రహస్యంగా అట్టి పెట్టాడు రాఘవరావు! ఆడవాళ్ళ మనసులు అగాధ సముద్రాలు! రూప కోసం తాను వేసెక్టమి చేయించుకున్నానని తెలిస్తే ఆమె మనసులో బాధ కలుగవచ్చు. అది ముందు ముందు రూప భవిష్యత్తుకు అడ్డు తగులవచ్చు!

నెలలు నిండక ముందు పుట్టిన రూప త్వరగా వళ్ళు చేసి బొద్దుగా ముద్దుగా వుంటే, నెలలు నిండి ఆపైన అయిదు వారాలు గడిచాక పుట్టిన స్వరూప్ పీలగా, బక్కగా, ఈసురోమంటూ వుండటం చూసిన వారికి ఆశ్చర్యం కొల్పేది.

వనజకు చేతి నిండా పని. గిరిజ వదిన, శివ అన్నయ్య లేరు అన్న దిగులు బాధ పెట్టకుండా రూప పనులతో క్షణం తీరిక వుండటం లేదు. స్వరూప్ కదలకుండా ఎక్కడ పడుకోబెడితే అక్కడ పడి వుంటాడు. రూప కలువరేకల్లాంటి కళ్ళల్లో నవ్వులు తళుకు మనిపిస్తూ వనజ ఎటు వెళ్తే అటు చూస్తూ పగడాల పెదవులలోంచి బోసి నోరు కనుపించేలా చిరు నవ్వులు చిలకరిస్తుంది. దగ్గరకు వెళ్ళి నుల్చుంటే వుషారుగా చేతులూ కాళ్ళూ వూపుతూ వుంటే మనసులో ఏదో మమతానుబంధం పెనవేసుకునేది!

తన కన్న బిడ్డ, పేగు తెంచుకుని పుట్టిన వాడు, రక్తం పంచుకున్నవాడు స్వరూప్... అతన్ని చూడగానే హృదయమంతా అనురాగంతో నిండిపోతుంది! ఇంటికి దీపం, కంటికి వెలుగు అనుకుని స్వరూప్ వుయ్యాల దగ్గరకు వెళితే అతను స్తబ్దంగా ఎలా వున్నవాడు అలానే వుండిపోతాడు తప్ప తల్లిని గుర్తించినట్లు ఏ మాత్రం కనపడదు! చేతులు కాళ్ళూ అలాగే కదిలించకుండా వుండిపోతాడు. కళ్ళు గాజు గోళీల్లా నిస్తేజంగా వుంటాయి.

రూపను చూసిన కళ్ళతో స్వరూప్‌ను చూస్తే ఏదోలా వుంటుంది వనజకు. రూప తను కన్న బిడ్డ కాదు అన్న భావం క్షణంసేపు మనసులో మెదులుతుంది. కాని అంతలోనే "ఛ! ఏమిటిది? రూప కన్న బిడ్డ కాకపోతేనేం? అంత కన్న ఎక్కువ! గిరిజ, శివ అన్నయ్యల గుర్తుగా తన వడిలోకి వచ్చి జేరిన పవిత్ర బంధం ప్రతి రూపం!"

వనజ మనసులో సున్నితపు త్రాసు! ఒక వైపు రూప మరో వైపు స్వరూప్! త్రాసు ఎటూ మొగ్గకుండా సమ తూకంగా వుంటున్నది! ఇద్దరూ సమానమే! ఎవరికి వారే ఎక్కువ!

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం



భారతదేశంలో అత్యుత్తమ బాడ్మింటన్ క్రీడాకారుడిగా పేరు పొంది అంతర్జాతీయ ఖ్యాతిని అందుకు శ్రీ త్రిలోక్‌నాథ్ సేఠ్ ఇటీవల గోరఖ్‌పూర్‌లో గుండెపోటుతో మరణించారు. భారత బాడ్మింటన్ అసోసియేషన్ సీనియర్ ఉపాధ్యక్షుడు శ్రీ ఫజిల్ అహమద్ తమ సంతాపాన్ని వ్యక్తం చేస్తూ శ్రీ సేఠ్ భారతీయులు గర్వించ తగిన మేటి బాడ్మింటన్ ఆటగాడని అన్నారు. 1950 వ దశకంలో నాలుగు సార్లు జాతీయ టైటిల్‌ని సాధించిన ఏకైక క్రీడాకారుడు శ్రీ సేఠ్ ఒక్కరే. సంవత్సరాల తరబడి భారత బాడ్మింటన్ జట్టుకి సారథ్యం వహించిన ఘనత కూడా ఈయనకే దక్కింది. శ్రీ సేఠ్ మృతి క్రీడారంగానికి తీరని లోటు...

నాజీ యుద్ధ నేరస్థుడు జోసెఫ్ మెంగెల్ కుమారుడు రాల్ఫ్ మెంగెల్ న్యూయార్క్‌లోని ఒక టెలివిషన్ కార్యక్రమంలో మాట్లాడుతూ తమ తండ్రి చరిత్ర తనకి తలవంపులుగా ఉన్నప్పటికీ ఆయనని ఇంకా అజ్ఞాతంలో ఉంచటానికే సహాయపడతానని అన్నారు. ఆయన తమ తండ్రిని ఆఖరిసారిగా సావ్‌పా (బ్రెజిల్)లో 1977లో చూసామని చెప్పారు. ఆ తర్వాత రెండేళ్ళకే జోసెఫ్ మెంగెల్ ఈతకొడుతూ గుండెపోటు వచ్చి మునిగిపోయినట్లు చెప్పబడుతూ ఉన్నది ...



ప్రఖ్యాత అమెరికన్ కవి, నవలా రచయిత, వ్యాస రచయిత శ్రీ రాబర్ట్ పెన్‌వారెన్ అమెరికాకి తొలి ఆస్థాన కవిగా నియమింప బడ్డారు. ఈయన వయస్సు 80 సంవత్సరాలు. కవిత్వం,కాల్పనిక సాహిత్యాలు రెండిటికి ప్రతిష్టాత్మకమైన పులిట్జర్ అవార్డుని అందుకున్న ఏకైక అమెరికన్ రచయిత ఈయన. వారెన్ రాసిన 'ఆల్ ది కింగ్స్ మెన్' నవల 1946లో ప్రచురింపబడి బహుళ ప్రజాదరణ పొందింది ...

# వారఫలం

## 25-7-1986 శుక్రవారం మొదలు 31-7-1986 గురువారం వరకు

★ **మేషం :** గ్రహ సంచారం అనుకూలం. ఒకటి రెండు దెబ్బలు నెత్తి పైకి వచ్చినవి తప్పించుకొంటారు. 'కోర్టు' వ్యవహారాలు సరేసరి, చేచేతులా చేసుకొన్నవి. వ్యాపారం అనుకూలంగా సాగుతుంది. క్రొత్తగా భాగస్వుల చేర్చుకోరాదు. స్త్రీలకు : ధనలాభం, ఉద్యోగచలనం.

★ **వృషభం :** ఏ వ్యవహారం ఎలాగున్నా యింటి వ్యవహారం, సంతానం వ్యవహారం తేల్చి వేసుకొండి, పెండ్లి పేరంటాళ్ళు వాయిదా పడుతాయి. అది మంచిదే. వ్యాపార సంబంధంగా కొందరు విదేశయానం సాగిస్తారు. స్త్రీలకు : ఒకటి రెండు మార్గాల చికాకు కలుగుతుంది. స్వల్పాదాయం.

★ **మిధునం :** ఎవరేమన్నా మీ పద్ధతులు మానకండి. వ్యాపారాన మీకు తోచిన మార్పులే చేయండి. మేలైన వారమే. అనుకొంటున్నలాగే క్రొత్త 'ఆర్డరు' కొందరకు అందనున్నది. కొందరకు గృహ మార్పు చెప్పవచ్చు. స్త్రీలకు : ధనాదాయం, ఉత్సాహం, సభా సత్కారాలు విందు వినోదాలు.

★ **కర్కాటకం :** ఉత్తరాల మూలంగా కొన్ని క్రొత్త విషయాలు గ్రహిస్తారు. వాయిదా పడిన వ్యవహారాలు మరలా కలిసి రాగలవని గ్రహిస్తారు. శుభ కార్యానుకూలత యికనుండి చెప్పదగిన ముఖ్యాంశం. ధైర్యంగా ఒకానొక లాభదాయక వ్యవహారంలో గెలుస్తారు. స్త్రీలకు : ఉత్తముల మైత్రి, వృత్తిలో వృద్ధి.

★ **సింహం :** చాల మందికి ఆరోగ్య లోపం కనిపిస్తుంది. చాల మందికి మాట పొరపాటు చేయరానంతటి అపకారం చేస్తుంది 'మానవులకు మాట నిలకడవలయును' రాజకీయంగా శ్రమించుట అనవసరం. స్త్రీలకు : ఇంటా బయటా, చుట్టు ప్రక్కల మనస్తాపానికి ఆస్కారమున్నది. ఎంత మౌనంగా ఉంటే అంత మంచిది. 'శని' గ్రహ చర్యను త్రోసివేయటం ఎవరితరం?

★ **కన్య :** ఉన్నత పదవులందున్నవారు సమయానికి మీరు కోరిన విధంగా సహాయ పడగలరు. ఒకవేళ ధన సహాయం కావాలన్నా సేకరించుకో గలుగుతారు. వ్యాపారం యిప్పటికే చాలమందికి ఈ రాశి జాతకులకు విస్తరింపబడియున్నది. తొందరపాటున అత్యాశకు లోబడి ఇబ్బందులు కొని తెచ్చుకొకండి. స్త్రీలకు : ఉత్తమ ఫలప్రదాయవారం. క్రొత్తవేవో సాధించుకో గలుగుతారు.

★ **తుల :** రాజకీయంగా ఆలోచిస్తే ఏదో సాధించామని, తద్వారా మేలున్నా లేకపోయినా పొంగిపోతారు. మధ్య వయస్కులకు విస్తారంగా మేలున్నది. నాటక నాట్య, చిత్ర రంగానుభవం గలవారు బాగా పుంజుకొంటారు. స్త్రీలకు : ఉత్సాహజనకం, ఆర్థికంగా అభివృద్ధి.

★ **వృశ్చికం :** ఇంకా గ్రహానుకూలత కలిసి రాలేదు. చాలమందికి ఆరోగ్యం చెడటంతో ఎక్కడ పనులు అక్కడ నిలిచిపోతాయి. వృత్తియందు వికాశం ఆశించినవారు కొంత ఉత్సాహంగా ఉంటారు. క్రొత్త వ్యాపారం ప్రారంభించటంగాని, క్రొత్త మిత్రుల కలయికగాని తగదు. స్త్రీలకు : ఆరోగ్యలోపం, కొందరు ప్రమాదానికి గురికావటం.

★ **ధనుస్సు :** స్మృతిపాతకులతో తికమక అవుతారు. ఏమిచేయాలో తోచనిస్థితి. ప్రయాణం చేయవలసియున్నా వాయిదా వేస్తారు. దూర బంధువులుగాని, బాగా ఎరుకగలవారుగాని అనుకోకుండా యింటికి రాగలరు. వారి బరువుబాధ్యతలు పైన పడుతాయి. స్త్రీలకు : ఇంట కళ్యాణాది శుభ కార్యాలు జరుగవచ్చు.

★ **మకరం :** కృషిలోపం లేకుండా మీకుబాగా అనుకూల దినాలు. వారం ఉత్తమ ఫలప్రదాయకం. ఆనందదాయకం. వెనుక వేసుకొన్న నాలుగు రూకలు సమయానికి అక్కరకు రాగలవు. ఆశించిన విధంగా ఉన్నత విద్యయందు పెంపు చేకూరుతుంది. స్త్రీలకు : కళాత్మకంగా అనుకూలవారం.

★ **కుంభం :** ఎంతో ప్రయాస పడిన దినాలు వెళ్ళిపోయినట్లే, రాశి స్థిత గురు భగవానుడు' యిక అనుకూల ఫలాలు, ఆదాయం, ఆనందోత్సాహాలు, వృత్తియందు పెంపు, బంధు సమాగం లాంటి శుభ ఫలితాల నివ్వనున్నాడు. స్త్రీలకు : సర్వ రంగాలలో దిగ్విజయమని చెప్పక తప్పదు.

★ **మీనం :** ముందుకూ, వెనుకకూ పోవటంతో బాగా కాలక్షేపం. రావలసిన డబ్బు అందుటకు యాగం చేసినంత కార్యక్రమం చేయవలసి రావచ్చు. దగ్గరకువచ్చే వారిలో, అలవాటుగా తెలిసిన వారిలో, ఎవరితో ఎలా మెలగాలో తెలిసికోలేక చిక్కున పడతారు. స్త్రీలకు : ఆశయసిద్ధి, ఉద్యోగమందు శుభవార్తా శ్రవణం, శుభ కార్యాదులు వాయిదా పడటం గమనిస్తారు.

-విద్వాన్‌కోటసత్యరంగయ్యశాస్త్రి

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4వ నెల నుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలూ కావాలి. దీన్ని సెరిలాక్ కానుకతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం :**
సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు-ప్రోటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థం, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయికి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా సరైన పాళ్ళలో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం :**
సెరిలాక్ మంచి పోషక పదార్థాలకు, మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం :**
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార ఉన్నాయి. దాన్ని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారుచేయడంలో, పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




ఈ సదుపాయం ప్రమోషనల్ ప్యాక్‌లపై మాత్రమే.






Nestlé

SAA/FSL/4477 TEL

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

# గెలవండి! రూ 20,000/-ల విలువైన బహుమతులు!



## కలువబాల

## చందాదారులకు లక్కీడిప్: ఆగస్టు 1 నుండి నవంబరు 1 వరకు.

రు. 60లు చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది. అదిగాక మీరి క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు. "చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది.

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా "కలువబాల"కు ఏడాది "చందాదారులుగా" చేరడమే! కాకపోతే మీ 'చందా' సైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి కలువబాల నుంచి ఒక "చిరుకానుక" కాలక్రమంలో అందుతుంది

మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు



## కలువబాల
నవ వనితా పక్షపత్రిక

# కలువబాల లక్కీడిప్ చందాదారులకు నిబంధనలు సూచనలు.

1. చందా పైకము రు. 60లు మనియార్డరు ద్వారా గాని, డిమాండు డ్రాఫ్టు ద్వారా గాని పంపవచ్చును.
2. ఎమ్.ఒ.లు పంపేవారు వారి కూపన్‌తో పాటు, ఎమ్.ఒ. పంపిన తేదీ తెలుపుతూ, దాని రశీదు జతచేసి మరీ కూపన్ పంపాలి. లేదా డి.డి.ని కూపన్‌తో జతచేయాలి.
3. చందా భారత దేశంలో వున్న వారెవరైనా కట్టవచ్చును.
4. చందా పైకము నేరుగా విజయవాడ, ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూడా కట్టవచ్చును.
5. ఎమ్.ఒ.లు, డి.డి.లు వ్యక్తుల పేర పంపించకూడదు.
6. కూపన్‌లు రిజిష్టర్డు పోస్టులో పంపరాదు. లక్కీడిప్ గడువు పూర్తి అయిన తర్వాత యిందులో పాల్గొన్న చందాదారులకు చీట్లుతీసి, పైన తెలిపిన బహుమతులను ప్రకటించుతాము. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.
7. కూపన్‌మీద, మనియార్డరు కూపన్ మీదా కూడా పంపేవారి పేరు, చిరునామా స్పష్టంగా, పూర్తిగా వ్రాయాలి. వారు ఇదివరకే చందాదారులైతే కూడా, వారి స్నేహితులెవరికైనా, "కలువబాల" చందాను బహుమతిగా కట్టవచ్చును.

- - - - - కత్తిరించాలి - - - - -



నిజమయితే ✓
కాకపోతే X
అని గుర్తుపెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. ( )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక. ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు :..............................

..............................

చిరునామా :..............................

..............................

..............................

ఎమ్ ఒ. పంపిన తేది: ..............................

లేదా

డి. డి. జత చేయడమైనది.

8. "లక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.
కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా :
కలువబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి.

9. ఈ పథకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము.
గమనిక : ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము.

10. ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌లో పాల్గొనరాదు.

# మాలిన్యం

– కాలువశ్రీ

నాకు మంచి ఉద్యోగముంది. జీతం రెండు వేల పైన్నే.. ఇంట్లో అన్ని రకాల ఖర్చు చేస్తుంది . జీవితం సుఖవంతంగానే గడుస్తుంది. నా గురించి మా ఊరివాళ్ళు రాజుకేంది మారాజు అంటుంటారు నా భార్య అరుణ డిగ్రీ వరకు చదువుకుంది. ఆమె చాలా మంచిదే... ఇంటికొచ్చిన వాళ్ళను బాగా గౌరవిస్తుంది. అయితే ఆమెకు మనుషులపై కంటి హోదాపై మక్కువెక్కువ – పేదవాళ్ళన్నా, పేదరికమన్నా అసహ్యించుకుంటుంది మాకిద్దరు పిల్లలు అమ్మాయి కవితకు పదేళ్ళు అబ్బాయి దిలీప్‌కు ఆరేళ్ళు అమ్మాయివన్నీ తల్లి బుద్ధులని, అబ్బాయివి నా బుద్ధులని జనాలనుకుంటారు.

మా ఇద్దరిది అనుకూల దాంపత్యమే అయినా కొన్ని విషయాల్లో అభిప్రాయ భేదాలున్నాయి అయితే ఘర్షణ పడకుండా సర్దుకు పోవడం మా కలవాటు.. చిత్త శుద్ధిలేని శివపూజలు వంటివి మన మనసులు స్వచ్ఛంగా వుంటే ఏ పూజల



అవసరం లేదని, నిజంగా దేవుడనే వాడుంటే పూజలూ పురస్కారాలతో సంతృప్తి చెందడని నా అభిప్రాయం... అయితే మా ఆవిడ మాత్రం రోజూ ఇంట్లో పూజ చేస్తుంది రెండు మూడు రోజుల కోసారి గుడి కెళ్తుంది నేను రానన్నా అప్పుడప్పుడు నన్నూ గుడికి లాక్కెళ్ళుతుంది

ఆ రోజు కృష్ణాష్టమి ఆఫీసుకు సెలవున్నందు వల్ల ఇంట్లోనే వున్నాను అరుణ, ఉపవాసముంది . సాయంత్రం ఒకసారి భోజనం మడి కట్టుకొని పులిహోర చేసింది పాయసం చేసింది.. ఎండ వంటలు చేసింది . పట్టు చీర కట్టుకొని గుడికి తయారయింది గదిలో కూర్చొని పేపరు తిరిగేస్తున్న నా దగ్గరకు కవితొచ్చి "డాడీ' అమ్మ రమ్మంటుంది గుడి కెళ్ళాలట ' అంది

'నిన్ను నాన్నా అని పిలువమని చెప్పాను కదమ్మా అన్నాను

నాన్నా అని పిలిస్తే అమ్మ కొడుతుంది. నేను డాడీ అనే పిలుస్తాను ."

"మరి తమ్ముడు నాన్నా అనే పిలుస్తాడు కదమ్మా . అన్నా నేను.

'వాడికేం తెలియదు నేను డాడీ అనే పిలుస్తాను అమ్మ తొందరగా రమ్మంటుంది లెండి డాడీ. అంది కవిత .

నేను కుర్చీలోంచి లేచి డ్రెస్ చేసుకుంటూ–

"నేను గుడికి రానని చెప్పాను కదమ్మా మీ అమ్మకు అన్నాను



ఇంతలో అరుణ నా గదిలో కొచ్చింది.

"సరదాగా అలా గుడి కెళ్ళొద్దామంటె ఏంటంతి మి మాటలు. ? త్వరగా తెమలండి.." అంటూ తొందరపెట్టింది..

"సరదా కయితే గుడి కెళ్ళడమెందుకోయ్.."పార్కు కెళ్ళాలి.." అన్నాను నవ్వుతూ..

"పండుగ పూట గుడికి రానన్నొద్దండి ! పదండి. ." అంది అరుణ.

"నువ్వు నన్నెడ ఒదిలేట్టున్నావ్ సరే పద ." అని చెప్పు లేసుకుంటూ.

'దిలీపేడి కనబడటం లేదు.." అన్నాను.

"గుడి కెళ్దామని ఇప్పుడే నీట్‌గా డ్రెస్ చేసాను.. బయట కెళ్ళి దుమ్ములో ఆడుతున్నాడేమో .. " అంది అరుణ.

ఇంటికి తాళం వేసి ముగ్గురం బయట కొచ్చాము... బజార్లో కూలి పని చేసుకుంటూ బ్రతికే వాళ్ళ పిల్లలతో ఆడుకుంటున్నాడు దిలీప్ . మురికి బట్టలతో జిడ్డు జిడ్డుగా వున్న ఆ పిల్లలతో కలిసిపోయి గెంతుతున్నాడు..

"ఏ మాటర్రా మురికి వెధవలతో .. ఇట్రా..." కసిరినట్టుగా అంది అరుణ.

బాబు బిక్కమొహం వేసి నా దిక్కు చూసాడు..

పిల్లల మనసులు స్వచ్ఛమైన పాల వలె అమృతం వంటివని, వాట్లో విషం చిలికి చెడుగొట్టొద్దని, పిల్లలను పెంచడంలో చాలా జాగ్రత్తలు తీసుకోవాలని నేను అరుణకు చెబుతూనే వుంటానప్పుడప్పుడు... "అరుణా! పిల్లలను ఫ్రీగా తిరుగనివ్వాలి.. అందరితో కలిసి ఆడుకోనివ్వాలి... అప్పుడే వాళ్ళు మానసికంగా ఎదుగుతారు..." అన్నాను...

"ఎవరితో పడితే వాళ్ళతోనే ఆడితే ఎలావుంటుంది... ? మి వన్నీ చిన్న బుద్ధులే.... వాని బట్టలెలా మాసి పోయావో చూడండి ... " అంది అరుణ బాబు బట్టల కంటిన మురికిని కర్చీఫ్‌తో దులుపుతూ ..

"అంటే .... పిల్లలు కూడా స్టేటస్‌ను బట్టే స్నేహాలు చేయాలంటా వంతేనా... ?" అన్నాను నవ్వుతూ.....

కవిత నా చేయి పట్టుకొని, దిలీప్ అరుణ చేయిపట్టుకొని నడుస్తున్నారు. ..

"అంటే మాత్రం తప్పేముంది.. .. ? వీడి కాడుకోవడానికి వీళ్ళే దొరికారా.... ?"

"అరుణా! మనలా వాళ్ళ కంతస్తుల తేడాలు తెలియవు.... అవి తెలియనీయ కుండా పెంచడమే మంచిదంటాను.. " అన్నాను ...

"మికున్న స్నేహితు లెవరు...? హరిజనులు,... గుమస్తాలు.. మి బుద్ధులు వాడికొస్తే ఇక బాగుపడ్డట్టే..... " అంది అరుణ నా దిక్కు రోషంగా చూస్తూ....

"మమ్మీ! మొన్న తమ్ముడు వద్దన్నా వినకుండా పనిమనిషి రాజమ్మ కొడుకుతో నాడుకున్నాడే.... "అంది కవిత.... దిలీప్ కవిత దిక్కు కోపంగా చూసాడు.

"తండ్రిచ్చిన అలుసుతో వాడిలా తయారవుతున్నాడు.... " అంది అరుణ....

మాట్లాడుతూ గుడి దిక్కు నడుస్తున్నాము. త్రోవెంబడి అటూ. ఇటూ చూస్తూ నడుస్తున్నాడు దిలీప్

"మమ్మీ! మమ్మీ! మొన్న తమ్ముడు రాధంటి వాళ్ళ అబ్బాయితో మాట్లాడాడే .. ఇద్దరు గోలీలు కూడా ఆడుకున్నారే. . " మరో ఫిర్యాదు చేసింది కవిత ..

రాధ, అరుణ స్వల్ప విషయం గూర్చి పోట్లాడుకొని మాట్లాడు కోవడం లేదు. పిల్లల్ని కూడా మాట్లాడు కోవద్దని కట్టడి చేసారిద్దరు. .. కవిత పాటిస్తుంది కాని పసివాడైన దిలీప్ కా కట్టు బాట్లెందుకో తెలియక పాటించడం లేదు. .

"ఔనా? చిన్నా. .. ? రాధ వాళ్ళ బాబుతో ఆడుకున్నావా?" అంది అరుణ బాబుతో . . .

"ఆడుకున్నాను.... ఆడుకుంటేం... ?" అమాయకంగా అన్నాడు దిలీప్....

"నీకొద్దని చెప్పలేదా.....? ఈసారి వాళ్ళతో మాట్లాడొద్దమ్మా....?" అంది అరుణ....

తలూపాడు దిలీప్....

"అరుణా! నీ కెన్నొసార్లు చెప్పాను.... పిల్లలకు ప్రేమించడం నేర్పించాలి కాని ద్వేషించడం కాదని..... నీతో మాట్లాడనంత మాత్రాన రాధ పిల్లలతో మాట్లాడొద్దని పసివాళ్ళను శాసించడం బాగుండదు.... "

అన్నాను...

"దానికి బాగా టిక్కు... ... పీడు కాడుకోవడానికి వూళ్ళో పిల్లలే లేరా. ..?"

అరుణ మాటలకు నాకు నవ్వొచ్చింది ...

నీతో కొట్లాడిన వాళ్ళ పిల్లలతో ఆడుకోవద్దు.. . కూలివాళ్ళ పిల్లలతో ఆడుకోవద్దు..... మనకంటే తక్కువ సంపాదించే వాళ్ల పిల్లలతోనూ ఆడుకోవద్దు. .. మనకంటే ఎక్కువ సంపాదించే వాళ్ళు కూడా నీ లాగే ఆలోచించారనుకో..,. అపుడు మన పిల్లలాడుకోవడాని కెవరు మిగులాౖరు.... ?వాళ్ళ పరిధినెందు కలా కుంచిస్తావు చెప్పు..... " అన్నాను....

"నేనన్న ప్రతి దానికి మిరేదేదో చెబుతారు.... గుడి దగ్గర కొస్తుందిక మన వాదాన్ని మానేద్దాం..... " అంది అరుణ.....

గుడిని సమిపించాం.... గుడిముందు నలుగురైగురు బిచ్చగాళ్ళున్నారు.... అంగ వైకల్యంతో, మాసిన తలలతో మురికి బట్టలతో వికృతంగా వున్నారు వాళ్ళు.... వాళ్ళ శరిరాలపై ఎముకలు బయటకొచ్చి లెక్క బెట్టేట్టుగా వున్నాయి....

"బాంచెను... ఒక్క పది పైస తెయ్యండ్రి.... మికు పున్నెముంటుంది బాంచెను .... ఆకలయి తంది కాల్మొక్త..... " అని దీనంగా అరుస్తూ చేతుల్లోని తెల్ల గిన్నెలను పైకి లేపుతున్నారు. ...

వాళ్ళను చూసి అసహ్యంగా ముఖం పెట్టింది అరుణ. ... వాళ్ళ దిక్కు జాలిగా చూస్తున్నాడు దిలీప్.... వాడి ముఖంలో ఎన్నో ప్రశ్నలు నాకగుపించాయి.... వాళ్ళ దగ్గరికొచ్చి నిల్చున్నాడు....

"దిలీప్! గుళ్ళో కెల్దాం పద నడువు..... " అంది అరుణ.....

వాళ్ళ కేదైనా ఇవ్వందే వాడు కదిలేట్టుగా నాకగపడటం లేదు....

# మాలిన్యం

"అమ్మా! వాళ్ళకు బాగాకలయితందే..... ఒక్క రూపాయియ్యి... " అన్నాడు దిలీప్.....

"వేలెడంత లేవు..... అన్నీ నీకేకావాలె ... నడువ్...." గద్దించింది అరుణ.....

దిలీప్ ముఖం మాడిపోయింది... దీనంగా చూస్తున్నాడు.... జేబులో వున్న చిల్లర తీసి వాడి చేతిలో పెట్టాను.... ఒక్కొక్కరి గిన్నెలో ఒక్కొ నాణెం వేసాడు.... వాడి ముఖంలో ఎంతో సంతోషం.... నన్ను గుర్రుగా చూసింది అరుణ. ..

"అనవసరంగా డబ్బు తగలేస్తారు... మి బుద్ధులు వాడికీ వస్తున్నాయి...." అంది....

బంధువులు, మిత్రులు ఇంటికొచ్చినపుడు వందల ఖర్చుకైనా వెనుదియని అరుణకు బిచ్చగాళ్ళ కిచ్చిన ఒకటి రెండు రూపాయలు దండగ్గా అనిపిస్తున్నాయి.... "అరుణా హుండిలో వేసె డబ్బుకంటే ఇలాంటి వాళ్ళ కిచ్చిన డబ్బుకే ఎక్కువ ప్రయోజన ముంటుంది... " అన్నాను ...

"గుళ్ళో కొచ్చి అలాంటి మాట లేంటండి! అలా మాట్లాడొద్దు...." అంది అరుణ ..

"నాన్నా? వాళ్ళెందు కడుక్కుంటున్నారు... ?" అన్నాడు దిలీప్....

"బాగ బలిసి.... పన్జేయడానికి శరిరం వంగక.... " అంది అరుణ....

ఆమె మాటలకు నాకు నవ్వొచ్చింది....

"అస్థిపంజరాల్లా కనబడుతున్న వాళ్ళలో నీకు బలుపు కనబడుతుందా అరుణా.... ! పోనీ వాళ్ళకు నువ్వు పనిప్పిస్తావా.... చేస్తారు... అరుణా!ఎవరూ అభిమానం చంపుకొని అడుక్కు తింటూ బ్రతుకాలనుకోరు... అంగవైకల్యం వల్లనో, బ్రతకడానికి మరో మార్గం లేకనో ఇలా బ్రతుకుతారు.... ఏ వస్తువునూ హీనంగా చూడొద్దని మహాకవి చెప్పాడు.... అయినా వాళ్ళంటే నీకెందు కంతకోపం..... ?" అన్నాను....

"పూర్వ జన్మలో ఎన్నో పాపాలు చేసుంటారు..., చేసుకున్నోల్లకు చేసుకున్నంత. .. ఎవరి కర్మ కెవరు బాధ్యులు ... ?" అంది అరుణ....

గుళ్ళోకి ప్రవేశించాము.... వాదనెందుకని మౌనంగా ఊరుకున్నాను ....

అరుణ భక్తి ప్రపత్తులతో దేవునికి నమస్కరించింది.... పిల్లలతో దండం పెట్టించింది .. బుట్టలో ఉన్న కొబ్బరికాయను పూజారి కిచ్చింది... పూజారి కొబ్బరికాయ కొట్టి ఓ వక్క అరుణకిచ్చాడు... దాన్ని బుట్టలో వేసింది..... పిల్లల చేతుల్లో చిల్లరుంచి హారతి పళ్లెంలో వేయమంది.... తానూ వేసింది.... దిలీప్ చేతికి రెండ్రూపాయలిచ్చి అక్కడున్న హుండిలో వేయమంది... వాడలాగే చేసాడు.... గుడి బయట గచ్చుపై కొంత సేపు కూర్చుండి ఇంటికొచ్చాము... కొద్ది సేపట్లో ఒక్కపొద్దు విడిచి భోజనం చేయడానికి తయారు చేస్తుంది అరుణ.... నేను నా గదిలో కూర్చొని కిటికిలో నుండి బయటకు చూస్తున్నాను.... ఓ పసివాడు చిరిగిన నెక్కరు తొడుక్కొని, ఎండిపోయిన డొక్కలతో ఈడ్చుకు పోయున్న ముఖంతో వాకిట్లో కొచ్చి నిల్చున్నాడు.... అతని ముఖం చూస్తే ఆకలిబాధతో వున్నట్టు స్పష్టంగా తెలుస్తుంది. ..

"దొర్సాని బుక్కెడంత బువ్వేయండ్రి... ఆకలయితంది బాంచెను.... " అరుస్తున్నాడా అబ్బాయి....

"పో పో ఇంకా ఒక్క పొద్దిడువ లేదు.... " ఇంట్లోంచే అంది అరుణ.....

"పండుగ్గోలె బాంచెను... పొద్దట్నుంచి ఒక్క బుక్కన్న నోట్లెకురాలె బాంచెను.... కొద్ది గంత బువ్వెయ్యండ్రి..... " అరవడానిక్కూడా ఓపిక లేక నీరసంగా అరుస్తున్నాడు....

దిలీప్ బయటకొచ్చి ఆ కుర్రాని దగ్గర నిల్చొని

సమృద్ధ పరిమళము
సరియైన ధరతో




ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.

"గులాబి మరియు ఆకుపచ్చ రంగులలో లభించును"



జయలక్ష్మి
గుంటూరు వారి
తయారీ

Imageads-2107 Tel

# ఇ·వేమన·పద్యాలు




నీళ్లలోని మీను నిగుడి దూరముబారు
బయట మూరడైన పాఱదెపుడు
స్థాన బలిమిగాని తన బల్మిగాదయా
విశ్వదాభిరామ వినురవేమ

అతనిదిక్కే చూస్తున్నాడు బాబు ముఖంలో ఆ కుర్రాని కమ్మ అన్నం పెడితే బాగుండునన్న భావముంది.

అమ్మా! ఆ పిల్లాడికన్నం పెట్టవే. " అన్న దిలీప్ మాటలు నాకు విన్పించాయి.

నేను లేచి వంట గదిలోకెళ్లాను ...

వేవుడికి నైవేద్యం పెట్టలేదు నాన్నా ఇంకొంచెం ఆగాలి. . ' అంది అరుణ....

ఒదిక్కు ఆకుర్రాడు ఆకలితో బాధపడు తుంటే

## మాలిన్యం

నైవేద్యం పెట్టడమేంటో ఆ పసివాడి కర్థం కాలేదు....

"పెట్టకుంటేందే అమ్మా! ఆ పిల్లని కాకలయి తుంది పెట్టమ్మా.... ." అన్నాడు దిలీప్.. .

"నైవేద్యం పెట్టక ముందు తింటే పాపం తలుగుతుంది.... నీకు తెలువదూకో. .. నువ్వు చిన్నోనివి. .." అంది కవిత....

"పిల్లల కొరకు ఉదయం వండిందేమన్నుంటే పెట్టులేవోయ్...."అన్నాన్నేను....

"లేదండీ.... అదప్పుడే అయిపోయింది.... వాడి కెవడికో ఆకలుంటే పిడికేంటండీ...." అని తన పనిలో నిమగ్నమయింది అరుణ....

"నేను నా గదిలో కెళ్ళి కూర్చున్నాను.

"బాగాకలయితంది బాంచెను.... కొంచెం సలిబువ్వన్నెయ్యండ్రి....." కుర్రాడరుస్తున్నాడు....

అరుణ బయట కొచ్చి "చల్ది లేదేం లేదుపో.... " అని కసిరి లోపలి కెళ్ళింది....

ఆ కుర్రాడు వెళ్ళిపోయినట్టున్నాడు. అరుపు వినబడటం లేదు... భోజనానికై అరుణ పిలుపు కొరకై ఎదిరి చూస్తూ వారపత్రిక తిరిగేస్తున్నాను....

దిలీప్ చేయి పట్టుకొని విసురుగా నాగదిలో కొచ్చిందరుణ...

"ఐదే ఐదు నిముషాలయింది నేను కవిత బావి దగ్గర కెళ్ళాము. . ఇదుగో మి సుపుత్రుడు..... ఓ గిన్నెలో పులిహోర, స్వీట్లు తీసుకెళ్ళి ఆ బిచ్చపు కుర్రాడి గిన్నెలో పడేసొచ్చాడు.. ఇంకా నైవేద్యం పెట్టలేదు..... అన్నం మైల పడింది.. . విన్నేం చెయ్యాలి.... ?" అంది దిలీప్‌ను కొరకొర చూస్తూ .....

బాబు దిక్కు చూసాను నేను.... వాడి ముఖంలో నోరూరించే వంటలుంచుకొని ఆకలిగా వున్న కుర్రాడికి అన్నం పెట్టక పోవడం అన్యాయం అన్న భావం ఉన్నట్టు నాక్కనిపించింది..... బాబును ప్రశంసా పూర్వకంగా చూసాను...

"మైల లేదేం లేదు పోవోయ్.... ఆకలితో ఉన్నవాళ్ళ కన్నం పెడితే ఏ దేవుడైనా సంతోషిస్తాడు... నీ పని ముగించుకోపో.... " అన్నాను అరుణతో....

"మీరే వాన్నిలా తయారు చేస్తున్నారు.... " అంటూ నాదిక్కు గుర్రుగా చూసి దిలీప్ వీపుపై రెండు దెబ్బలేసి బయట కెళ్ళింది అరుణ....

బిచ్చపు కుర్రాన్ని ఇష్టమున్నట్టుగా తిట్టి పంపించింది....

బుడ్డి ముఖం పెట్టుకొని ఏడ్వడానికి సిద్ధంగా వున్న దిలీప్ ను దగ్గరకు తీసుకున్నాను....

"చిన్నా' ఆకలవుతున్న వారి కన్నం పెట్టడం మంచిపనే కాని అలా పెద్ద వాళ్ళకు తెలియకుండా దొంగతనంగా పెట్టొద్దు నాన్నా.. ? ఈ సారిలా దొంగతనంగా ఏం చేయవు కదూ.... ?" అన్నాను వీపు నిమురుతూ. ...

తల్లి దెబ్బలు దుఃఖం కల్గిస్తుంటే నా ఓదార్పు ఉపశమనం కల్గించింది బాబుకు... నా మాటలు విని ఏం చేయ నన్నట్టుగా అడ్డంగా తలవూపాడు...

"భోజనానికి రండి....." కేకేసింది అరుణ.....

ఇతరుల కష్టాలకు స్పందించే మంచిగుణం.... తోటి మనిషి ఆకలిని చూడలేని ఔదార్యగుణం వున్న మా పసివాడిగూర్చి గర్వంగానే వున్నా... విద్యా వంతురాలై వుండీ ఎన్ని పూజలూ పునస్కారాలు చేస్తున్నా తనలోని మాలిన్యాన్ని కడిగేసుకో లేక పోతున్న అరుణ గూర్చి జాలిపడుతూ భోజనానికి లేచాను..... □

సెరిపేసినా యీన్నడిగే దయిర్యం వొకనిగ్గూడా లేదు"– అన్నాడు గోవిందుడు.

"సావుకారు నా కొడుగ్గదా. యీన్నే(వన్నా వొక మాటంటే ... వోడు మళ్ళీ బతకతాడా? ఆడకూతుళ్ళను సెరిపే నా కొడుకెప్పుడూ బాగు పడడు. యెప్పుడో వొకప్పుడు ఆడపిచ్చితో నే యీని బతుకు వూడ్సుకొని బోతాది."

"నాగరాజు కేందో నాగుపాము గండం వుండాదంట గదా. అట్టాంటి దేదన్నా వుంటే ఆ గండం దెగ్గిరపడి, యీన్ని యేదన్నా నాగుపాము పెరికితే బాగుండును. యీడు సస్తే.... వూరికి పట్టుకున్న పీడ యిరగడై పోతాది. యెంత సావుకారు నా కొడుకైతే మాత్రం .... యీని అగడాలకు వొక అద్దూ అపూ వుండక్కర్లా?"

"వొకయాళ.... యేదన్నా నాగుపాము కర్సినా యీడు సావడు. యీన్ని కర్సిన ఆ పామే సస్తాది. నాగుపాము కన్నా శానా యిసం(వైనోడు యీడు. యీని పెండ్లాం ముండమొయ్య.... సిన్న బిడ్డ మాదిరిగా మనం సాకి సంతరించిన పొట్టేల్ని యీని కడుపున బెట్టు కున్నాడు గదరా. యీనికి పెదరోగం తగలా."

"కొవ్వు బట్టిన పొట్టేలి గదా కూర బాగా సక్కంగా (రుచిగా) వుంటాదని కోసేసినాడు. అంతగా యీనికి తినాలని వుంటే.... ఆ వూరు ముందరకు (పొలిమేరకు) పోయి యెవురిదన్నా అమేధ్యం తినకూడదూ? మన పొట్టేల్నే తినాల్నా? యీని కడుపులో పురుగులు పడా"– శపించాడు గోవిందుడు.

"ఈ మధ్య గంగులన్న రెండో కోడలు .... బాయి గెడ్డన గెడ్డి కోస్తా వుంటే... నాగరాజు ఆ పిల్లను పట్టుకొని యీడ్సినాడు. ఆ పిల్ల పెనగలాడింది. ఆ పెనగలాటలో కాల్జారి బాయిలో పడిపోయింది. బాయిలో పడిన దాన్ని గెడ్డకెత్తితే.... ఆ పిల్ల నాగరాజు సేసిన యదవ పని గురించి వూరంతా సెప్పి, తన పరువు తీస్తాదని.... నాగరాజు ఆ పిల్లను గెడ్డకెత్త లేదు. సచ్చే దాక సూసి.... యెల్లి పోయినాడు. యిదంతా నేను కండ్లారా సూసినా వూళ్ళోవాళ్ళు మాత్రం .... ఆ పిల్ల కాల్జారి ఆ బాయిలో పడి సచ్చి పోయిందని అనుకొంట్రి"– అన్నాడు నర్సయ్య.

"యీనెమ్మా! దోవన బోయే వాళ్ళకు పుట్టిన యీనవు నా కొడుకు. యీని కంతగా నిలవలేకండా వుంటే ... యీని కూతుర్ని పట్టుకొని యీడ్సుకోరాదా? యీని సెల్లెల్ని పట్టుకుని యీడ్సుకోరాదా వూళ్ళోని ఆడకూతుళ్ళ మిద పడి



## సర్పయాగం

యీ నాగరాజు యేఁవిటి కిట్ట సెడగొట్టేది?"– అన్నాడు గోవిందుడు.

పాలకొండ నాగరాజు గురించి నర్సయ్య, గోవిందుడు యింకా యిలాగే మాట్లాడు కుంటున్నారు. వాళ్ళ గుడిసె వెనుక పొంచి వున్న నాగరాజుకు వాళ్ళు మాట్లాడే ప్రతి మాటా శూలంలా గ్రుచ్చుకుంటోంది. వాళ్ళ తిట్లు అతని హృదయాన్ని అగ్ని కణాల్లా చుంబిస్తున్నాయి.

ఆగ్రహంతో వూగిపోయాడు నాగరాజు. గోవిందుడినీ, నర్సయ్యనీ అక్కడికక్కడే నెత్తురు కక్కేలా కొట్టి చంపి.... వాళ్ళిద్దరి మృత కళేబరాల మాంసపు ముద్దల్ని ఆ తోటలోని మామిడి చెట్లకు వ్రేలాడ తీద్దా మన్పించింది నాగరాజుకు. కానీ.... ఆవేశమనేది వివేకాన్ని చెడకొడుతుందని ఆయనకు తెలుసు.

ఇప్పుడు వాళ్ళను తను చావగొడితే.... అల్లరవుతుంది. ఊరంతా తెలుస్తుంది. వాళ్ళు తనను బూతులు తిట్టారని, అందుకే వాళ్ళను కొట్ట వలసి వచ్చిందని.... అడగకపోయినా అందరికీ తను వివరణ యిచ్చుకోవలసి ఉంటుంది. కానీ యానాదులు బూతులు తిట్టారని నాగరాజు బహిర్గతం చేసుకోదలచలేదు.

అలా బహిర్గతం చేస్తే.... తన హోదా దెబ్బ తింటుందని అతని అభిప్రాయం. పైగా వాళ్ళను తను కొడితే... గంగులన్న కోడలు బావిలో పడి చావడానికి అసలు కారణం 'తను' అనే నిజాన్ని ఈ యానాదులు బయట పెట్ట వలసి వస్తుంది. అందుకే తొందర పడితే లాభం లేదని నాగరాజు ఆలోచించాడు.

వెంటనే అతని బుర్రలో ఓ ఆలోచన తళుక్కున మెరిసింది. తన కలాంటి ఆలోచన వచ్చినందుకు తనను తనే అభినందించుకున్నాడు నాగరాజు. కిలెరిగి వాత పెట్టడం అతనికి వెన్నతో పెట్టిన విద్య. ఆ పాక వెనుక నుండి మెల్లగా వెళ్ళి, కంచె దగ్గరకు చేరుకుని.... అక్కడి నుండి తిరిగి అప్పుడే ఆ తోటలోకి ప్రవేశించిన వాడిలా దగ్గుతూ .... నర్సయ్య పాక వద్దకు వచ్చాడు నాగరాజు.

"యేఁవిరా నర్సయ్యా! యంకట్రాఁవుడు కొంపలో లేనట్టుండాడే"– అన్నాడు నాగరాజు.

"లేదు సాఁవి. వోళ్ళు ఆలీమొగుడిద్దురూ పాకాల సంతకు పయనఁవై పోయిరి"– చెప్పాడు నర్సయ్య.

"యెందుకు?"

"పాముతోళ్ళు అమ్మేదానికి."

యెప్పుడొస్తారు?"

"పొద్దు పోయినాక సాఁవి."

"మ్ ... మాఁవిడి తోటకు యీయేడు పూత యట్టుండాది? యేఁవన్నా పరవాలేదా?"

"యీయేడు బెమ్మానంగా పూత పట్టుండాది. కొమ్మలు వొంగి పోతుండాయి".

"మ్.... కోతులు గానీ సెట్లపై కెక్కి పూతను రాల్సేస్తాయేఁవో జాగ్రత్తగా సూస్తా వుండండి. తోపు సుట్టూ దోవలు లేకుండా కంపా గట్రా సరిగ్గా యేసి సావండి".

"తోట సుట్టూ కంపలేసినాఁవు. కోతులు మాత్రం అప్పుడప్పుడూ వొస్తా వుండాయి సాఁవి."

"రానీ.... నీడనిచ్చే సెట్టు కొమ్మల్నే యిఱిచి పారేస్తాయి కోతులు. వాటి కెట్ట బుద్ధి సెప్పాలో నాకు తెల్సు"– అన్నాడు నాగరాజు నర్సయ్య ముఖంలోకి సూటిగా చూస్తూ.

ఇంతలో తననేదో ఆంబోతు తరుముకొస్తున్నట్టుగా అక్కడికి పరిగెడుతూ వచ్చాడు వీర్రాజు

"మాఁవిడి తోట కాపును సూసి.... బేరం మాట్లాడే దానికి తఁవరికోసం దాఁవల్ సెరువు నుంచి సత్తార్ సాయిబు వొచ్చినాడు. యింట కాచుండాడు"– హెడ్ మాస్టర్ ముందు నిలబడ్డ ఆరో తరగతి అబ్బాయిలా వినయంగా చెప్పాడు వీర్రాజు.

అతడా మాట చెప్పగానే నాగరాజు తన తోటలోంచి యింటికి తిరుగు ముఖం పట్టాడు. ఆ యానాది పాకల వద్ద నుండి పది బారల దూరం వెళ్ళగానే.... ఎదురుగా పర్వతమేదో అడ్డు తగిలిన వాడిలా నాగరాజు చటుక్కున ఆగిపోయాడు.

'పెద్దల నెప్పుడూ ప్రశ్నించరాదు' అనే విషయాన్ని చిమిడి ముక్కులతో చిన్నప్పుడే వీధి బడిలో కూర్చుని తెలుసుకోలేదు వీర్రాజు. అలాగని 'ఎందుకు ఆగినట్టు?' అని వీర్రాజు నాగరాజును ప్రశ్నించలేదు.

"వొరేయ్ వీర్రాజూ! నా మెడలోని గొలుసు కనిపించడం లేదురా. తెగి యాన్నో పడి పోయినట్టుంది"– అన్నాడు నాగరాజు చేత్తో మెడ చుట్టూ తడుముకుంటూ.

ఆశ్చర్య పోయాడు వీర్రాజు.

"తఁవరు యింట్లో యేఁవన్నా.....'

"లేదురా. యింట్లో పెట్లేదు. ఆ గొలుసును మెడలోనే యేసుకొని యీ తోపులోకొచ్చినాను యీ తోట లోపలికి వొచ్చినాగ్గూడా ... ఆ గొలుసు నా మెడలో నే వున్నింది తెగిపోయి అది యీ సుట్టుపక్కలే పడుండాల."

"తోటలో తవఁరు యెక్కడెక్కడ తిరిగినారో ఆ సోటుల్లో యెతికితే దొరకొచ్చు".

"తోటలో నేనెక్కడా తిరగలేదురా. ఆ యానాది నర్సయ్య గుడిసె ముందే. అట్టా తిరిగినా."

నాగరాజు, వీర్రాజు ఆ యిద్దరూ కలిసి దారిపై వెతుక్కుంటూ నర్సయ్య పాక ముందుకు వచ్చారు. ఇంతలో గోవిందుడూ, నర్సయ్యలు కూడా విషయం తెలుసుకొని గొలుసు కోసం ఆ ప్రాంతమంతా వెదకసాగారు.

"నాకు తెల్సు. మనం యెంత యెదికినా యింగ ఆ గొలుసు మనకు అగుపించదు"- అన్నాడు వీర్రాజు.

అతని వేపు ప్రశ్నార్థకంగా చూశాడు నాగరాజు. వీర్రాజు మందహాసం చేశాడు.

"ఆ గొలుసు తెగి పడుంటే ... యీ యానాదోడి గుడిసె ముందే పడుంటాది. అదే నిజఁవైతే ... తవరి బంగారు గొలుసూ, గోడక్కొట్టి సున్నఁవూ రొండూ వొగిటే. యింగ మనం వాటి సంగతి మర్సిపోవాల్సిందే"- అన్నాడు వీర్రాజు.

"మ్ ...అంతేనంటావా?"

"అంతగాక యింగేఁవుంది? యానాదోడి సేతుల్లో గొలుసు పడితే యింగ అంతే మరి"- అన్నాడు వీర్రాజు ఆ యానాదుల వేపు చూస్తూ.

వీర్రాజు అన్న మాటతో నిర్ఘాంతపోయి ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు గోవిందుడు, నర్సయ్యలు.

"అంత మాట అనొద్దన్నా! అయ్యగోరి బూఁవిలో పుట్టి, అయ్యగోరి బూఁవిలో పెరిగినోళ్ళం మేఁవు. అయ్యగోరి వుప్పు తింటూ బతుకుతున్నోళ్ళం. అట్టాంటి పాడు ఆలోచన్లు మా కడుపుల్లో వుండవన్నా"- దీనంగా ముఖం పెట్టి అన్నాడు గోవిందుడు.

"వొరేయ్! తడి తగిలిందంటే ... యట్టాంటి వొడ్లగింజైనా మొలక రాకుండా వుండదు. రొండు సవరల బంగారం అంటే యెంత? రొండు వేల రూపాయలు. పాడు ఆలోసెన్లు కడుపులో పడేదానికి యింతకంటే యింగేం కావాల్రా?"- అన్నాడు వీర్రాజు

"తూరు పృదఁవర తెలవని యెర్రి యానాది నా కొడుకులం సాఁవి. మేవు అట్టాంటి పాడు పనికి పాలుమార్దుఁవా? (దిగజారతామా). మాకు ఆ యెదుకొండలోడొకటి గాదు, తవఁరొకటి కాదు"- అన్నాడు నర్సయ్య నాగరాజు వేపు చూస్తూ.

"యెవుడ్రా యెర్రినా కొడుకులు మీరా? మి తెలువులు మాకు యెక్కడుండాయిరా? వొరేయ్! మీకు తిండికి కొదవ లేకుండా జరిగేటట్టుంటే ... మాకే గాదురా .. మీరు రూలింగ్ పార్టీకే యెసురు పెడ్తురు. సరే అయ్యన్నీ యిప్పుడెందుకు? ముందు గొలుసు సంగతి సెప్పండి"- అన్నాడు వీర్రాజు

"ఆ గొల్సు గానీ మా కండ్లలో పడుంటే ... అయ్యగోరు అడక్కముందే. తెచ్చిచ్చేవోళ్ళం. యే పొద్దూ అయ్యగోరి సొమ్ముల్ని దొంగిలించినోళ్ళం కాదు. నీ కాళ్ళు పట్టుకుంటాను. ఆ పాపం మా తలమింద' మోపొద్దన్నా"

గోవిందుడన్నాడు.

"వొరేయ్ మి పాపం పున్యాల గురించి మాట్లాడేదానికి అయ్యగారే(వి యమదర్మరాజుగాదు. నేనసలే సిత్రగుప్తున్ని గాదు. గొలుసును యాడ దాసి పెట్టారో మరియాదగా తెచ్చి యిచ్చేయండ"-అన్నాడు వీర్రాజు.

గడపలో నిలబడి వున్న మల్లక్క, కన్నమ్మలు అయోమయంగా ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. గోవిందుడికి నర్సయ్యలకు దిక్కు తెలియడంలేదు. వలయాకారంగా చుట్టుకున్న చిరుతవులుల మధ్య యిరుక్కుపోయిన జింకల్లా . . వాళ్ళు భయం భయంగా చూస్తున్నారు.

"వొరేయ్' పడమట పొద్దు గూకే లోపల నా గొలుసును తెచ్చి నాకు మరియాదగా యిచ్చినారా సరి ... లేకుంటే ... మీ వొళ్ళు పడబోయేది పాటు గాదు. మీ పేగుల్ని బయటకు తీసి యెండు తునకలు మాదిరిగా యీ సెట్లకు యాలాడదీస్తా. పొద్దు గూకే లోపల నా గొలుసును తెచ్చియ్యకుండా, యీ గుడిసెల్ని వొదిలి .. యక్కడికైనా పారిపోదా(వనుకుంటారే(వో. వొక సంగతిని మీరు గురుతు పెట్టుకోండి ... నాది నాగు పాము సలుపు (పగ)"- అనేసి అక్కడి నుండి తిరుగుముఖం పట్టాడు పాలకొండ నాగరాజు.

చేయని నేరానికి జడ్జిచే మరణశిక్ష విధింపబడడం విన్న నిందితుల్లా ఆ యానాదులు అలాగే శిలల్లా బిగుసుకుపోయారు నాగరాజు మెడలోని ఆ బంగారు గొలుసు ఎక్కడ పడివుందో పాపం వాళ్ళకు మాత్రం ఏం తెలుసు? అయినప్పటికి వాళ్ళు ఆ పరిసర ప్రాంతాలలో వెదకసాగారు

క్షణాలు దొర్లిపోతున్నాయి. అయినా గొలుసు మాత్రం వాళ్ళకెక్కడా కన్పించడం లేదు. క్షణాల్ను దొర్లేకొద్ది . వాళ్ళ గుండెలు మరి వేగంగా కొట్టుకోసాగాయి ఉరిశిక్ష అమలుపరచబడే ఆ భయంకరమైన క్షణాలు దగ్గరపడుతున్న ఖైదీల్లా ... వాళ్ళు భయభ్రాంతులతో కంపించిపోతున్నారు.

సూర్యుడు పడమటి కొండల చాటుకు వెళ్ళిపోతున్నాడు. అస్తమించబోయే సూర్యగోళాన్ని చూస్తూ అలాగే నిలబడిపోయాడు నర్సయ్య. పడమటి ఆకాశపు అంచుల్లాగే ... తమ బ్రతుకులు కూడా తగులబడి పోతున్నట్లు అన్పిస్తోంది అతనికి వధ్యశిల నెక్కబోయే బలిపశువుల్లా వుంది వాళ్ళ పరిస్థితి.

ఉధృతంగా వీస్తున్న గాలి ... నేల మిది ధూళిని అమాంతంగా పైకి లేపుతోంది. ఆ మామిడి తోటలో చెట్ల కింద రాలిపోయిన ఎండుటాకులు పైకి లేచి గాల్లో గిరికిలు కొడుతున్నాయి. సరిగ్గా అదే సమయంలో ... అయిదారు మందిని వెంట బెట్టుకుని మళ్ళీ మామిడితోటలో నికి ప్రవేశించాడు నాగరాజు.

"యే(వంట్రా యానాది నా కొడకల్లారా! అయ్యగారు తెల్లారి సెప్పిపోయిన మాట సెవుల్లో దూరలేదన్న మాట. మెట్టు (చెప్పు) దెబ్బలు తినాలనే రాత మి మొకాల్లో రాసి పెట్టి వుంటే ... మంచి మాట మి సెవుల్లో యెందుకు దూర్తాదిలే. నాకు తెల్సు దేవునికైనా దెబ్బే గురువు"- అన్నాడు వీర్రాజు గొప్ప సత్యం కనుక్కున్న వాడిలా.

"వొరేయ్! మిరు రొండు గుండికాయలు వుండేటోళ్ళురా. యెంతకైనా తెగించిన నా కొడుకులు మిరు. యీ పొద్దు గొలుసును దొంగిలించినారు. రేపు అయ్యగారి యినప్పెట్టిని దొంగిలిచే దానిగ్గూడా పాలుమారరు. మిరే(వి తక్కువైన లంజికొడుకులు గాదు"- అన్నాడు కొండయ్య బూతులు తిడుతూ.

"గవుర్మెంటోడు మిలాంటోళ్ళకు యీ మధ్య కొమ్ములు మొలిపించినాడురా. మిరంతా గిరిజనులంట. యెనకబడిన జాతులంట. మిమ్మల్ని ముందుకు తీస్కరావాలంట. మి బతుకుల్ని బాగుపర్సాలంట. యెందుకని? మిరంతా తయారై మాబోటోళ్ళకు గూటం కొట్టాల గదా అందుకని . ."- హేళనగా అన్నాడు వీర్రాజు.

"వొరేయ్! గవుర్మెంటు మిలాంటోళ్ళకు యెన్ని సట్టాలైనా సెయ్యనీ . మిమ్మల్ని ముడ్డి మిద గాకుంటే నెత్తిమిద యెక్కించుకోని. కానీ ... మా ముందు మాత్రం ... మి పుటకేందో, మి జాతేందో గురుతు పెట్టుకుని జాగర్తగా మెలగండ. వొళ్ళు తెలవకండా మెలిగితే తలకాయ లెగిరిపోతాయి"- హెచ్చరించాడు గురవయ్య.

గోవిందుడు నర్సయ్యలు వాళ్ళ ముందు తలలొంచుకొని మౌనంగా నిలబడ్డారు. తమనెంత నీచంగా మాట్లాడుతున్నా వాళ్ళు బాధపడడంలేదు. ఇలాంటి మాటల్ని తరతరాల నుండి వాళ్ళు భరిస్తూనే వున్నారు. మల్లక్క కన్నమ్మలు పాక ముందు నిలబడి నోళ్ళలో కొంగులు దోపుకుని ఏడ్వసాగారు.

"యేందే మి యబ్బడాల్లారా! యే(వొచ్చింది మికు రోగం? యిప్పుడే తెంచేసిన ముండల మాదిరిగా లబలబా నోళ్ళు కొట్టుకుంటా యాడస్తుండారే. మి ఆగడాలు సాలిస్తారా ... లేకపోతే ఆ నోళ్ళ మిద మెట్టేట్లు (చెప్పు దెబ్బలు)పడాల్నా?"- అంటూ వీర్రాజు కన్నమ్మ మల్లక్కల్ని కసురుకున్నాడు.

"వొరేయ్! మంచి మాటల్తో లాబంలేదు. యీళ్ళ కథ మళ్ళ సూసుకొందాం. గొలుసును యీ నా కొడుకులు యీ గుడిసెలో యాడన్నా దాసిపెట్టుంటారు. మిరంతా లోపలకెళ్ళి యతకండి. గుడిసెపై నుండే తాటి పట్టల్ని గూడా పెరికి సూడండి"- అంటూ ఆజ్ఞ జారి చేసి ... అక్కడే వున్న రాతిపై కూర్చున్నాడు నాగరాజు.

యానాదులు పాక బయటే నిలబడిపోయారు. వీర్రాజు, గురవయ్య మొదలైనవాళ్ళు గుడిసె లో కి వెళ్ళి ... గొలుసు కోసం వెదకడం మొదలెట్టారు. అది పాక లోపల ఎక్కడా కన్పించక పోవడంతో ...ఆ పాకపై కప్పిన తాటి పట్టల్ని లాగడానికి ఎగబడ్డ వీర్రాజుకు ఎండలో తళుక్కుమంటూ కన్పించింది గొలుసు.

"వొరేయ్ దొరికినాద్రా నా కొడుకులు"- అంటూ వీర్రాజు గట్టిగా అరుస్తూ ..., పై నుండి కిందికి దిగబడ్డాడు. మిగిలినవాళ్ళు గబగబా వీర్రాజు దగ్గరకు పరుగుతీశారు. చేత్తో గొలుసును గట్టిగాపట్టుకుని, నాగరాజు వద్దకొచ్చి ఆయనకు గొలుసు అందించాడు వీర్రాజు.

"వొర్నియమ్మ ... యెంత దయిర్యంరా మికు? మి దయిర్యానికి మెచ్చుకోవాల్రా. మిమ్మల్ని యింతటితో యిడ్సిపెట్టేస్తే ... అయ్యగారి యింటిని గుణాంతం (పునాది) తో లేపేసి అడియాలం (ఆనవాలు) లేకుండా సేసేందుకుగ్గూడా ప్రయత్నాలు సేద్దురు మిరు. గొలుసును గుడిసెమిద దాసేసి ... అరిచ్చెంద్రుని మాదిర్తో మాట్లాడ్తారట్రా మిరు?"

వీర్రాజు బూతులు తిడుతుంటే ... అవేవి విన్పించుకోవడంలేదు యానాదులు. ఆ గొలుసు తమ పాక మిద దొరకడంతో ... ఆ యానాదులంతా అవాక్కైపోయారు. నాగరాజు చేతిలో వున్న గొలుసు వేపు వాళ్ళు ఉన్మాదుల్లా చూడసాగారు.

"వొరేయ్ వీర్రాజూ! ఆ సెట్టు దెగ్గరికి పోయి వొక వాది సింత బర్రలు పెరక్కు రారా"- అంటూ దూరంగా వున్న ఒక చింత చెట్టు వేపు చేయి చూపెట్టాడు.

వెంటనే వీర్రాజు, గురవయ్య పరుగుతో ఆ చెట్టు వద్దకు వెళ్ళి, కొన్ని చింత బెత్తాలు పీక్కుని ... తిరిగొచ్చి ఆ బెత్తాల్ని నాగరాజు చేతికి అందించాడు. గోవిందుడు. నర్సయ్యలు ఆపాదమస్తకం కంపించి పోతున్నారు. మల్లక్క, కన్నమ్మలు విలపించసాగారు. వీస్తున్న గాలి హఠాత్తుగా స్తంభించిపోయింది.

"యారకతినే యానాది నా కొడకల్లారా!"- అంటూ ముందుకు అడుగు వేశాడు నాగరాజు అవాళ ఉదయం నర్సయ్య, గోవిందుడు తన గురించి మాట్లాడుకున్న మాటలూ, తిట్టిన బూతులూ యింకా నాగరాజు చెవుల్లో మారుమ్రోగుతూ శూలాల్లా పొడుస్తున్నాయి.

"వో యమ్మో"- అంటూ భీకరంగా అరిచి బోర్లా పడిపోయాడు గోవిందుడు.






**ఎ.ఎస్.ఆర్. – భువనగిరి**

అనీమియా ఎందువల్ల వస్తుంది. రాకుండా ఏ జాగ్రత్తలు తీసుకోవాలి? వస్తే మందులకి తగ్గుతుందా? ఏ మందులు వాడాలి?

అనీమియా రావటానికి ఆహారంలో ఇనుప ధాతువు లోపం, శరీరంలో నుంచి అధికంగా నెత్తురు బహిర్గత మవటం, కడుపులోని క్రిములు రక్తాన్ని పీల్చి వేయటం, పుట్టుకతో నే వచ్చే కొన్ని రోగాలు (హీమొలిటిక్ అనీమియా) ముఖ్య కారణాలు అవుతాయి.

వ్యక్తిగత అలవాట్లు, పౌష్టికాహారం ఈ రోగం రాకుండా చూసుకొనే మార్గాలు. ఈ రోగం వచ్చినప్పుడు రోగ కారణం కనుగొని వైద్యులు చికిత్స చేయవలసి ఉంటుంది. రోగాన్ని బట్టి మందు వాడినా, రక్త పుష్టికి ఇనుప ధాతువు ఉన్న మాత్రలు, ఇంజక్షన్లు అవసరాన్ని బట్టి వాడబడతాయి. అరుదుగా రక్తాన్ని ఎక్కించవలసిన అవసరం ఏర్పడుతుంది.

**సి.ఎస్. – గుంటకల్లు**

నా వయస్సు 35 సంవత్సరములు. నాకు కొన్ని రోజుల క్రితం కడుపులో మంటగా వుంది, గుండె దడ దడ లాడుతున్నట్లు వుండేది. డాక్టరుకి చూపిస్తే ఒంట్లో రక్తము లేదు, అందువల్ల అలా వున్న దన్నారు. ఇనుప ధాతువుగల క్యాప్సూల్స్ వాడమని వ్రాసి ఇచ్చారు. అవి వాడాక కొంచము నయమయినది. ఇప్పుడు మరల కడుపులో గాబరాగా వుండటము, ఒళ్ళంతా నెప్పులు, తల భారముగా వుంటోంది. నాకు ఇదివరకు తుమ్ములు ఎక్కువగా వచ్చేవి

మళ్ళీ ఇదివరకు చూపించిన వైద్యులనే కలిసి సలహా అడగండి. అనీమియాకి కారణం కనుగొనవలసి ఉంటుంది. రక్తం అధికంగా పోవటం, కడుపులో క్రిములు, ఆహారంలో ఇనుప ధాతువు లేకపోవటం అనీమియాకి కారణాలు. రక్త పరీక్ష, మల పరీక్ష చాలా అవసరం. ఫలితాలను బట్టి చికిత్స చెయ్యవలసి ఉంటుంది.

**సి. ఎస్. హెచ్ – హైదరాబాదు**

నా వయస్సు 18 సం.లు. నాకు ఆలోచనలు ఎక్కువ. మనస్సు నిలకడగా ఉండదు. పాఠ్య పుస్తకాలు బాగా చదవాలని ఉన్నా చదివేటప్పుడు మనస్సు దగ్గర ఉండదు. నాకు గోళ్ళు కొరికే అలవాటు ఉంది.

మానసిక రుగ్మతకి ఇవి నిదర్శనాలు. నెరవేరని ఆశలు, పుట్టుకతో నే వచ్చే కొన్ని మానసిక రోగాలు ఇలా అవటానికి దోహదం చేసే అవకాశం ఉన్నా కొందరికి ఇది స్వాభావికం. ఈ లక్షణం ఉన్న వారు కొందరు పరీక్షలలో మంచి మార్కులను తెచ్చుకోవటం కూడా ఉంటుంది. చదివిన కాసేపు వాటిని బాగా జ్ఞాపకం పెట్టుకోవటమే దీనికి కారణం. ప్రత్యేక చికిత్స అంటూ దీనికి లేదు. □

## సర్పయాగం

నాగరాజు కాలి తన్నుకు పడిపోయిన గోవిందుడి ఒంటి మీద .. చింత బెత్తాలు నాట్యం చేస్తున్నాయి. ఆ దెబ్బలతో అతని చర్మం చిరుకుపోతోంది. అతడి శరీరంలోంచి వెచ్చటి నెత్తురు చిమ్ముకొచ్చింది.

"వొద్దు సాఁవి! నన్ను కొట్టొద్దు మా రాజా! ఆ గొల్సును మేఁవు దాసి పెట్లేదు. మేఁవు యే పాపఁవూ యెరగం సాఁవి! అమ్మో! అబ్బొ ... ఆఁ ... ఆఁ ... వొద్దు సాఁవి !నన్ను ...నన్ను ... కొట్టొద్దు. సచ్చిపోతాను. అమ్మా ... అబ్బొ ... "- మెలికలు తిరిగిపోతూ గోవిందుడు పెడుతున్న ఆక్రందనలు నాగరాజు గుండెను తాకలేదు.

తల కోసెయ్యబడిన కోడిలా ... గోవిందుడు నేల మీద ... అటూ ... యిటూ పొర్లుతున్నాడు. అతడి శరీరంలోంచి వెలుపలికి చిమ్ముకొస్తున్న నెత్తుటి బిందువులు మట్టిలో యింకిపోతున్నాయి. కొడుకు చావు దెబ్బలు తింటుంటే చూడలేక ... నర్సయ్య నాగరాజు కాళ్లను వాటేసుకున్నాడు.

"పెద్దోడివి ... నీకైనా బుద్ధుండక్కర్లేదా? నీయమ్మను" ...- అని అరుస్తూ కాళ్ళు విడిపించుకొని ...నర్సయ్యను ఎడం కాలితో బలంగా తన్నాడు నాగరాజు. ఆ తన్నుతో నర్సయ్య విసురుకుపోయి గోవిందుడి పక్కన వెల్లకిలాపడ్డాడు. నాగరాజు చేతిలోని చింత బెత్తాలు నర్సయ్య ఒంటిని చీరేస్తున్నాయి.

"నన్ను సంపొద్దు సాఁవి! అమ్మా ...ఆఁ ... అయ్యో ... పెండ్లాం బిడ్డలుండేటోన్ని సాఁవి! వొద్దు ...బరించలేను సాఁవి! సచ్చిపోతాను ... నా పెండ్లాం బిడ్డలు దిక్కులేనోళ్లైపోతారు దేవరా! యింగ సాలు సాఁవి .. నన్ను కొట్టొద్దు"- అని అరుస్తూ ముంగిస చేత కొరికెయ్యబడిన పాములా విల విలలాడసాగాడు నర్సయ్య.

అతడి ముక్కుల్లోంచి నెత్తురు కారసాగింది. అతడి పెదవి చిట్లిపోయింది. శరీరమంతా మాంసపు ముద్దలా ...తయారైంది. చింత బెత్తాలు తగిన చోట గాయాలై ...అవి మండుతున్నాయి. ఆ మంటలకు భరించలేక ...నర్సయ్య ఆ గాయాలపై నోటితో గాలిని వూదుకొంటూ గిలగిలా కొట్టుకోసాగాడు.

పొలాల నుండి యిళ్లకు తిరుగుముఖం పట్టి వెళ్లిపోతున్న రైతులంతా ఈ మామిడితోటలోని అరుపుల్ని విని ... అక్కడికి పరుగుతో వచ్చారు. వచ్చిన వాళ్లంతా ఆ దారుణాన్ని చూస్తూ, అలాగే జడపదార్థంలా నిలబడిపోయారు తప్ప ... ఒక్కరు కూడా ఆ దారుణాన్ని ఆపే ప్రయత్నం చెయ్యలేదు.

తన యిష్టం వచ్చినట్లు . తన కసి తీరేలా వాళ్లని చావగొట్టిన నాగరాజు చివరకు అలిసిపోయాడు. బెత్తాలు అన్నీ విరిగిపోయాయి. గోవిందుడూ, నర్సయ్య స్పృహలేని వాళ్ళలా యిద్దరూ పక్క పక్కనే వెల్లకిలా పడివున్నారు. వాళ్లకు కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. శరీరాలు నిప్పుల్లా మండుతున్నాయి.

అలా వెల్లకిలా పడివున్న ఆ యిద్దరి దగ్గరకు వచ్చాడు నాగరాజు. గోవిందుడి గుండెల మీద ఒక కాలును, నర్సయ్య గుండెల మీద మరో కాలును పెట్టి వాళ్ల మీద నిటారుగా నిలబడ్డాడు నాగరాజు. ఆ క్షణంలో అతడు మూర్తీభవించి క్రౌర్యంలా వున్నాడు. పైశాచికత్వానికి ప్రతి రూపంలా వున్నాడు.

ఒకప్పుడు .. ఈ అనంత విశ్వంలో . . ఎక్కడా లేని మానవుడు ... కొన్ని లక్షల సంవత్సరాల తర్వాత ఈ విశ్వంలోకి వచ్చాడు. విశ్వంలో జీవం పుట్టి ... అది పరిణామం చెందిన క్రమంలో నే మనిషి కూడా తయారయ్యాడు.

కానీ ... అదే మనిషి యిలా పైశాచిక ప్రవృత్తిలో పరిణమించగలడని బహుశా ఏ శాస్త్రవేత్తా ఊహించి ఉండడు. దానవత్వం, దమననీతి యివన్నీ దట్టంగా అలుముకున్న సమాజమనే ఈ దండకారణ్యంలో ... మానవ మృగం యొక్క అధికార గర్వ విరాట్ స్వరూపమే పాలకొండ నాగరాజు.

ఈ దండకారణ్యంలో వేటాడుతున్నవాడు మనిషి. వేటాడబడుతున్నవాడూ మనిషే. పీడిస్తున్నవాడు మనిషి పీడింపబడుతున్న వాడూ మనిషే. పీడించడం, ఆ పీడను సహించడం రెండూ మనిషి స్వభావాలే. పీడించేవాడు అన్ని రకాలా బలవంతుడు. పీడను సహిస్తున్నవాడు బలహీనుడు.

(ఇంకా ఉంది)



"ఆడపడుచు"లో శివకృష్ణ, రజని



"సిల్క్ సవాల్"లో సిల్క్ స్మిత

## సినిమా విశేషాలు

–జి.వి.జి.

### "ఓ ప్రేమ కథ"

"జీవితం ఒక వరం. అందాల బృందావనం. ప్రేమ దాని ప్రతిఫలం. సాహిత్యమంటే ప్రాణమైన ఓ సంపన్నుని కుమార్తె ప్రేమ. 'ప్రేమా ఏది నీ చిరునామా' అనే సీరియల్ నవలా రచయితకే ఆకర్షితురాలై, అతనితో కలం నేస్తం చేస్తుంది. ఈమెను కారు ప్రమాదం నుంచి రక్షించిన ఓ మెకానిక్ ప్రేమభిక్ష కోరుతాడు. ఈమె సుముఖంగా ఉంటుంది. మర్నాడు దిన పత్రికలో 'ప్రేమా ఏది నీ చిరునామా' నవలకు రాష్ట్ర సాహిత్య అకాడమి అవార్డు వచ్చిన వార్తతో పాటు ప్రచురింపబడిన ఫోటోను చూసి ఆ మెకానిక్ ఈ రచయితేనా?' అని దిగ్భ్రమ చెందుతుంది. పెద్దలు సమ్మతించకపోయినా ఆ మెకానిక్‌నే పెళ్లాడుతుంది. ఆ తర్వాతే ఆమెకు అసలు విషయం తెలుస్తుంది ఆ మెకానిక్ రచయితను పోలిన వ్యక్తి మాత్రమేనని. చివరికి అసలు రచయిత తారసపడడంతో కథ అనూహ్యమైన మలుపులు తిరిగి, మరింత ఉత్కంఠ కలిగిస్తుంది" అన్నారు కౌముది పిక్చర్స్ అధినేత, సహజ కవి ఎం. ఎస్. రెడ్డి. ఈయన జూన్ 23 న ప్రారంభించిన ఈ చిత్రంలోని ద్విపాత్రలు నిర్వహించే సర్వదమన్ బెనర్జీ, రాధిక, జీవిత, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, కృష్ణవేణి, జయమాలిని పాల్గొంటున్నారు. డాక్టర్ రావూరి భరద్వాజ కథకుడు. మల్లెమాల మాటలు. పాటలురాశారు. ఎం.రంగారావ్ సంగీతం. వి. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, శివశంకర్ నృత్యాలు, సత్తిబాబు సంయుక్త దర్శకత్వం, జయంపు కృష్ణ సహకార దర్శకత్వం, జె. వి. వి. సత్యనారాయణ సహాయ దర్శకత్వం, సాయిరత్న ప్రొడక్షన్స్‌తో బి. జి. నాయుడు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. సెప్టెంబర్ 3 కి చిత్రీకరణ ముగిసే ఈ ప్రతిష్ఠాత్మకమైన చిత్రానికి రాజశ్రీ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

### "బ్రహ్మరుద్రులు"గా ఎ. ఎన్. ఆర్. వెంకటేశ్

"జూలైలో అన్నపూర్ణ స్టూడియోలో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు వైజయంతి మూవీస్ అధినేత చలసాని అశ్వనీదత్. ఈయన స్వాప్నిక క్రియేషన్స్ బానర్‌లో నిర్మిస్తున్న పై చిత్రంలో ఎ. ఎన్. ఆర్; వెంకటేశ్, లక్ష్మి, రజని, రంజని, నూతన్ ప్రసాద్, పరుచూరి గోపాలకృష్ణ ప్రభృతి నటవర్గం. పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ఎం. వి. రఘు ఛాయ, భాస్కరరాజు శిల్పం, రఘు నృత్యాలు, సూపర్ సుబ్బరాయన్ సాహసాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో కె. మురళీ మోహనరావు దర్శకుడు.



"చంటబ్బాయి"లో చిరంజీవి, భీమరాజు



"విజృంభణ"లో రాజ్యలక్ష్మి, శోభన



"పోలీసాఫీసర్"లో సుహాసిని

# సినిమా..

## నందమూరి రమేష్ దర్శకత్వంలో బాలకృష్ణ, భానుప్రియ

"దేశానికి పట్టుకొమ్మలయిన పల్లె సీమలకు సంబంధించిన రసవత్తరమైన కథ. ఆగస్టులో షూటింగ్ ప్రారంభించి అక్టోబర్‌లో పూర్తి చేస్తాం." అన్నారు నందమూరి రమేష్. ఈయన దర్శకత్వంలో వనితా ఆర్ట్స్ అధినేత ఎస్. భాస్కర్ నిర్మించే చిత్రంలో రావు గోపాలరావు, గొల్లపూడి, వేలు, శ్రీలక్ష్మి తక్కిననటవర్గం. గోపి కథ, సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, నందమూరి మోహనకృష్ణ ఛాయ, సలీం నృత్యాలు, సాహుల్ సాహసాలు, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో కంటిపూడి సత్యనారాయణ సమర్పణ.



పది సంవత్సరాలు మీ చిత్రాల్లో నటించటానికి నాచేత కాంట్రాక్టు రాయించే బదులు నన్ను పెళ్లి చేసుకోవచ్చు కదా నిర్మాతగారూ!





"పగ సాధిస్తా"లో నరేష్



# గాలిలో కలసిపోయే ధ్వనిని గాలం వేసి పట్టుకుని ముద్రించే సౌండ్ ఇంజనీర్ శివరామ్

చలన చిత్రానికి ప్రధానాంగాలు రెండు. ఒకటి ఛాయ, రెండు శబ్దం. ప్రేక్షకులకు రసపుష్టి కలిగించడానికి ఈ రెండూ అవసరమే.

ఇటువంటి ప్రాణప్రదమైన శబ్దగ్రహణ శాఖలో నిష్ణాతులై, చలన చిత్ర రంగానికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన సాంకేతిక నిపుణులలో శివరామ్ ఒకరు.

"నాకు నడివయసు దాటినా – భగవంతుడు నాలో శక్తి సామర్థ్యాలు, ఓపిక ఇంకా అలాగే ఉంచాడు. సౌండ్ ఇంజనీర్‌గా నేను సాధించ వలసింది ఇంకా ఎంతో ఉంది," అంటారాయన.

అజానుబాహుడు.... మెలి తిరిగిన మీసాలు.... గంభీరమైన విగ్రహం....

వాహినీ వారి "పోతన"లో మల్లనగా, "గుణసుందరి కథ"లో రాజకుమారుడుగా, ఇంకా "మాయామచ్ఛీంద్ర, షావుకారు, దీక్ష, విప్రనారాయణ, మంచి చెడూ, రంగులరాట్నం" వగైరా ఎన్నో చిత్రాలలో ఈయన తెర ముందు కూడా దర్శనమిచ్చారు.

"నాకు నటించడమన్నా ఇష్టమే, సౌండ్ ఇంజనీర్ ఉద్యోగమూ ఇష్టమే. ఐతే, ధ్యేయం ఒకదాని మీద ఎక్కువగా ఉండాలని నేను నటించడం పట్ల దృష్టిని అంతగా కేంద్రీకరించ లేదు," అన్నారు శివరామ్....

అసలీయనకు మొదట్నుంచీ సాంకేతిక శాఖల పట్లే శ్రద్ధ ఎక్కువ. ఈయన పూర్తి పేరు వల్లభజోశ్యుల శివరామకృష్ణారావు. బి.ఎ; బి.ఎస్‌సి. గుంటూరు ఎ.సి. కాలేజీలో చదువు కుంటున్నప్పుడు వార్షికోత్సవాలలో పాడేవారు. చక్కని స్పోర్ట్స్‌మన్ కూడా. నాటకాల కన్నా క్రీడలలో నే ఎక్కువ ఉత్సాహం చూపేవారు. ఈయన తండ్రి సంగీత విద్వాంసులు, ప్రముఖ వైణికులు. కుటుంబంలో అందరూ సంగీతప్రియులే. శివరామ్ రెండవ అన్న డాక్టర్ రామస్వామి శర్మగారు వాహిని వారి "పోతన"లో సింగభూపాలుని పాత్ర ధరించారు. శివరామ్ బాల్యంలో వయొలిన్, వీణ, సితార్ చక్కగా వాయించేవారు. "సౌండ్ రికార్డిస్ట్‌కి సంగీత జ్ఞానం అవసరం లేకపోయినా– కాస్త కూస్త లయజ్ఞానం, రాగజ్ఞానం ఉంటే, పాటల రికార్డింగ్‌కు ఎంతో మంచిది," అంటారీయన.

ఈయన పట్టభద్రులయ్యాక 1939లో ఉద్యోగాన్వేషణలో మద్రాసుకు చేరుకున్నారు. అప్పుడు వాహిని వారు "సుమంగళి" చిత్రం తీస్తున్నారు. ఆ చిత్రానికి కీ. శే. కె. వి. రెడ్డి ప్రొడక్షన్ మేనేజర్. ఆయన్ని శివరామ్ కలుసుకుని, తనకు ఏదైనా సాంకేతిక శాఖలో ప్రవేశించాలన్న తలంపు ఉన్నట్టు తెలియ జేశారు. "మాకు స్వంత స్టుడియో అంటూ ఉంటే, మీ కోరిక నెరవేరేదే!" అంటూ పెదవి విరిచారు కె. వి.

"పోతన" చిత్రం కె.వి. రెడ్డి దర్శకత్వంలో ప్రారంభింపబడుతూన్న సమయంలో అసోసియేట్ డైరెక్టర్‌గా ఉన్న తన మిత్రులు కమలాకర కామేశ్వరరావును కలుసుకోడానికి వచ్చారు శివరామ్. అప్పుడు శివరామ్ వంక కె.వి. నిశితంగా పరిశీలించారు! అంతే.... "పోతన"లో మల్లన పాత్ర ధరించే మహదవకాశం శివరామ్‌కు అలా లభించింది. ఈయన నటించి గుంటూరుకు వెళ్ళిపోయాక , "మాయామచ్ఛీంద్ర" చిత్రంలో నటించడానికి పి. పుల్లయ్యగారి దగ్గర్నుంచి కబురొచ్చింది. ఈ చిత్రం తర్వాత శివరామ్ 1945లో మళ్ళీ గుంటూరు చేరుకుని, ఎ.సి. కాలేజీ ఫిజిక్స్ డిపార్ట్‌మెంట్‌లో డిమాన్‌స్ట్రేటర్‌గా చేరారు. అప్పుడు నాటకాల పట్ల ఆసక్తి పెరిగి, "నవజ్యోతి సమితి" నెలకొల్పారు. స్వర్గీయ ముక్కామల కృష్ణమూర్తితో కలిసి కొన్ని నాటకాలు ఆడారు. అప్పుడు ఎన్. టి. ఆర్., జగ్గయ్యగార్లు ఎ.సి. కాలేజీలో విద్యార్థులు. "భక్త కబీర్" నాటకంలో శివరామ్ ప్రధాన పాత్రను అద్వితీయంగా పోషించడమే కాకుండా సంగీత దర్శకత్వ బాధ్యతనూ వహించారు. ఇంతలో కె.వి. దగ్గర్నుంచి కబురొచ్చింది "మా వాహినీ స్టూడియో నిర్మాణంలో ఉంది. ఏదైనా టెక్నికల్ శాఖలో ప్రవేశించాలన్న మీ కోరిక ఈడేరే సమయం ఆసన్నమైంది." అంటూ.

1948లో శివరామ్ వాహినీ స్టూడియోలో సౌండ్ ఇంజనీర్ ఎ.వి.కృష్ణయ్యర్ వద్ద అసిస్టెంట్‌గా చేరారు. 1950లో రికార్డిస్ట్ అయ్యారు. ఈయన పూర్తిగా సంభాషణలు రికార్డ్ చేసిన తొలి చిత్రం భరణీవారి "లైలామజ్ను". పాటలు రికార్డ్ చేసిన తొలి చిత్రం ప్రతిభావారి "శ్రీ లక్ష్మమ్మ కథ". 1955లో అసిస్టెంట్ రికార్డింగ్ ఇంజనీర్ అయి, 1962 న వాహినీ స్టూడియోల్లో శబ్దగ్రహణ శాఖ అధిపతి అయ్యారు. ఇంతవరకు వివిధ భాషల్లో ఎన్నో వేల పాటలు రికార్డ్ చేశారు. రీరికార్డింగ్ విషయంలో సిద్ధహస్తులనిపించుకున్నారు.

"నేడు సౌండ్ రికార్డింగ్ పట్ల చాలా మంది చిన్న చూపు చూస్తున్నారు. ప్రేక్షకులకు కూడా శబ్దగ్రహణం పట్ల తేలిక భావమే ఉంది. శబ్దగ్రహణంలో ఇదివరకటి కన్నా ఇప్పుడు విప్లవాత్మకమైన అభివృద్ధి వచ్చింది. ఎన్నెన్నో పద్ధతుల్లో ధ్వనిని రికార్డ్ చెయడం జరుగుతోంది. ఆనాడు "పోతన"లో "బాలరసాలసాల" పద్యాన్ని ఔట్‌డోర్‌లో ఒక పొలంలో అప్పటికప్పుడు నేనే స్వయంగా పాడుతూంటే రికార్డ్ చేస్తూ, అదే సమయంలోనే ఎక్స్‌పోజ్ చేశారు కూడా. ఒక మైక్ నాకు, మరో మైక్ పక్కనే ఉన్న ఆర్కెస్ట్రా వారికి ఏర్పాటు చేయబడింది. పద్యం అంతా ఒక్క షాట్‌లోనే తీశారు. నేడు మల్టీట్రాక్ రికార్డింగ్ ఎక్విప్‌మెంట్లు, కంప్యూటరైజ్డ్‌వి కూడా వచ్చాయి. మహానదికి ఉపనదులలాగా ఒక్కో ఛానల్ ఒక్కో ధ్వనిని గ్రహించేందుకు ఏర్పాటు చేయబడ్డాయి. శ్రుతి ఇచ్చే తంత్రి వాద్యాల ధ్వని ఒక ఛానల్. లయను ఇచ్చే తబల– డోలక్– మద్దెల– గజ్జెలు మరో ఛానల్. గాయనీ గాయకుల పాట గ్రహించేందుకు మరో ఛానల్.... వీటన్నిటి సమన్వయమే పాట. ఇందువల్ల ఉపయోగాలు కూడా ఉన్నాయి. ఒక భాష నుంచి మరో భాషలోకి డబ్ చేసేటప్పుడు ఆర్కెస్ట్రా ట్రాక్‌లను అలాగే ఉంచి, గాయనీ గాయకుల చేత మరో భాషలో కొత్తగా పాడించి రికార్డ్ చేయొచ్చు. మిక్సింగ్‌లో సంభాషణలకు నేపథ్య సంగీతాన్ని జోడించడానికి ఎంతో ఓర్పు, నేర్పు అవసరం," అనే శివరామ్ పర్ఫెక్షన్ కోసం పాటు పడేవారని ప్రతీతి.

ఈయన స్నేహపాత్రుడు. మృదుభాషి. ఈ మేధావి శక్తి సామర్థ్యాలను సినిమా రంగం మరి పది కాలాల పాటు వినియోగించు కుంటుందని ఆశిద్దాం.

(– జి. వి. జి.)

# తారాపథానికి కరదీపిక!!

సినిమా రంజని

కమ్మని తాజా కబుర్లతో,
కనువిందయిన చిత్రాలతో,
యువతరానికి తెలియని అలనాటి
విశేషాలతో, వారం, వారం
అభిమానులందరినీ అలరించే
విధంగా అందంగా, అపురూపంగా
ముస్తాబవుతోంది!!

DESIGNED BY P A RANGA



"కలియుగ పాండవులు"లో కుష్బూ, వెంకటేశ్



"కలియుగ కృష్ణుడు"లో రాధ

# ఇరుగు - పొరుగు

● అర్జున్ అసలు పేరు శ్రీనివాస హర్ష. చదువుకునే రోజుల్లో అటెండన్స్ రిజిష్టర్‌లో ని పేరు అశోక్‌బాబు. ఇంట్లో అందరూ ముద్దుగా పిలిచే పేరు 'శీనూ'. ఇతని పేరును అర్జున్‌గా మార్చింది తమిళ దర్శకుడు రాజేంద్రన్.

● మనోచిత్ర ఇప్పుడు పలు కన్నడ చిత్రాల్లో నటిస్తోంది. కర్నాటకలో ఆమె పేరు మందాకిని.

● బాలచందర్ చిత్రం "పున్నగై మన్నన్" (నవ్వుల రాజా) చిత్రంలో కంప్యూటర్ మూలంగా ఇళయరాజా సంగీతమిస్తున్నారు.

● డైరెక్టర్ కె. శంకర్ చిత్రం "నంబినార్ కెడు పదిల్లై" (నమ్మినవారు చెడిపోరు) అనే శబరిమల అయ్యప్పస్వామి మహిమలు తెలిపే తమిళ చిత్రంలో అమితాబ్‌బచన్, రజనీకాంత్ గౌరవ పాత్రలలో కనిపిస్తారు.

● కమలహాసన్ తల్లి పేరు రాజలక్ష్మి. సారిక ప్రసవించిన శిశువుకు "శృతి రాజలక్ష్మి" అని నామకరణం చేశారు.

● భారతీయ చలన చిత్ర పితామహుడు దాదా సాహెబ్ ఫాల్కే పేరిట ఒక అవార్డు ప్రతి ఏటా చలన చిత్ర ప్రముఖులకు ఇవ్వబడుతోందన్న విషయం అందరికీ తెలుసు. ఐతే, ఈయన ఏకైక పుత్రుడు బ్రతుకు తెరువు కోసం బొంబాయి పుర వీధుల్లో అగర వత్తులు అమ్ముకుంటున్నాడన్న విషయం కొందరికే తెలుసు.

● నిజ జీవితంలో కూడా తాను 'రజని' అనిపించుకుంది టి.వి. సీరియల్‌లో నటించే ప్రియా తెందూల్కర్. ఇటీవల ఈమె బొంబాయిలోని విలే పార్లే ప్రాంతంలో తన చెల్లెలి పెళ్ళికి చీరలు కొనడానికి ఒక కొట్టుకు వెళ్తే, అక్కడామె హేండ్ బాగ్‌ను ఓ చోర నారి కాజేసింది. వెంటనే ఆ దొంగను ఆమె వెంబడించి పట్టుకుని, పోలీసులకు అప్పగించింది.

## నటికి ఏడు సూత్రాలు:-

1. ఇంట్లో ఉన్నప్పుడు ఒంటి నిండా ఉడుపులు ధరించాలి.
2. షూటింగ్ ముగిశాక అదే కాస్ట్యూమ్‌లో ఇంటికొచ్చి, పిల్లల ముందు తిరక్కూడదు.
3. సదా వీడియోనో, టి.వి.నో చూస్తూ కాలహరణం చేయకూడదు.
4. షూటింగ్‌లు లేనప్పుడు వంటా వార్పూ వగైరాలు నేర్చుకోవాలి.
5. ప్రతి శుక్రవారం తలార స్నానం చేయాలి.
6. ఒంటరిగా కారు డ్రయివ్ చేసుకెళ్ళకూడదు.
7. ప్రతి ఉదయం దేవుని ధ్యానించాలి.

ఇవన్నీ నర్తకి డిస్కో శాంతికి వాళ్ళ అమ్మ విధించిన ఆంక్షలు. శాంతికి అన్నీ ఓ.కే. ఆరవది తప్ప. "నేను కారును చాలా బాగా డ్రయివ్ చేస్తానని మా అమ్మకు తెలుసు. ఇటీవల మా డ్రయివర్ ఒక చోట ఏక్సిడెంట్ చేశాడు. మా కారుకు దెబ్బ తగల్లేదు. ఎవ్వరికీ గాయాలు కాలేదు. అయినా, మా అమ్మ నన్ను ఒంటరిగా కారు డ్రయివ్ చేయకూడదనడం బాగోలేదు," అంది శాంతి. —(జి.వి.జి)

# అభిమాన తారలపై అభిప్రాయం

చలన చిత్ర ప్రపంచంలో 'కెమెరా ఉమెన్'గా ప్రవేశించి తమిళ చిత్రాలలో నటిగా రాణించి, తెలుగు చిత్రాలలో మేటి నటిగా తెలుగు ప్రేక్షకుల చేత "శభాష్" అనిపించుకున్న నటి సుహాసిని. ఈ మధ్యనే తమిళంలో అవార్డును అందుకోవటం ఆమె నటనా ప్రతిభకు నిదర్శనం. తమిళంలో అవార్డులు వచ్చినా, ఎక్కువగా తెలుగుచిత్రాలలో నటిస్తూ ఉన్నాననీ, అవి తగ్గించుకునే ప్రశ్నే లేదని సుహాసిని చెప్పటం అభినందించదగిన విషయము. దర్శకత్వ



శాఖలో కూడా ప్రావీణ్యం సంపాదించటానికి కృషి చేస్తున్న ఆమె ఆశయానికి ఆంధ్రప్రేక్షకుల ఆశీస్సులు, ఎప్పుడూ ఉంటాయని నేను ఆశిస్తున్నాను- ఇదే విధంగా నటనకు భాష్యం చెప్పే నటీమణుల డైరీలో ఓ పేజీ తనదంటూ సంపాదించుకున్న సుహాసిని తెలుగులో కూడా అవార్డులు అందుకోవాలని, ఆ శుభదినం త్వరలో రావాలని కోరుకుంటున్నాను-

—రామకృష్ణ పాత్రుని, గాంధీనగరం, విజయవాడ

★ ★ ★

ఆంధ్రుల అభిమాన నటుడు, నటశేఖర, సూపర్‌స్టార్ కృష్ణగారు నాఅభిమాన హీరో. ఎంతటి క్లిష్టమైన పాత్రనైనా సమర్ధవంతంగా పోషించగల నటుడు కృష్ణ.

తెరపైనే గాకుండా నిజ జీవితంలో కూడ పేద ప్రజలకు అంతగా నిలిచే సాహస హీరో కృష్ణ. ఎవరికి



హాని తలపెట్టని మంచి హృదయం గల "మహామనిషి" కృష్ణ. తాను చేపట్టే కార్యక్రమం ఎంతటి జటిలమైన దైనా పట్టుదలతో విజయం సాధించే "సాహస నటచక్రవర్తి" కృష్ణ.

నృత్య సన్నివేశాలలో ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని, ఒకే తరహా పాత్రలు గాకుండా అన్నిరకాల పాత్రలను పోషించి, ప్రేక్షకాభిమానుల మన్ననలను పొందాలని ఆకాంక్షిస్తున్నాను. దర్శక, నిర్మాతగా కూడ మంచి పేరు తెచ్చుకున్న కృష్ణగారు మంచి చిత్రాలను రూపొందించాలని కోరుతున్నాను.

— బి. శ్రీహరి రావు, హుకుంపేట, విజయనగరం

★ ★ ★

నా అభిమాన తార జయసుధ. ఆమె సినిమాలంటే నాకు చాల యిష్టం. ఆమె ఎప్పుడూ నా మనసులో మెదులుతూ ఉంటుంది. ఏ కథనైనా, నవలనైనా చదివినప్పుడు - అందులోని హీరోయిన్ నా జయసుధగా ఊహించుకొంటాను. చక్కని రూపం, దానికి తగిన నటన కలిగినది నా ప్రియతార.

శంఖాకారం వంటి కంఠం, శ్రీకారంలాంటి చిన్ని మూతితో చంద్రమోహన్ గారినే గిలిగింతలు పెట్టింది - ఆ గోపాలరావు గారి అమ్మాయి. చేస్తున్నది నటనైనా, ఆ కథలోని పాత్ర, భావనలు స్వయం అనుభూతి చెంది విధి వంచితురాలైన ఒక స్త్రీ జీవితాన్ని 'ఇది కథ కాదు' అని చాటి చెప్పి ప్రేక్షకుల కళ్లలో అశ్రుధారలు కురిపించినది. ఏమైనా ఆమెను హీరోయిన్ ఆఫ్ ట్రాజెడి అనడంలో అతిశయోక్తి లేదు.

ఇలా ఎన్నో సినిమాలలో ఆమె పాత్రలు చిరస్మరణీయములు. [illegible] ఆమె నటన.



శాశ్వత గుర్తులుగా 'ఇల్లాలు' మనకు మరుపురానిది.

ఆమె డైలాగ్ డెలివరి బాగుంటుంది. పోషించే పాత్రకు జీవం పోసి, నటనలో నాణ్యత చూపించే జయసుధ సినిమాలు ఈ మధ్య బాగుంటటంలేదు. కాబట్టి ఆవిడ ఉదాత్తమైన, గంభీరమైన పాత్రలు ధరించాలి. చక్కటి ఫామిలీ కథా చిత్రాల్లో, విప్లవాత్మక చిత్రాల్లో స్త్రీ గౌరవం చాటి చెప్పే విధంగా ఆవిడ నటించాలి. సంఘ సేవికురాలుగా, కుల భేదాలు నిర్మూలించే శక్తిగా, వరకట్న దురాగతాలు రూపుమాపే విప్లవ జ్యోతిగా సినీ ప్రపంచంలో మెలగాలి. ఉత్తమ నటన ధ్యేయంగా తారాపథంలో నా తార ధృవతార కావాలని నా ఆకాంక్ష.

-కె. శకుంతల, చోడవరము

★ ★ ★

నా అభిమానతార విజయశాంతి. విజయశాంతి గ్లామర్‌వల్ల కొందరికి, టాలెంట్‌వల్ల కొందరికి అభిమాని అయ్యారు. అగ్నిపర్వతం, శ్రీవారు, ప్రతిఘటన, శ్రావణ సంధ్య మొదలైన చిత్రాలు ఆమె నటనా ప్రతిభకు దర్పణాలు. ఎటువంటి పాత్రలనైన అవలీలగా పోషించగల నటనా సామర్థ్యం ఉన్న నటి విజయశాంతి. కథా బలమున్న చిత్రాలలోను, ఫ్యామిలీ సెంటిమెంట్ చిత్రాలలోను ఎక్కువగా నటిస్తే ప్రేక్షకులలో మంచిపేరును సంపాదించుకో గలుగుతారు.

విజయశాంతిగారు నటించే ప్రతి పాత్ర వెరైటీగా ఉండాలని నా అభిప్రాయం. ఇంతవరకు సంపాదించుకొన్న ప్రజాభిమానాన్ని కోల్పోయేలా పాత్రలను ఎంపిక చేసుకో కూడదు.



విజయశాంతిగారు సాంఘిక, పౌరాణిక చిత్రాలలో నటిస్తే చూడాలని ఉంది.

ప్రముఖ దర్శకులు కె. విశ్వనాథ్ గారి దర్శకత్వంలో ఆమె నటిస్తే చూడాలని ఉంది. రాష్ట్ర స్థాయిలో "ఉత్తమనటి" అవార్డు నందుకొన్న విజయశాంతిగారు జాతీయ స్థాయిలో "ఉత్తమ నటి" అవార్డు అందుకోవడానికి ప్రయత్నం చెయ్యాలి.

— షేక్ సయ్యద్ బాజీ, దొండపూడి

★ ★ ★

నా అభిమాన నటుడు కమలహాసన్. 'ఆకలిరాజ్యం', 'అమావాస్య చంద్రుడు' చిత్రములను, చెప్పదలచిన మాటలను తన ముఖకవళికలు హావభావాల ద్వారా తెలియజేసే వారి నటనను చూసి వారి అభిమానిని అయ్యాను.

విభిన్న తరహా పాత్రలలో నటిస్తూ తన కంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకొన్న నటుడు



కమలహాసన్ "ఏక్ దూజే కేలియే", "యాదేంగార్", "సాగర్" మొదలగు హింది చిత్రములలో నటించి ఉత్తరాదిన తనపేరు నిలబెట్టుకున్నాడు.

'సాగర సంగమం', 'స్వాతిముత్యం' వంటి తెలుగు చిత్రములలో అద్భుతంగా నటించి అందరిని మెప్పించి తెలుగు ప్రేక్షకులకు మరింత దగ్గరయ్యారు. మంచి కథాబలం ఉన్న డైరెక్టు తెలుగు చిత్రములలో ఎక్కువగా నటించమని అభిమానిగా వారిని కోరుచున్నాను.

—ఇ. సుధాకర్, న్యూ పాల్వంచ ☐

కొత్త శీర్షిక

# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



ప్రారంభం!

**కె. శంకర్, ఇల్లందు**

ఈసారి కూడా సూపర్ హీరోయిన్‌గా మీరు ఎన్నిక కావాలని కోరుకుంటున్నాను. మరి మీ అభిప్రాయం?

మీ అభిమానానికి కృతజ్ఞురాల్ని. ప్రతి ఏడూ సూపర్ హీరోయిన్‌గా రావాలని అందరికీ వుంటుంది. అయితే అందరిలో ఎవరు సూపర్ హీరోయిన్ అవుతారు అనేదే చివరిదాకా తెలియని విషయం. గత ఏడాదికి మల్లే యీ ఏడు కూడా మంచి చిత్రాలు... మంచి పాత్రలు... ధరిస్తున్నాను. మీ అభిమానపాత్రురాల్ని అవుతాననే నమ్మకం వుంది.

**యం. శ్రీనివాస్, అనంతపూర్**

మిమ్మల్ని తమ ఆరవ ప్రాణంగా భావించి మీపై అభిమానంతో అభిమాన సంఘాలు పెట్టి ఇతర అభిమాన సంఘాలతో గొడవపడుతున్న వారికి మీరిచ్చే సమాధానం ఏమిటి?

తమ అభిమాన నటీనటుల్ని అభిమానించడంలో ఎటువంటి తప్పులేదు. అయితే ఆ అభిమానం దురభిమానంగా మారకూడదు. అభిమానులే నటీనటులకు ఆశాదీపాలు అని అభిప్రాయపడే వాళ్ళలో నేనొకర్ని. అయితే అనవసరంగా ఎవరితోనూ గొడవపడకుండా మీ కాలాన్ని పాడుచేసుకోవద్దని మాత్రం కోరుతున్నాను.

**ఆర్. అరుణ, సికింద్రాబాద్,**
**పి. ఎం. రాజేష్, బెంగుళూరు-13**

శాంతిగారూ మీరు జీవించిన (నటించిన) 'ప్రతిఘటన' చిత్రం తెరపై ఒక నటిగా కాని లేక ప్రేక్షకురాలిగా చూచినప్పుడు మీరు ఎలా ఫీలయ్యారు?

ఆ అనుభూతిని ఎలా వివరించను.

**జి. విజయ్‌కుమార్, మహబూబాబాద్**

నేడు వస్తున్న సినిమాలు ఎవరికి ఎటువంటి ప్రయోజనం లేకపోగా చెడు ప్రభావాలను ప్రేరేపిస్తున్నాయని నేనంటాను. మరి మీరేమంటారు?

మిమ్మల్ని ఏమీ అనను. మీ అభిప్రాయాన్ని మాత్రం మార్చుకొమ్మని చెబుతున్నాను.

## ఉత్తమ ప్రశ్న

**పి. వాసంతి, విజయవాడ**

ఇప్పటివరకూ మీరు ధరించిన పాత్రలలో మిమ్మల్ని ఎక్కువగా ప్రభావితం చేసిన పాత్ర ఏది?

నన్నే కాదు. యావత్ ఆంధ్రదేశాన్ని సైతం కదిలించిన ... నన్ను ఓ చక్కని నటి అన్పించిన "ఝాన్సి" పాత్రను మర్చిపోలేను.

**జి. ఎస్. ప్రతిభ, చిత్తూరు**

"నేరము" చేసిన వారికి జీవితాంతం జైలు శిక్ష కన్నా, ఒక్క నిముషంలో ప్రాణం పోయే "వురిశిక్ష" మేలంటాను. మరి మీరు?

ఈ ప్రశ్నను అడగాల్సింది నన్ను కాదు చెల్లీ.

**పి. రాజేశ్వరరాజు, వేములవాడ**

కుటుంబాన్ని చక్కదిద్దేవారు గొప్పవారా? సంపాదించేవారు గొప్పవారా?

తమ కుటుంబాన్ని చక్కదిద్దుకుంటూ సముపార్జించేవారు గొప్పవారు.

**ఎ. రాంబాబు, బాపట్ల**

మీరు ఏ దృష్టితో ఈ నటనా జీవితంలోకి ప్రవేశించారు?

ఫలానా దాన్ని అంటూ ఆశించి మాత్రం నేను నట జీవితంలోకి ప్రవేశించలేదు.

**జి. వెంకట సత్యనారాయణరెడ్డి, గోపాలపురం**

'ఉత్తమనటి'కి మీరిచ్చే నిర్వచనం ఏమిటి?

అయ్యా జి. వి. యస్. రెడ్డిగారూ మీ ప్రశ్నని మరోసారి మీరు చదువుకుంటే అందులోనే అర్థం వుందనుకుంటాను.

**మద్దెర్ల కృష్ణమూర్తి, మంచిర్యాల**

మీరు నటించిన సినిమాలను మీరు తెరపై చూస్తే మీకు ఎలా అన్పించుతుంది?

"కాకి పిల్ల కాకికి ముద్దు" అన్న సామెత మనకుండనే ఉంది. ఎవరు నటించిన సినిమాలు వాళ్ళు చూసుకొంటుంటే బాగానే ఉన్నట్టు అన్పిస్తాయి. నిజంగా ఆ చిత్రం ఎలాగుందో చెప్పాల్సింది మీరే!

**జి. రమణా రావు, ఖర్గపూర్**

సామాన్యంగా ప్రతి హీరోయిన్ హిందీ ఫిల్డ్‌లోకి వెళ్లాలనిఉవ్విళ్ళూరుతుంటారు. దీనికి కారణం ధనార్జనా లేక పేరా?

ఒక్కొక్కళ్ళవిషయంలో ఒకో రకంగా వుంటుంది. ఏ రంగంలోనైనా ఆఫర్ వస్తే ఎవరైనా పైకి వెళ్లాలని కోరుకుంటారు. ఇందులో తప్పులేదు. ఆ తర్వాతే డబ్బు గురించా లేక పేరు గురించా అన్న తర్జనభర్జనలు. □

కూపన్

ఆంధ్రసచిత్ర వారపత్రిక

## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

పంపిన వారి పేరు : ____________________

పూర్తి చిరునామా : ____________________

# నిస్వార్థ సేవకి నీరాజనం

## మాధవ్

మా జీ ఎమ్. ఎల్. ఏ. శరత్ మరణించారన్న వార్త క్షణంలో ఊరంతా పాకిపోయింది.

ఊరుగాని ఊర్లో, గుండె పోటుతో ఎవరు మరణించినా విషాదకరమైన వార్తే. తీర్థ యాత్రకని బద్రీనాధ్ పోయి అక్కడ గుండె పోటుతో శరత్‌గారు చనిపోవటం అంటే ఆ ఊళ్లో కంట తడిపెట్టనివారు లేరంటే అతిశయోక్తి కాదేమో.

కారణం ఆ ఊరుని నివాసయోగ్యమైన చిన్న పట్టణంలా అభివృద్ధి చేసిన ఘనత ఆయనిదే.

'లా' చదివి, లాయరుగా ప్రాక్టీసు చేయకుండా తన గ్రామాన్ని అభివృద్ధి చేసుకోవాలని అహర్నిశలు కృషి చేశారు. పెళ్ళి చేసుకొంటే ప్రజాసేవ కష్టమవుతుందేమోనని బ్రహ్మచారిగానే ఉండిపోయారు.

మొదట్లో ఊరి పంచాయతి ప్రెసిడెంటుగా ఉండేవారు. ఆ రోజుల్లోనే ఊరికి రోడ్డు, బస్సు, ఎలక్ట్రిసిటి సౌకర్యాలు వచ్చేటట్లు కృషి చేశారు.

ఆ తర్వాత తన ఊరు ముఖ్య కేంద్రంగా సమితి, తాలూకాలు ఏర్పడటానికి కృషి చేశారు.

రాజకీయాల్లో ఏ పార్టీలో చేరకపోయినా, స్వతంత్రుడిగానే అసెంబ్లీకి ఆయన గెలిచారు.

ఆయన ఏ పదవిలో ఉన్నా, ఆయన యిల్లు ఎప్పుడూ జన సమూహంతో కళకళలాడుతూ ఉండేది.

వారి నియోజకవర్గంలో ఏం కావాలన్నా ప్రజలు ఆయన దగ్గరికి వెళ్ళేవారు. బళ్ళు, ఆసుపత్రులు. రోడ్లు, పాల కేంద్రాలు ఒకటేమిటి ఏ అభివృద్ధి కార్యక్రమమైనా ఆయనతో చెప్తే చాలు, పని జరుగుతుందని ప్రజలు తెలిసికొన్నారు.

నిస్వార్థపరుడు, నిరాడంబరుడు, ప్రజల దగ్గర నుంచి ఏమి ఆశించకుండా అహోరాత్రులు కృషి చేసేవారు.

రాజకీయాల్లో చేరేటప్పుడు ఆయనకు పదిహేనెకరాల పొలం ఉంటే, ఆయన చనిపోయేనాటికి మిగిలింది రెండెకరాలే.

"పిల్లా, బిడ్డా, నా కెవరున్నారు? ఆస్తి లేకపోతే ఏం?" అంటుండేవారు ఆయన.

అందువల్లే ఆయన మరణవార్త కలవరం కల్గించింది. ఊర్లో పెద్దలంతా సంతాప సభ ఏర్పాటు చేశారు. సభలో ముందు రెండు నిమిషాలు మౌనం పాటించారు. శరత్‌గారి అనుంగు మిత్రుడు, శిష్యుడు అయిన రాజా పంపిన టెలిగ్రాం చదివి విన్పించారు. అందులో శరత్ బద్రీనాధ్‌లో గుండె నొప్పితో చనిపోయినారని, అంత్యక్రియలు అక్కడే ముగిస్తున్నానని రాజా తెల్పాడు.

సభలో ఎంతో మంది ప్రసంగించారు. "ఇవాళ మా యింట్లో దీపం ఉందంటే శరత్‌గారి చలవే" అని ఒక ఊరి సర్పంచ్‌గారు అంటే, "ఇవాళ మేం రెండు పూటలా అన్నం తింటున్నామంటే శరత్‌గారు ఏర్పాటు చేసిన నీటి సౌకర్యం వల్లనే" అని మరొక సర్పంచ్‌గారన్నారు.

పర్మిట్లు, లైసెన్సులు, కోటాలు పొందినవాళ్ళు, ట్రాన్స్‌ఫర్లు, ప్రమోషన్లు, పోస్టింగులు మొదలగు పనులు చేయించుకొన్నవాళ్ళు శరత్ గారు లేని లోటు తీరనిది అని తమ బాధను తెలియచేసుకొన్నారు.

సమితి ఆఫీసులో శరత్‌గారి ఫోటో ఏర్పాటు చేయాలని, ఊరిలోని ముఖ్య రహదారిని "శరత్ మార్గము"గా పేరు పెట్టాలని, శరత్‌గారి విగ్రహాన్ని ఒకటి తయారు చేయించి ఊరి నాల్గు రోడ్ల కూడలిలో ప్రతిష్ఠించాలని తీర్మానాలు చేశారు.

విగ్రహం తయారికి వెంటనే చందాలు ప్రకటించారు. ఏభై వేల రూపాయలకుపైగా వాగ్దానాలు వచ్చినయి. వసూళ్ళు చేయటానికి ఓ కమిటీని నియమించడం కూడా జరిగింది.

సంతాప సభ జరిగిన నాల్గో నాటికి రాజా ఊరుకి తిరిగి వచ్చాడు. మొదట్లో అనుకున్న కార్యక్రమం ప్రకారం శరత్, రాజీ నెలాఖరుకుగాని తిరిగి వచ్చేవారు కాదు. ఊళ్లోకి వచ్చినా మరో వారం రోజులు దాకా రాజా ఇంటి నుండి బయటికి రాలేదు. విగ్రహ ప్రతిష్టకు వసూళ్ళు జోరుగా సాగుతుడటం గుర్చించి విని రాజా సంతోషించాడు. మరొక ప్రక్క ప్రజల మనస్తత్వం గురించి ఆశ్చర్యపడ్డాడు.




శరత్ బ్రతికి ఉంటే మర్చిపోయిన ప్రజలు,

చనిపోయినాడంటే ఎంత ఆప్యాయత చూపిస్తున్నారు! శరత్‌ను మర్చిపోకపోతే, ఆయన్ను అసెంబ్లీ ఎన్నికల్లో రెండోసారి - పోటీ చేస్తే ఎందుకు ఓడించారు? ఆయన వారి మధ్య ఉండగా, ప్రజలు ఆయన యింటికి వచ్చి పరామర్శించారా? ఆయన అధికారంలో ఉంటె ఆయిన యిల్లు జనంతో కిటకిటలాడుతుండేదే. మరి ఆయన ఎన్నికల్లో ఓడిపోయిం తర్వాత ఇంటికి వచ్చేవారే కనపడలేదే! ఆయన చేసిన సేవంతా బూడిదలో పోసిన పన్నీరేనా?

ప్రజల దృక్పథాన్ని చూసి శరత్ కూడా బాధపడక పోలేదు. ఎప్పుడూ సంతోషంగా ఉండే వారి మొఖంలో ఈ మధ్య విషాద చాయలు కన్పడుతూ ఉండేవి. 'అధికారం ఓ టానిక్‌లాంటిది' అని ఆయన కూడా అధికారం పోయిన తర్వాత తెల్సుకొన్నారు. లాయరుగా ఏనాడు ప్రాక్టీసు చేయలేదు కనుక, కోర్టులలో క్రొత్తగా శ్రద్ధ తీసికోవాలంటే కుదిరే పనిగాదు పోనీ నవల్లో, కథల పుస్తకాలో చదువుతారా అనుకుంటే ఆ అలవాటే లేదాయె. ఆధ్యాత్మిక వ్యవహారాల్లో అంతకన్నా ఆసక్తి లేదు.

శరత్‌ను గమనిస్తున్న రాజాకు జాలి, బాధ, విచారం కల్గినయి. ఎలా అయినా శరత్‌ను సంతోష పెట్టాలనే తాపత్రయంతో ఢిల్లీ, హరిద్వార్, బద్రినాథ్ యాత్రలు చేస్తే మంచిదని చెప్పి ఒప్పించాడు ఢిల్లీదాకా రైల్లో వెళ్ళి; అక్కడ నుంచి ఉత్తరదేశ యాత్రకు టూరిస్టు బస్‌లో బయలుదేరారు

ఆ బస్ ప్రయాణం చేస్తుండగా, రాజాకు మెరుపు లాగా ఓ ఆలోచన వచ్చింది శరత్ కోరుకుంటున్నది పుణ్యం కాదు. పాప ప్రక్షాళన అంతకన్నా కాదు ఆయనకు కావల్సింది ప్రజల అబిమానం, ఆదరణ. వారు చేసిన సేవలను ప్రజలు ఇంకా గుర్తుంచు కొంటున్నారని తెలిస్తే శరత్ మళ్లీ మామూలు మనిషి అవుతాడు.

అందుకనే శరత్ మరణించినట్టు ఊళ్లో పెద్దలకి టెలిగ్రాములిచ్చింది. అయితే ఆ సంగతి శరత్‌కు చెప్పలేదు. యాత్రల నుంచి తిరిగి రాగానే, తన మరణాన్ని గురించి ప్రజలు ఎంత బాధపడ్డారో గమనించిన శరత్ సంతోష పడ్తారని రాజా అను కొన్నాడు.

శరత్‌ను యాత్రలు పూర్తి చేయమని చెప్పి, తన టెలిగ్రాములకు ప్రజలు ఎలా స్పందించారో తెలిసికోవటానికి రాజా ముందుగా ఊరికి వచ్చాడు.

విగ్రహ ప్రతిష్ఠకు వసూళ్ళు పూర్తి అయినయి. ఆరోజే శరత్ తిరిగి రావాల్సి ఉంది.

శరత్ రైల్లో దిగారు. బిక్కు, బిక్కుమంటూనే రాజా వెళ్ళి తను ఆడిన నాటకం గురించి చెప్పాడు.

"స్నేహితుడ్ని కాపాడ్డం కోసం ఇంత నాటకం ఆడావన్న మాట", అని శరత్ ఓ చిరునవ్వు విసిరాడు.

శరత్ ఊళ్లోకి వస్తుంటే అందరూ, ఆశ్చర్యంగా చూసి, తమ సంతోషాన్ని వ్యక్తపర్చారు. శరత్ నేరుగా విగ్రహ ప్రతిష్ఠ కమిటీ ప్రెసిడెంటుగారింటికి వెళ్లారు.

రాజా చేసిన పనికి క్షమాపణ చెప్పుకొని, తనకు విగ్రహాలక్కరలేదని, ప్రజల అభిమానానికి కృతజ్ఞుడని శరత్ చెప్పారు.

"వసూలు చేసిన డబ్బులు తిరిగి ఇచ్చేయటం కుదిరే పని కాదు. ఏదన్నా మంచి పని మీ పేరుతోనే చేద్దాం" అన్నారు కమిటీ ప్రెసిడెంటుగారు.

"అయితే బీదవారికి ఓ సత్రం కట్టిద్దాం. నా పొలంలో ఓ అర ఎకరం ఇస్తాను చుట్టూ చెట్లు నాటి మధ్యలో ఓ బిల్డింగు కట్టిద్దాం," అన్నారు శరత్

బీద ప్రజలకు తనేమి చేయలేదని కాదు. ఇళ్ళ స్థలాలు, గేదెలు, మేకలు ఇప్పించటం దగ్గరి నుంచి, ఇండ్లు కట్టించటం వరకు బీదవారికి సాయబడ్డాను, కాని కూలి నాలి కోసం, పొట్ట చేతిలో పట్టుకొని పట్నానికి వచ్చేవారికి ఏమి చేయలేపోయానే అనే వెలితి శరత్‌ను బాధపెడుతున్నది. రోడ్డు ప్రక్కన. ఎండలో, వానలో జీవితాలు గడిపే వారికి నీడ అంటూ ఒకటి ఏర్పాటు చేస్తే బాగుంటుంది అని చాలా కాలంగా అనుకొంటుండే వారు సొంతంగా కట్టించడానికి తన దగ్గర డబ్బు లేదు, తన దగ్గరికి రావటమే మానేసిన ప్రజలను విరాళాలు కావాలని ఎట్లా అడగటం?

తన విగ్రహ ప్రతిష్ఠ కోసం వసూలు చేసిన డబ్బుతో తన పొలంలో సత్రం కట్టిస్తూ, శరత్ ఒక నూతన అనుభూతిని పొందారు మనిషి మరణించిన తర్వాతనే, చాలా మంది విషయంలో, అతని విలువను గుర్తిస్తారుగామోలు అనుకొని, చావ కుండానే సాధించిన అభిమానానికి రాజాకు అభినందనలు తెల్పారు శరత్. 




### కె. వి. ఆర్. విజయవాడ

★ రామానాయుడు అవార్డు అంటే సురేష్ నాయుడుగారు ఏర్పాటు చేసినదా?

● కాదు. జమిన్‌రైతు స్థాపక సంపాదకుని పేర నెలకొల్పబడి - ఉత్తమ జర్నలిస్టుకు యివ్వబడేది. ఇప్పటిదాకా అది అందుకున్న వారిలో నేనూ వుండడం - నా అదృష్టం.

### వెంకట్, ఉరవకొండ

★ నైతిక విలువల పునరుద్ధరణలో పరిస్థితి నానాటికి దిగజారిపోడానికి కారణం - నేటి రాజకీయాలా? లేక రాక్షస వాంఛలని ప్రోత్సహించే సాహిత్యమా?

● గమ్యం తెలియని జీవిత ప్రయాణం ముఖ్య కారణం. ఇక మిగిలినవి - దోహదాలవుతున్నాయి అంతే.

### ఎమ్. ఆర్. డి. బళ్లారి

★ ఈనాడు మనదేశంలో సినిమారంగం నుంచి రాజకియ రంగందాకా వారసత్వంతో సాగిపోతోంది కదా' అలాగే ప్రశ్నావళి మి మనవలకి అప్పగిస్తారా?

● ఆ భయంలేదు. నా మనవలకి తెలుగు వచ్చే అవకాశమే తక్కువ. హిందీ, బెంగాలీ, కన్నడాలలో వారి వారి చేవ చూపిస్తారేమో -చూడాలి

### కె. కె. లక్ష్మీదేవిపల్లి

★ మిరు మొక్కుబడిగా సమాధానాలిస్తున్నారు. మి శీర్షిక లేకుంటే పత్రిక లేదనుకుంటున్నారా?

● అంత పిచ్చిదాన్నా!?పత్రిక ఒక సంస్థ. దాల్లో వ్యక్తులు- వచ్చిపోయే వాళ్ళు. సంస్థ శాశ్వతం. వ్యక్తులు తాత్కాలికం. ఇక మొక్కుబడి – మి అభిప్రాయం. అంతే.

### ఎన్. వి. ఆర్. హైదరాబాదు

★ ఉన్న ఒక్క కొడుకూ దూరానికి పోతానంటే అభ్యంతరం చెప్పడం తప్పా?

● తప్పు కాదు. కాని దూరాలోచన లోపించడమే అనుకోవచ్చు. పట్టువదలని తేనెటీగ తేనె నెలా కూడ బెట్టకలదు??

### సి. హెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి

★ యువకులకు మానసొల్లాసం, మెదడుకు మేత కల్గించే ప్రభుత్వ సంస్థలు లేక పోవడం విచారకరం కదా?

● అందుకే కాబోలు సర్కిపై చేసి సినిమాలూ సర్కిపై అక్కర లేకుండా భయంకర సాహిత్యం ప్రోత్సహిస్తూంది' అయినా యువతకి లేని అక్కర ప్రభుత కెందుకుంటుంది?

### డి. కె. విశాఖపట్నం

★ నిత్య జీవితంలో మగాడు పాడవడానికి కారణం స్త్రీ అంటాను.

● మి జీవితం లోంచి స్త్రీని తొలగించి బాగుపడవద్దని-- ఎవరడ్డుతున్నారు?!

### జి. డి. చంద్రగిరి

★ మానసికంగా సన్నిహితం కాలేక పోవడం, శారీరకంగా కోరికలు తీరక పోవడం, ఆర్థికంగా స్వతంత్రం వుండక పోవడం– ఆడది పక్కదార్లు పట్టడానికివేనా యింకేమైనా కారణాలున్నాయా?

● ఇవే కారణాలని ఏ మానసిక శాస్త్రకారుడు చెప్పాడు తల్లీ.... ఎవరి కారణాలు వారు ఊహించేసుకుని సూత్రీకరించి వల్లె వేయడం ప్రమాదం.

### రాజు. నారాయణ పేట

★ ఈ సంవత్సరం మా జూనియర్ కాలేజీలో 350 మందిలో కేవలం 16 గురు ఉత్తీర్ణు లయ్యారు. ఫెయిలయిన వాళ్ళు ఏం చెయ్యాలి?

● ఫెయిలయిన వాళ్ల కంటే పాసయిన వాళ్ళు మళ్లీ చదవడం – మంచిదేమో ఆలోచించాలి. అయినా ఆంధ్రలో చదువుకి అర్థం పోయినట్టుంది.

### పి. డి. ఆర్. ఖర్గపురం

★ రామలక్ష్మిగారూ మిరు యింత వరకు పెళ్లి చేసుకోలేదు. మికు మగవారిపై అసూయ పగ అని నేను అనుకుంటున్నాను ఏమంటారు?

● నా వైవాహిక జీవితం 31 సంవత్సరంలోకి అడుగు పెట్టింది పురుష ద్వేషం నా కెందుకు? పురుషుల తత్వం లోని కొన్ని సంకుచిత పోకడలు, దృక్పథం, యీగో సమస్యలు అంటే నాకు అసహ్యం– అంతే.

### పి. ఎమ్. ఖర్గపూరు

★ మి కెంత మంది పిల్లలు? మి మొదటి నవల పేరేమిటి? మి నవల నొకదాన్ని పత్రికకు పంపకూడదూ?

● ముగ్గురు. అవతలిగట్టు 1956. పంపొచ్చు:

### డి. వి. ఆర్. విజయవాడ

★ మంచి స్నేహితుడు అంటే?

● హృదయం విప్పి మాట్లాడు తాడు. న్యాయమైన సలహా లిస్తాడు, ధైర్యంగా ముందుకు దూకుతాడు. అన్నిటా ఓర్పు వహిస్తాడు. మొండిగా రక్షణకి దిగుతాడు.... మారక స్నేహితునిగా మిగిలి వుంటాడు.

### వి. ఆర్. ఎన్. ఆర్. శ్రీధరగట్టు

★ మికు చాలా మంది ఈర్ష్యతో రాస్తుంటారు. వారికి మిరిచ్చే సమాధానాలు ఎంతో బాగుంటాయి. వాటిని చూసి నాకు ఎంతో సంతోషం కల్గుతుంది. విమర్శిస్తూ ఈర్ష్యగా ప్రశ్నలు రాసినా పత్రిక వచ్చిన వెంటనే మి అభిమానులకంటే ముందు వాళ్లే ప్రశ్నావళి చూస్తారు ఇలాంటి వారిని చాలా మందిని చూస్తాను

● అది చాలా సహజం. తిట్టిన వాళ్ళు– తిరిగి ఏం తిడతారో వినాలనే తాపత్రయ పడతారు. తిరిగి తిట్టకుండా వుండగల వాళ్ళూ తక్కువే.

★ పేరున్న వారి కథలు సిరియల్సు వేయడానికి అంగికరిస్తారే గాని నూతనులవి స్వీకరించరని నా అబిప్రాయం

● అదే నిజమైతే – తొలితరం వారి తరువాత యింకో తరం వచ్చేది కాదు!

### ఎన్. ఆర్. సంగారెడ్డి

★ మికూ నాకూ తేడా ఏమిటి?

● భాగ్యం' □

ఇంటి పనంతా ఒకత్తెన్ని చేసుకో లేకపోతున్నాను. మీ నాన్నకి ఉత్తరం రాయి రమ్మని! .....



# ఎవరిది లోపం?

దూరి వెంకటరావు

"రమణయ్యగారికి,

నేను మీ అమ్మాయిని చేసుకోవడంలేదు. వెంటనే పెళ్ళి ఏర్పాట్లు మానండి. ముహూర్తం దగ్గర పడే ముందు నేనిలా వ్రాయడం మీకు ఆశ్చర్యంతో పాటు బాధ కూడా కలుగవచ్చు. పీటల మీద వరకు తెచ్చి తప్పుకున్నందుకు నన్ను మీరెన్నో విధాల నిందించుకుంటారు. నేనీ నిర్ణయానికి రావడానికి కారణం మీ అమ్మాయి లావణ్యే. నేను త్రాగుబోతునని, ఆడపిల్లల్ని అల్లరిపెట్టడం నా హాబీ అని రకరకాలుగా నిందిస్తూ ఉత్తరం వ్రాసింది. ఆమె వ్రాసిన లేఖ కూడా దీంతో జతపరుస్తున్నాను. నన్ను చేసుకోవడం ఇష్టం లేనప్పుడు నిర్మొహమాటంగా ఆ విషయం చెప్పి వుంటే ఎంతో సంతోషించేవాణ్ణి. లేనిపోని అవలక్షణాలన్నీ నాకు అంటగట్టి సంబంధం తప్పించుకోవాలనుకోవడం ఆమె అవివేకాన్ని అజ్ఞానాన్ని చాటుతుంది. ముందుముందు ఆమె భవిష్యత్తుకే ముప్పు

ఇట్లు

సుదర్శన్."

ఉత్తరం చదవటం పూర్తిచేసిన, రమణయ్యగారికి వంటి నిండా కారం పూసుకున్నట్లైంది.

"జానకి! .. " ఇల్లు దద్దరిల్లేటట్లు పిలిచారు.

"అమ్మ గుడికెళ్ళింది నాన్నా" అన్నది రమణి తండ్రి కోపానికి విస్మయం చెందుతూ.

"సరేలే, లావణ్య ఏం చేస్తోంది?" కాస్త తగ్గింపు స్వరంలో అడిగారు రమణయ్యగారు.

"కాలేజీకెళ్ళింది .... ఏం కావాలి నాన్నా ... కాఫీగాని తెమ్మంటారా" అడిగింది రమణి.

"కాఫీయా అక్కర్లేదు ... మీ చెల్లెలు చేసిన పనికి కడుపు నిండిపోయిందమ్మా ... వెళ్ళు ..." కసురుకున్నట్లుగా అన్నారు రమణయ్యగారు.

విషయం అర్థంకాక విస్తుపోయింది రమణి.

ఉత్తరాన్ని మడిచి, కళ్ళజోడు తీసి బల్లమీద వుంచుతూ దీర్ఘాలోచనలో పడ్డారు రమణయ్యగారు. అతని ఆలోచనలు నెల రోజులు వెనక్కుమళ్ళాయి.

* * * *

రమణయ్యగారు మధ్యతరగతికి చెందిన సగటు మనిషి. మునిసిఫ్ కోర్టులో గుమస్తా గిరి చేసి ఈ మధ్యే రిటైరయ్యారు. పెళ్ళీడుకొచ్చిన రమణి, లావణ్య అతని కూతుళ్ళు. పెద్ద పిల్ల రమణి అందంలో అప్సరస కాకపోయినా చూడ్డానికి బాగానే వుంటుంది. ఐతే ఆమె కుడి కాలుకాస్త పొట్టి అవడంతో నడకలో కాస్త తేడా కనిపిస్తుంది. అదే పెద్ద లోపంగా ఎంచి ఎన్ని సంబంధాలు చూసినా ఎవరూ పెళ్ళి చేసుకోవడానికిష్టపడలేదు.

పెళ్ళిచూపులకు వచ్చిన వాళ్ళు రమణిని చూడ్డం, లావణ్యనైతే చేసుకుంటామని అనడం అటు కన్నవాళ్ళకు, ఇటు రమణికి కూడా గుండె కోత అయింది.

అక్క పెళ్ళికి తను ప్రతిబంధకం కాకూడదని ఒక్కోమారు పెళ్ళిచూపుల సమయానికి లావణ్య ఏ స్నేహితురాలింటికో వెళ్ళిపోయేది

అందరిలాగే సుదర్శన్ కూడా లావణ్యను చేసుకుంటానని అనగానే రమణి మరి బాధపడలేదు. తన దురదృష్టాన్ని తనే నిందించుకుని, తనకి జన్మలో పెళ్ళికాదని చెల్లెలకు ఆ సంబంధం ఖాయం చేయమని అమ్మను నాన్నను బ్రతిమిలాడింది పెద్ద పిల్లకు పెళ్ళి చేయకుండా, కడదానికి కళ్యాణమేమిటని ఎంత చెప్పినా వినలేదు.

ఆఖరికి రమణయ్యగారు, రమణి మాటకు కట్టుబడి సుదర్శన్‌తో లావణ్య వివాహం స్థిరపరిచారు. ఈ వృద్ధాప్యంలో పోనీ ఒక్క పిల్ల నెత్తిమీదనైనా రెండక్షింతలు వేయబోతున్నందుకు ఎంతో సంబరపడిపోయారు. అంతలోనే ఏమిటీ విపరీతం? లావణ్య ఎందుకలా ఉత్తరం వ్రాసి సంబంధం చెడగొట్టుకుందో అర్థంకాక రెండు చేతులతో గట్టిగా కణతలు నొక్కుకుంటూ వాలు కుర్చీలో వెనక్కువాలి కళ్ళు మూసుకున్నారు.

లావణ్య కాలేజీ నుండి రాగానే కూతురు చేసిన నిర్వాకానికి మండిపడ్డారు రమణయ్యగారు.

"నేనెందుకీ సంబంధం తప్పించుకోవలసి వచ్చిందో కారణం తెలుసుకోకుండా నన్నాడిపోసుకోకండి" అన్నది లావణ్య బాధగా.

"కారణం ఏదైనా నీకతడు ఇష్టం లేకుంటే ఆ విషయంముందే చెప్పాలి. పీటల వరకూ సాగదీసి ఇప్పుడేవో కారణాలు చెప్పడం ఎవరూ హర్షించరు."

"ఒకరు హర్షిస్తారని గాని, మరొకరు నిందిస్తారని గాని నేనీ పని చేయలేదు మొన్నీ మధ్య సురేఖ పెళ్ళికి నర్సీపట్నం వెళ్ళినప్పుడు స్నేహితుల ప్రోద్బలం వల్ల శ్రావణసంధ్య సినిమాకు వెళ్ళవలసి వచ్చింది. కాకతాళీయంగా సుదర్శన్ నా కంటపడ్డాడు. అతడు హాల్లోకడుగు బెట్టగానే లైట్లు ఆర్పేసారు. నేనతడిని చూసానుగాని నన్నతడు గమనించలేదు. తూలుతూవచ్చి మా ముందర వరుసలో కూర్చున్నాడు అతడి నడకని బట్టి, అతడి నోటి నుండి వచ్చే వాసనను బట్టి, పీకలదాకా త్రాగుంటాడని వూహించాను. సినిమా అవుతూ వుండగా అతని ముందర సీట్లో కూర్చున్న వాళ్ళతో తగూ పడ్డాడు. ఆ తగూ సద్దుమణిగేసరికి పది నిమిషాలుపట్టింది ముందు సీట్లో కూర్చున్న అమ్మాయి భుజంపై చెయ్యి వేసాడన్నది తగవుకు కారణం. మేమంతా డబుల్ ప్రోగ్రాం చూసాం.

అక్క నడకలో కనిపించే అతి స్వల్పమైన వ్యత్యాసాన్ని పెద్ద లోపంగా ఎంచి, ఆమె కుంటిది, సొట్టది అని మనందరి మనసుల్ని గాయపరచిన సుదర్శన్‌ని, కళ్ళారా అతడి వాటాన్ని చూసిన నేను త్రాగుబోతు అని అనడంలో తప్పేముంది నాన్నా? పెళ్ళికి ముందే అతడి నైజాన్ని తెలుసుకున్న నేనెంతో అదృష్టవంతురాల్ని. ఇప్పుడు చెప్పండి. బాహ్యంగా మేడిపండులా కనిపించినా అంతర్యంగా ఇన్ని దుర్వ్యసనాలు కలిగివున్న సుదర్శన్‌ది లోపమా? ... కేవలం అవయవనిర్మాణంలో బాహ్యంగా కనిపించే అతి స్వల్పమైన లోపం కలిగివున్న రమణిది లోపమా? ... ఎవరిది లోపం? మీరే చెప్పండి" ఉద్రేకంతో ఊగిపోతూ అంది లావణ్య

కూతురు మాటల్లోని వాస్తవాన్ని గ్రహించిన రమణయ్యగారి నోటి నుండి మరి మాటలు పెగలేదు. □



సీరియల్

# కాగితశిల

రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

వంశధార పట్టపగల్లా మిడిసిపడిపోతోంది అర్ధరాత్రి కాబోతున్నా ఇంకా ఆ ఇంట్లో సర్దుమణగలేదు

ఓ గదిలో ఓ పదిమంది ముత్తయిదువులు, ఓ నలుగురైదుగురమ్మాయిలు చేరి ఏవో కబుర్లాడుకుంటూ నవ్వుకుంటున్నారు వారి మధ్య సర్వాలంకృత అయిన శ్యామల సిగ్గుల మొగ్గలా ముడుచుకూర్చుంది

ఇంకా ఎంత సేపర్రా! అర్ధరాత్రి కాబోతూంటే? విసుక్కుంది శ్యామల బామ్మగారు రాజమ్మగారు

బావుంది పదకొండు గంటల దాకా వర్జ్యమే - వుందాయె! చూస్తూ చూస్తూ వర్జ్యంలో ఎలా పంపుతాం! దీర్ఘాలు తీసింది శ్యామలకి మేనత్త వరసయ్యే ఓ ముత్తయిదువు

హవ్వ! అతగాడేమనుకుంటాడు! వర్జ్యం లేదూ వంకాయా లేదు ముందు దాన్ని గదిలోకి పంపండి! వాచ్ చూసుకుంటూ అన్నాడు రామారావు.

ఇదిగో బావగారూ! ఇది ఆడవాళ్ల ఫంక్షన్! ఇక్కడ మీరెందుకు మరదలు వరసయ్యే ఒకామె తమాషాగా అంది రామారావు నవ్వుకుంటూ వరండాలోకి నడిచాడు

కాకపోయినా మరి ఆలస్యం అయిపోతోందర్రా! గొణిగింది రాజమ్మగారు

అదే భావాన్ని శ్యామల కళ్లల్లో కూడా చదివిన ఓ పడుచు కిలకిలా నవ్వుతూ--

అహా! అంత తొందరైతే ఎలాగే నా తల్లీ! కాస్త ఆగు మరి! ఇవాల్టికే ఈ ఆలస్యాలు, ఎదురు చూపులూనూ! రేపట్నుంచి జీవేం వుండవు! అంది కొంటెగా

అవేం! రేపట్నుంచి మాత్రం ఎందుకుండవు? అమాయకంగా అంది మరో పడుచు

అసలీవిడగారు బైటకొస్తే కదా ఎదురు చూడ్డానికి! గంభీరంగా అంది మొదటామె

అందరూ పకపకలాడారు

ఆ నవ్వుల వర్షంలో వుక్కిరిబిక్కిరై పోతున్న శ్యామల ముఖం అరుణిమదాల్చింది

వాళ్లంతా అలా సరసాలాడుతున్నా ఆమెకి కోపం రావడంలేదు. పైగా హాయిగా పన్నీటి జల్లు కురిసినట్టుగా వుంది

అదిగో! అందుకే నేని ఫంక్షన్‌కి ఒప్పుకోనన్నది హాయిగా ఏ కాశ్మీరో వూటీకో హనీమూన్ పోతామంటే వినకుండా. ఇదంతా చేసింది అమ్మ! చిరుకోపంగా తల్లికేసి చూసింది శ్యామల

అది అబద్ధమని తనకిష్టంలేని పని తల్లేకాదు ఆ బ్రహ్మ రుద్రాదులు కూడా చేయించలేరని ఆమెకి, తల్లికి కూడా తెలుసు

ప్రభాకర్‌కి భారతీయ సాంప్రదాయాలంటే చాలా ఇష్టం ప్రభాకర్ అంటే ఆమెకిష్టం అందుకే కాస్త విసుగ్గా వున్నా మౌనంగా కూర్చుని అమ్మలక్కలు చేసే అలంకరణలన్నీ చేయించుకుంది అంతేకాదు ఈ అనుభవం ఆమెకి మధురంగా కూడా అనిపించింది

"అమ్మాయిని పంపవచ్చు!" అన్న ఆర్డర్ వచ్చింది

అమ్మలక్కలు లేచి శ్యామలకేసి చూశారు లెమ్మన్నట్టు

శ్యామల మెల్లగా లేచింది

అదురుతున్న గుండెలతో వరండాలోకొచ్చింది వరండా పక్కనున్న గది విశాలంగా, ఏ సి తో వుంటుంది

ముందు కుడి కాలు పెట్టు! గది ముందుకి తీసుకెళ్లి అంది ఓ ముత్తయిదువ

శ్యామల మెల్లగా అడుగెయ్యబోయి తృళ్లిపడి ఆగిపోయింది

అంతవరకు నిమిషమొక యుగంలా ఎదురు చూస్తున్న ప్రభాకర్ కూడా తృళ్లిపడ్డాడు

అమ్మలక్కలు నిశ్చేష్టులైనట్టుండి పోయారు

బామ్మగారు కళ్లు చిట్లించింది

రామారావు నిర్ఘాంతపోయాడు

కారణం సరయు!

సంధించి వదిలిన శరంలా రివ్వున వచ్చిపడింది

'బాబుగారూ! అంటూ

అది పిలుపులా లేదు

జరిగిన కథ-4. శాంతమ్మ ఏకైక కుమార్తె సరయు రామారావుగారి ఏకైక కుమార్తె డాక్టరు శ్యామలకు, తను ప్రేమించిన ప్రభాకర్‌తో పెళ్లి నిశ్చయమవుతుంది సరయుకి కృష్ణయ్య అండ్ కంపెనీలో ఉద్యోగం వచ్చింది సరయుని వేణు మాధవ్ ఆఫీసులో పలకరిస్తాడు డాక్టర్ శ్యామల పెళ్లి జరిగిపోయింది పిడకల వచ్చి తృళ్లిపడిలేచిన సరయుకి స్పృహ కోల్పోయి ఉన్న తల్లిని చూసేటప్పటికి గుండె ఆగినంత పనయింది తమ ఇంట్లో అద్దెకుండే రమణని తల్లిదగ్గర ఉంచి 'వంశధార కేసి పరిగెత్తింది సరయు.

ఆర్తితో పిలిచే ఆర్తనాదంలా వుంది

ఆయాసంతో గుండెలు ఎగిసిపడుతున్నాయి.

వాన చినుకులు బిందువులుగా, నుదుటి కుంకుమ మీదుగా జారి ఎర్రని ముత్యాల్లా ముక్కు మీంచి రాలుతున్నాయి. తడిసిన ముంగురులు నుదుటి మీదా, చెంపల మీదా అతుక్కుని కొబ్బరి ఆకుల చాటున నిండు జాబిలిలా వుందామె ముఖం. పెదవులు సన్నగా కంపిస్తున్నాయి.

"ఎవరు?" తేరుకున్న రామారావు అన్నాడు.

"సర్ ... మా అమ్మగారు ..." రెండు చేతులూ జోడించి గద్గద స్వరంతో అంది సరయు.

"మీ అమ్మగారా? ఎవరామె?"

"అయామ్ సారి ... నా పేరు సరయు!"

"అయితే!" చిత్రంగా చూశాడాయన.

"అదిగో! ఆ కనిపించె డాబా ఇల్లు మాదే ... సర్! నాకు ... మా అమ్మ తప్ప ఎవరూ లేరు? ... ..

మా అమ్మకి ఒంట్లో బాగాలేదు సర్! ... అందుకే..."

"ఊఁ! అందుకే?"

"ఆవిడ్ని డాక్టర్‌కి చూపించాలి సర్!"

'చూపించు' ..."



# కరిగిన శిల

"అది కాదు సర్ ..."

"ఏవిఁటి అది కాదు?" ఆయన భ్రుకుటి ముడివడింది.

"మీ అమ్మాయిగార్నోసారి మా ఇంటికి పంపండి సర్! ... మా అమ్మగారికి హార్ట్‌టాక్‌లా వుంది. దగ్గర్లో డాక్టర్లెవరూ లేరు. ప్లీజ్! ఒక్కసారి ఆవిడగార్ని పంపితే .. " దయనీయంగా అంది సరయు.

"వాట్ నాన్సెన్స్ ఆర్యూ టాకింగ్?" మండిపడ్డాడు రామారావు

సరయు ఆయనలోని మార్పు గమనించింది. అయినా ఆశ వదలకుండా -

"ప్లీజ్! నాకు ఈ లోకంలో మా అమ్మ తప్ప ఎవరూ లేరు సర్! మా అమ్మని కాపాడి ... నాకింత నీడనివ్వండి సర్! మీ మేలు జీవితాంతం మర్చిపోను!" హృదయవిదారకంగా వుందామె పరిస్థితి.

"ఏవిఁటి న్యూసెన్స్! ...మీ అమ్మకి ఆరోగ్యం బావుండకపోతే ... హాస్పిటల్‌కి తీసికెళ్ళు! అంతేగానీ ..."

సరయు ఆయనకి కారణాలు వివరించింది

"అయ్యో పాపం!" అన్నారు ఆడవాళ్ళు.

శ్యామల తల్లి కూతురికేసి చూసింది

పెద్ద పూల జడతో, తెల్లని జరీ చీరతో, చెంప మీద నల్లని చుక్కతో .. ముగ్ధ మనోహరంగా వుంది శ్యామల.

"చూస్తూ చూస్తూ ఇలాంటి అలంకరణతో బైటికెలా పంపడం?.. కాని - పంపకపోతే ... నిండుప్రాణం పోతుంది!" ఆమెకేం చెయ్యాలో క్షణం తోచలేదు.

మానవత్వం అందర్నీ కాస్సేపు ఆలోచనలో పడేసింది. హటాత్తుగా శారదకో ఆలోచన వచ్చింది.

"ఏవండీ! మన జీప్‌ని ... అటెండర్ని ఇచ్చి ఆవిణ్ణి హాస్పిటల్లో జాయిన్ చేయిస్తే?" అంది.

"నిజమే!"

అందరికీ ఈ ఆలోచన నచ్చింది.

"థాంక్యూ వెరీ మచ్! ... అలా చేసినా చాలు! సార్. మిమ్మల్ని ఇబ్బంది పెట్టాను" రెండు చేతులూ జోడించి కృతజ్ఞతలు చెప్పుకుంది సరయు.

ఆమె ముఖంలోకి వెలుగొచ్చింది.

శ్యామలకి ప్రత్యేకంగా క్షమార్పణలు చెప్పుకుని వెనుదిరిగింది.

"ఆగండి!"

తృళ్లిపడి తిరిగి చూసింది సరయు.

బిగుసుకు పోయింది శ్యామల.

బిత్తరపోయి చూశారు మిగతావారు.




ఆ పిల్చింది ప్రభాకర్!

తెల్లని పంచ, లాల్చీ పచ్చని శరీరానికి అద్దినట్టున్నాయి. బుగ్గన చుక్క, నుదుట పొడుగు బొట్టు ముమ్మూర్తులా అతను శోభనం పెళ్లి కొడుకులాగే వున్నాడు.

అతను సరయు చెప్పిందంతా విన్నాడు హార్ట్‌టాక్ ఎంత ప్రమాదమో డాక్టర్‌గా అతనికి బాగా తెలుసు. మెల్లగా భార్య దగ్గరకొచ్చి -

"శ్యామూ!" అన్నాడు.

"ఊఁ!" అందామె తల దించుకునే.

"చూడూ...."

మెల్లగా కళ్ళెత్తి అతని కళ్ళల్లోకి చూసింది శ్యామల అతను కళ్ళతోనే పర్మిషన్ అడిగాడు ఆమె మౌనంగా లోపలి కెళ్లి మెడికల్ చెస్ట్ తెచ్చి అతని కిచ్చింది.

వెంటనే ప్రభాకర్ సరయు కేసి తిరిగి –

"పదండి!" అన్నాడు.

ఓసారి కృతజ్ఞతగా అతని కళ్ళల్లోకి చూసి నాలుగు అడుగులు వేసింది సరయు.

"మిస్టర్ ప్రభాకర్! మన జీపులో వెళ్ళండి!" అన్నాడు రామారావు.

'పర్లేదు! ఆ కనిపించే ఇల్లేగా... జీప్‌ని పంపండి. అవసరం అయితే ఆవిణ్ణి హాస్పటల్లో చేరుద్దాం." అనేసి చరచరా వీధిలోకి నడిచాడు ప్రభాకర్.

అతనితో ఇద్దరు ఆర్డర్లీలు, రామారావూ కూడా నడిచారు.

సరయు రాక కోసం అసహనంగా తిరుగుతున్న రమణ, సరయు, ఆమెతో పాటు మరికొందరు రావడంతో గబగబా ఎదురెళ్ళాడు. క్లుప్తంగా విషయం తెలుసుకుని తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు.

పేషెంట్ పరిస్థితి నడుస్తూనే కొంత వివరించాడు ప్రభాకర్‌కి.

ప్రభాకర్ పేషెంట్‌ని చూశాడు. గబగబ కాళ్ళ దగ్గర రెండు మూడు దిళ్ళు ఎత్తు పెట్టించాడు. ఐ. వి. డ్రిప్ పెట్టాడు. మార్ఫియాతో పాటు మరికొన్ని ఇంజక్షన్స్ చేశాడు.

పేషెంటు అవయవాలకి రెస్ట్ ఇచ్చాడు.

"తాత్కాలికంగా ప్రమాదం తప్పినా ... ఏ క్షణానైనా మళ్ళీ జబ్బు తిరగబెట్టచ్చు! అందుకే ... కొన్నాళ్ళు పాటు హాస్పటల్లో వుంచి పూర్తి విశ్రాంతి నివ్వాలి!" అన్నాడు.

"పోనీ.. ఇప్పుడే చేరిస్తే?" అన్నాడు రామారావు.

"నో! నో! ఇప్పుడు పేషెంటుని అస్సలు కదల్చకూడదు... ఇప్పుడు ఈవిడకి మానసికంగానూ, శారీరకంగానూ కూడా రెస్ట్ కావాలి! వుదయం అంబులెన్స్ తెప్పించి హాస్పటల్‌లో చేరుద్దాం" అన్నాడు ప్రభాకర్ శాంతమ్మ పల్స్ చూస్తూ.

అతను కదలకపోవడంతో తనూ కూలబడ్డాడు రామారావు. ఆర్డర్లీలు బైట కూర్చున్నారు. రెండుగంటలు మృత్యువుతో పోరాడిన పేషెంట్‌కి అప్పటికి ప్రమాదం తప్పించాడు ప్రభాకర్. ఉదయం తప్పకుండా హాస్పటల్లో చేర్చమని మరోసారి హెచ్చరించి లేచాడు.

"థాంక్యూ డాక్టర్!" రెండు చేతులూ జోడించింది సరయు. అతనిలో ఆమెకు తల్లిని రక్షించడానికొచ్చిన దైవం కనిపించాడు.

నీళ్ళు నిండిన ఆమె నల్లని కళ్ళలో ఎన్నో భావాలు, మరెన్నో కృతజ్ఞతలు కనిపించాయి ప్రభాకర్‌కి.

మరికొన్ని జాగ్రత్తలు చెప్పి వెళ్ళిపోయాడతను. రామారావుగారికి కూడా కృతజ్ఞతలు చెప్పుకుంది సరయు వెళ్ళే ముందు. .

అందరూ వెళ్ళాక ఓ సారి గాఢనిద్ర పోతున్న శాంతమ్మని చూసి –

"మరి నేను కూడా వెళ్తొస్తాను! అవసరం అయితే పిలవండి!" అంటూ లేచాడు రమణ.

"మీరీ పూట ఇక్కడే వుండకూడదూ?" అంది సరయు.

"పరవాలేదు. ఇంక మీ అమ్మగారి కేం ప్రమాదం లేదు. అయినా నేను పక్కనే వుంటాను. ఏదైనా కావల్సొస్తే పిలవండి!" అంటూ వెళ్ళిపోయాడు రమణ.

సరయు భారంగా నిట్టూర్చింది.

ఇప్పుడు రమణ ఆమె కళ్ళకి చెడ్డవాడులా కనిపించడం లేదు. పైగా ఓ

# క్లినిక్ స్పెషల్ షాంపూతో మీ తలచుండును తరమవచ్చు. సభికుల్ని ముగ్ధుల్ని చేయవచ్చు.

చుండు బాధ కారణంగా మీరు సభికుల్ని ముగ్ధుల్ని చేయలేక పోతుంటే, మీరు స్పెషలిస్టు షాంపూతో తలస్నానం చెయ్యవలసిన సమయం వచ్చిందన్నమాట. క్లినిక్ స్పెషల్ షాంపూలోని మృదువైననురగ మీ జుట్టును శుభ్రం చేస్తుండగానే, దీనిలోని ఒక ప్రత్యేక పదార్థం మీ చుండును అదుపులోకి తెస్తుంది. ఆ దురద పోగొట్టి, మీ వెంట్రుకల్ని గొప్పగా కనిపించేలా శుభ్రంగా, ఆరోగ్యవంతంగా ఉంచుతుంది.




# క్లినిక్ స్పెషల్
## షాంపూ

**చుండులేని శుభ్రమైన, ఆరోగ్యవంతమైన జుట్టుకోసం.**

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన.

HLL-2607

## కరిగిన శిల

ఆత్మీయుడిగా కూడా అనిపిస్తున్నాడు.

'ఇంతలో ఎంత మార్పు! నిన్నటి దాకా అతన్ని అసహ్యించుకుంది. అతన్ని రాక్షసుడిలా చిత్రించుకుని బెదిరిపోయింది. ఇప్పుడా భయమంతా ఏమైపోయింది? అతను తనకి చేసిన సహాయం వల్ల పోయిందా? కావచ్చు!' అలా ఆలోచిస్తూనే మెల్లగా లేచి వీధి తలుపులు వేసుకుని తల్లి పక్కనే కుర్చీ లాక్కుని కూర్చుంది సరయు.

* * * *

భారంగా తెల్లారింది.

తూర్పున అరుణ రేఖలు విచ్చుకుని చీకటిని పాలద్రోలాయి.

లేస్తూనే రమణ వచ్చాడు. అతనికి తెల్లవార్లూ నిద్ర లేనందున కళ్ళు ఎర్రగా వున్నాయి

"ఈ ఎరుపు తాగినప్పటి ఎరుపు కాదు!" అనుకుంది సరయు.

"ఎలా వున్నారు?" అన్నాడు తను ఆమె కేసి చూడకుండానే.

'బానే వుంది' అంది తల్లి దగ్గరగా వెళ్తూ. రమణ కూడా శాంతమ్మ దగ్గరికొచ్చాడు.

"అమ్మా!" అంది సరయు తల్లిని తట్టి లేపుతూ:

శాంతమ్మ కళ్ళు తెరిచి రమణని, కూతుర్ని చూసి చిన్నగా నవ్వింది.

రమణ, సరయు కూడా హాయిగా వూపిరి తీసుకున్నారు.

అమ్మ నా కోసం పునర్జన్మ ఎత్తింది!" అంది సరయు.ఆమెకి ఆనందంతో దుఃఖం కూడా వచ్చేస్తోంది.

'అవును!" అన్నట్లుగా చిన్నగా నవ్వాడు రమణ.

'అమ్మా! ఇప్పుడెలా వుందమ్మా?" ఆమె జుట్టు సవరిస్తూ అంది సరయు.

"ఫరవాలేదమ్మా! కాస్త నీరసంగా వుందంతే!"

సరయు కాఫీ కలిపి తల్లి చేత తాగిస్తూ, రాత్రి ఎంత గొడవయిందో, తాము ఎంత కంగారుపడ్డారో, ప్రభాకర్ ఎలాంటి పరిస్థితిలో వచ్చాడో వివరించింది.

ఆశ్చర్యపోయింది శాంతమ్మ.

అమ్మా! ఇవాళ నిన్ను హాస్పిటల్లో చేర్చమన్నారు డాక్టరుగారు. పూర్తిగా నీ జబ్బు నయం కావాలంటే, వెళ్ళక తప్పదు!" తల్లిని పడుకోబెట్టి దుప్పటి కప్పుతూ అంది సరయు.

హాస్పిటల్ అనగానే ఉల్కిపడింది శాంతమ్మ. ఆవిడకి హాస్పిటల్ అంటే మంచి అభిప్రాయంలేదు. అందుకే అనేక విధాల వారించింది. అయినా సరయుగానీ, రమణగానీ వినిపించుకోలేదు. కచ్చితంగా హాస్పిటల్లో చేరాలన్నారు

"ఏమిటయ్యా రమణా నువ్వు కూడాను.! నేను అంత తొందరగా పోతానుటయ్యా! నా తల్లి పెళ్లి చెయ్యందే ఆ యముడొచ్చినా వెళ్లను!" కూతురికేసి మురిపెంగా చూస్తూ అంది శాంతమ్మ!

"అదుగో! అందుకే చెప్తున్నాను. మీ అమ్మాయి కోసమైనా మీరు నాలుగు కాలాలపాటు చల్లగా వుండాలి. ఆవిడ పెళ్లిదాకా అయినా మీరు ఆరోగ్యం కాపాడుకోవాలి! ... అందుకే ఇప్పుడు హాస్పిటల్లో చేరాలి!" నవ్వుతూ అన్నాడు రమణ.

ఎప్పుడూ ముభావంగా అదోలా వుండే రమణ ఇంత చనువుగా మాట్లాడుతుంటే తెల్లబోయింది సరయు.

తనన్న మాటల్ని పట్టించుకోకుండా ఆపదలో తనని ఆదుకున్నందుకు అతని పట్ల కృతజ్ఞతా భావం రెట్టింపయింది.

ఆ రోజు అన్న మాటలు గుర్తొచ్చాయామెకి. "మనిషికి మనిషి అవసరం ఎప్పుడూ వుంటుంది" అన్న అమ్మ మాటలో ఎంత సత్యముంది!" అనుకుంది.

మొత్తానికి ఎలా అయితేనే ఇద్దరూ కలిసి శాంతమ్మని హాస్పిటల్లో చేర్చడానికి ఒప్పించారు.

"ఇదిగో సరయూ! మీరు కాస్త వేన్నీళ్లతో అమ్మగారి ముఖం, ఒళ్లు తుడిచి బట్టలు మార్చండి. నేనిలోగా స్నానం చేసి వస్తాను. అంబులెన్స్‌కి ఏర్పాటుచేసి ఆమెని తీసుకెళ్దాం" అన్నాడు రమణ.

"అలాగే!" అని అతను వారిస్తున్నా వినకుండా అతనిక్కాఫీ అందించింది. కాఫీ తాగి అతను వెళ్లిపోగానే చకచక కాఫీ కలిపి ఫ్లాస్కు నిండా పోసి, తనూ తాగి, ఓ రెండు దుప్పట్లు, ఓ దిండూ హాస్పిటల్‌కి తీసికెళ్లడానికి సిద్ధం చేసింది.

నీళ్లు కాగాక స్టౌమీద నీళ్ల గిన్నెని పటకార్‌తో పట్టుకొని రెండు టవల్స్ భుజానేసుకొని తల్లి దగ్గరకొచ్చింది ఆమె ఒళ్లు తుడవడానికి.

"రెడీయేనా?" అంటూ వచ్చేశాడు రమణ.

"ఇదో అయిపోవచ్చింది.' అంటూ తల్లి దగ్గరికొచ్చిన సరయు గుండె ఝల్లుమంది.

"అమ్మా!" అంది ఆదుర్దాగా.

ఆవిడ పలకలేదు.

కళ్లు తెరిచి నిశ్చలంగా వున్నాయి. ఆమె కనుపాప మీద ఈగ వాలింది.

కెవ్వున అరిచి చేతిలో గిన్నె కింద పడేసింది సరయు. కంగారుగా దగ్గరికొచ్చాడు రమణ.

"అమ్మా!" దిక్కులు పిక్కటిల్లేలా అరిచింది సరయు. వెంటనే చలనం లేని తల్లి మీద పడి బావురుమంది.

రమణ గభాల్న ఆమెని పక్కకి లాగి శాంతమ్మ నాడి చూసి అది ఆగిపోయిందని గ్రహించడానికి అతనికెంతో సేపు పట్టలేదు.

"మైగాడ్!" అన్నాడు అప్రయత్నంగా.

"రమణగారూ! ... అమ్మ ..." తడారిపోతున్న పెదవుల్తో అంది సరయు.

రమణ వాస్తవంలో కొచ్చి తెరిచివున్న శాంతమ్మ కనురెప్పలు మెల్లగా మూసేశాడు.

తల్లి పోయిందని నిర్ధారణ చేసుకున్న సరయు తనని తాను మరిచి తల్లి శవంమీద వాలిపోయింది. మెల్లగా ఆమె రెక్క పట్టుకు లేవదీశాడు రమణ.

"రమణగారూ! అమ్మ!" రెండు చేతుల్లోనూ మొహం దాచుకుని పసి పిల్లలా ఏడుస్తున్న ఆమెని చూస్తుంటే అతని హృదయమంతా ఆమె పట్ల జాలితో నిండిపోయింది.

"సరయూ! అమ్మ పోయినా నీకు నేనున్నాను! జీవితాంతం నిన్ను కళ్ళల్లో పెట్టుకుని కాపాడుకుంటాను!" అని అక్కున చేర్చుకుని ఓదార్చాలని ఎంతగానో అనిపించింది. కానీ తన ఆరాటాన్ని మనసులోనే దాచేసుకుంటూ –

"ఛ! వూరుకోండి సరయూ! ప్లీజ్!" అన్నాడు.

"కానీ.... అమ్మ యముడు పిల్చినా వెళ్ళనని ఇప్పుడు చూడండి! నన్నిక్కడ ఒంటరిగా ఒదిలేసి...." రెండు మోకాళ్ళలో తల దాచుకుంటూ అంది సరయు.

"నిజమే! ఆవిడలాగే అనుకున్నారు మరి! కానీ అనుకున్నవన్నీ అనుకున్నట్లు జరిగితే మనం మానవులం ఎందుకవుతాం!" నిర్లిప్తంగా అన్నాడతను.

"ఉదయం హాయిగా లేచి మాట్లాడింది. ఇప్పుడిలా నిర్జీవంగా.... అన్ని

## శివోక్తం

(ప్రఖ్యాత కన్నడ కవి సర్వజ్ఞ వచనాలు ఆధారంగా)

ఆవిడకాయము కొరకయుంట లెస్స
పుట్టె చొనొకవేళ సంభోగ వాంఛ
కోర్కె పలియింప నర్ధాంగి గూడుమయ్య
పరుల కాంతలకై ఆసపడకుమయ్య

హరుని కోపాగ్ని కీలల మరుడు భస్మ
మయ్యెనను మాట చూడ సత్యమ్ముగాదు
నీరజాక్షుల కడగంట నిలిచి పుష్ప
బాణములు వేయుచున్నాడు బలముమీఱ

పశువులకు రమ్య సుమనోజ్ఞ భవనమేల
బోసినోటి వానికి ఇక్షు పుండ్రమేల
కోతులకు పాదముల తులాకోటులేల
బిచ్చగానికి రాజ్యాల ముచ్చటేల

- కనమలూరు వెంకట శివయ్య

బంధాల్ని తెంచుకుని...." దుఃఖంతో ఆమెకి మాట రావడం లేదు.

"అందుకే మనం ఏది చెయ్యలేం! జరిగేది చూస్తూండడం తప్ప!" వేదాంతిలా అన్నాడు రమణ. అతని కళ్ళు కూడా వర్షిస్తున్నాయి.

అతని కళ్ళలో ఎన్నో అగాధాలు కనిపిస్తున్నాయి.

సరయు తల్లిమీద పడి ఏడుస్తూనే వుంది– రమణ ఇప్పుడే వస్తానంటూ వెళ్ళి అయిదు నిమిషాల్లో వచ్చేశాడు. అతనొచ్చిన ఓ గంటకి ఇద్దరు స్త్రీలు వచ్చారక్కడికి.

తల్లిమీద పడి ఏడుస్తున్న సరయుని చేతుల్లోకి తీసుకుంది, వారిలో నడి వయస్కురాలు. ఆమెని చూశాక సరయు దుఃఖం రెట్టింపయింది. ఆ అపరిచిత స్త్రీ యదలో ముఖం దాచుకుని మరింత బావురు మంది.

ఆ స్త్రీ మౌనంగా ఆమె వెన్ను నివురుతూ కూర్చుండి పోయింది. ఆమె కళ్ళలో కూడా సన్నని నీటి తెర వెలిసింది.

రెండవ స్త్రీ చొరవగా ఇంట్లో కెళ్ళి గ్లాసు తెచ్చి ఫ్లాస్క్‌లోని కాఫీ కాస్త పోసి సరయు కివ్వబోయింది. సరయు తీసుకో లేదు.

"కొంచెం తాగండి" ఆప్యాయత నిండిన గొంతుతో అందామె.

"ఒద్దు!.... ఒద్దు! నాకేం ఒద్దు! నన్నొది లెయ్యండి. ప్లీజ్!" రెండు చేతుల్లోనూ ముఖం దాచుకుంటూ అంది సరయు.

ఆమె ముఖాన్ని తనకేసి తిప్పుకుంది చిన్నామె.

ఆమె కేసి చూసిన సరయు తృళ్ళిపడింది.

"తన నింతవరకు లాలించి ఓదార్చినామె ఆనాడు.... రమణ గదిలో.... ఒంటరిగా.... ఓహ్!" తల పట్టుకుని కూలబడి పోయింది సరయు.

రావల్సిన వారూ, బంధువులనుకున్న వారూ వచ్చాక రమణే దగ్గరుండి అన్ని ఏర్పాట్లూ చెయ్యడమేకాక తలకొరివి కూడా తనేపెట్టాడు.

"ఇది ఏనాటి బంధమో.... అయిన వాళ్ళంతా పక్కకి తప్పుకుంటే.... ఇంట్లో అద్దెకున్న కుర్రాడు అన్నీ తానే అయి ఆదుకున్నాడు!" అనుకున్నారంతా.

మర్నాడు విషయం తెలిసి ప్రభాకర్, శ్యామలా కూడా వచ్చి సరయుని, పరామర్శించి, నాలుగు అనునయవాక్యాలు పలికి వెళ్ళి పోయారు.

కర్మకాండలన్నీ ముగిశాయి. కర్చంతా రమణే పెట్టాడు. యధావిధిగా అన్ని చేశాడు.

శాంతమ్మ భౌతికంగా అదృశ్యమై పెద్ద ఫోటోలో చిరునవ్వులు చిందిస్తూ గోడమీద వెలిసింది.

పదిహేను రోజులై పోయాయి.

ఎవరిదార్న వాళ్ళు వెళ్ళిపోగా ఒంటరిగా మిగిలి పోయింది సరయు.




"పోయినోళ్ళందరూ మంచోళ్ళు! పోయిన వాళ్ళతో మనవూ పోతామా?" ఆమె కళ్ళు తుడుస్తూ అంది పెద్దామె.

"లేదు! అమ్మ లేందే– నేను ఒక్క క్షణం కూడా వుండలేను!" వెక్కుతూనే అంది సరయు.

"నిజమే! నీ బాధ ఒక్కనాటితో తీరేది కాదు. ఒక్క కాలమే మాన్పగలది గాయాన్ని.... కానీ దుఃఖాన్ని మర్చిపోవడానికి ప్రయత్నించు మీ అమ్మగారు కోరుకునేది కూడా నీ ఆనందమే. ఆమె ఏ లోకాల్లో వున్నా చూస్తూనే వుంటారు నిన్ను కాపాడుకుంటూనే వుంటారు. లే! ముందు లేచి కళ్ళు తుడుచుకో!" అనునయంగా అందావిడ.

"అవును అమ్మన్నట్టు మీ గాయాన్ని కాలం ఒక్కటే మాన్పేది కానీ దుఃఖంలో ఒంటరితనం మరింత దుఃఖాన్ని తెచ్చి పెడుతుంది.. అందుకే ఏ మాత్రం మీతో పరిచయం లేకపోయినా మీ ఇంటి కొచ్చాం. ఇంక నించి మనం ఆత్మీయులం! లెండి. కాస్త ముఖం కడుక్కుని తేరుకోండి!" అంటూ సరయుని దొడ్లోకి తీసు కెళ్ళి చనువుగా మొహం కడిగించింది రెండో ఆమె.

తుడుస్తున్న కొద్దీ నీళ్ళూరి కళ్ళు మసగ మసగ్గా వున్నాయి సరయుకి తల్లి శవాన్ని చూడగానే మళ్ళీ దుఃఖం వచ్చింది సరయుకి.

'ఛ! ఛ!.. . మళ్ళీ ఏడుస్తున్నారా?" ఆమె పక్కగా కూర్చుని కళ్ళు తుడిచి

ఫూర్తించి వచ్చిన వనజ విషయం తెలిసి ఒక్క పరుగున వచ్చి స్నేహితురాల్ని పట్టుకుని బావురు మంది సరయు మాత్రం విరాగిలా అలా చూస్తూండి పోయింది ఆమె కంట నీరు ఇంకిపోయింది.

"సరూ! ఒక్క నెల్లాళ్ళ పాటు మా ఇంట్లో వుందువుగాని రావే" అంటూ బతిమాలింది వనజ సరయుని. కాని సరయు ఆమె మాటని సున్నితంగా త్రోసి పుచ్చింది.

సరయు యాంత్రికంగా ఆఫీసు కెళ్ళొస్తోంది ఆఫీసు వాళ్ళు కూడా చాలా మంది వచ్చి పరామర్శించి వెళ్ళారు వనజ తరచూ వచ్చి నాలుగు ధైర్య వచనాలు చెప్పి వెళ్తోంది

మాధవ్ కూడా విషయం విని చాలా బాధపడ్డాడు ఎలాంటి అవసరం వచ్చినా తనని అడగ మన్నాడు. మొహ మాట పడద్దని మరీ మరీ చెప్పి వెళ్ళాడు

రమణ మాత్రం ప్రతిరోజూ ఏదో ఓ టైమ్‌లో వచ్చి కాసేపు కబుర్లు చెప్పి వెళ్తున్నాడు.

రోజులు నిస్సారంగా గడిచి పోతున్నాయి రోజులు గడిచిన కొద్దీ కాస్త దుఃఖాన్ని మరిచి పోతోంది సరయు. రమణతో చనువు పెరిగింది అతను కనిపించని రోజు ఏదో వెలితిగా వుండేదామెకి.

(ఇంకావుంది)

# సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? – చర్చ

## అవసరంలేదు



మానవ జీవితంలో తిండి, బట్ట మరియు విద్యకు విలువ ఇవ్వటం ఎంత అవసరమో సెక్స్‌కు అంత విలువనివ్వ అవసరం లేదు. సెక్స్ ప్రకృతి సహజమైన గుణం. మానవుని కర్తవ్యం పరోపకారం, దేశసేవ, మానవసేవలాంటి ఉత్కృష్టమైన పనులను ఒదిలివేసి అనవసరమైన సెక్స్‌కు ప్రాధాన్యం యిచ్చి సమయాన్ని వృధా చేయడం అవివేకం. ప్రత్యేకించి క్లాసులు పెట్టటం వలన భావి పౌరులు అయిన పిల్లలను చెడగొట్టవలసి వస్తుంది. సెక్స్ పుస్తకాలు చదివి ఎంతమంది చెడిపోయి, రేప్ కేసులను మనం ప్రత్యక్షంగా పేపర్లో చదువుతూనే వున్నాము. ప్రత్యేక క్లాసులు పెట్టి పిల్లల భవిష్యత్తును పాడు చెయ్యటం, వాటి వలన వచ్చే పరిణామం వలన మన భారతీయ సంస్కృతిని, స్త్రీ రక్షణను ఆ భగవతుడు కూడా కాపాడలేడు. వృత్తి విద్యలు, చేతిపనులు, ఇత్యాది విద్యలనుప్రవేశపెట్టి తద్వారా ప్రస్తుతం మనం ఎదుర్కొంటున్నఈ నిరుద్యోగ సమస్యతో పాటు దేశం ఎదుర్కొంటున్న దారిద్ర్య సమస్యను నిర్మూలించవచ్చు.

– జి. గుండయ్య, మాతుంగా, బొంబాయి

## అవసరమే



యువతరం బాగు పడాలంటే సెక్స్ ఎడ్యుకేషన్ 10వ తరగతిలోనే ప్రవేశపెట్టాలి. అసలు సెక్స్ అంటే ఏమిటో ఎంతవరకు అవసరమో సరైన అవగాహన లేకనే యువతరం పెడదారి పడుతుంది. ఏ విషయమైనా దానిని గురించిన మంచి చెడ్డలు తెలియటం వల్ల లాభమే కాని నష్టం వుండదు. స్కూల్లో ప్రవేశపెట్టనంత మాత్రాన వాళ్ళు పుస్తకాలు చదవటం లేదా? సినిమాలు చూడటంలేదా? చెడిపోయేవాళ్ళు సెక్స్ పాఠాలు వినే చెడిపోరు. చెడిపోయేవాళ్ళను బాగు చెయ్యటం ఆ బ్రహ్మ తరంకాదు. అలాగే మంచివాళ్ళను చెడగొట్టలేరు. సెక్స్ గురించి తెలిస్తే ఆ భయంతో హద్దు మీరి ప్రవర్తించరు. కొంతమంది డాక్టర్ ద్వారా వినవచ్చు అన్నారు. డాక్టర్‌గాని తల్లిదండ్రులు గాని ఎవ్వరూ చెప్పలేరు. కేవలం టీచర్ మాత్రమే విద్యార్థులకు అర్థమయ్యేటట్టు, భవిష్యత్‌ను తీర్చిదిద్దే రీతిలో చెప్పగలరు.

– టి. వి. విజయకుమారి, షెదమట్టపల్లి, భద్రాచలం

## అనవసరమే!



సెక్స్ అనేది జీవితములో ఒక భాగము మాత్రమే. సెక్స్ గురించి కాదు మనం నేర్చుకోవలసింది. జీవితములో చదువవలసినది, నేర్చుకోవలసింది చాలా వుంది. ఒక వేళ సెక్స్ ఎడ్యుకేషన్ కళాశాలలో ప్రవేశపెట్టినా, విద్యార్థులు తమ ఆలోచనలను దాని చుట్టే పరిభ్రమింపచేసుకొంటూ అతి విలువైనటువంటి కాలాన్ని దుర్వినియోగం చేసుకోవచ్చు. 'సెక్స్ అంటే పాపము' అనే రోజులు పోయాయి. ప్రతి ఒక్కరు సెక్స్ గురించి చదవకుండానే గ్రహించుకొగలరు. అందువలన సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? అంటే అనవసరమనేనా అభిప్రాయము.

–సి. ఉమ, కోటిదేల కర్నూల్

## కళాశాల స్థాయి నుంచి ఉండాలి



నిత్య జీవితములో మనిషికి ఆకలి ఎంత సహజమో యవ్వనములో అడుగిడిన తర్వాత యువతీ యువకులకు సెక్స్ అనేది కూడా అంతే సహజం. సెక్స్ అనేది ప్రకృతి సహజంగా మానవుని అంతర్యంలో ఉదయించేది కావచ్చు. కాని ప్రకృతి సహజంగా ఉదయించే మానసిక పరిస్థితి వారిని తప్పు దారి పట్టించేదిగా ఉండకూడదు. ప్రకృతి సహజంగా కలిగే మార్పులలో వారి ఆలోచనలు యవ్వనంలోకి అడుగిడిన తర్వాత సెక్స్ చుట్టూనే పరిభ్రమిస్తూ ఉంటాయి. సరి అయిన అవగాహన లేక, దానిని గురించి తెల్సుకోవాలనే ఆరాటంలో యువత తప్పు దారి పట్టే అవకాశం ఎంతైనా ఉంది. కాబట్టి నేటి యువతకు లైంగిక విద్య గురించి తెల్సుకోవాల్సిన అవసరం చాలా ఉంది. సెక్స్ గురించి సవివరంగా నేర్చుకోవటం తప్పుకాదు. ఎందుకనగా ఇది కూడా ఒక విధమయిన సైన్సు వంటిదే. మనం కళాశాలల్లో ఆయా శాస్త్రాలను ఏ విధంగా అభ్యసించుచున్నామో అదే విధంగా సెక్స్ గురించి కూడా నేర్చుకోవాలి. మన ప్రభుత్వం నూతన విద్యా విధానంలో ఎన్నో మార్పులు తేవాలని ప్రణాళికలు తయారు చేస్తుంది. కళాశాల విద్య నుండి లైంగిక విద్యను బోధించటం చాలా అవసరం.

- సిహెచ్. సంధ్యారష్మి నల్గొండ

## సబబు కాదు



సెక్స్ ఎడ్యుకేషన్ వలన లాభాల కంటే హానే ఎక్కువ. సెక్స్ అనేది ప్రకృతి సహజంగ ఉదయించేది. దీని కంటూ ప్రత్యేకమైన క్లాసులు అనవసరం. ఒకరు చెప్పితే నేర్చుకొనేది కాదు సెక్స్. వయస్సు వచ్చిన ప్రతి ఆడ, మగాలో తెలియకుండానే సెక్స్ ఉద్భవిస్తుంది. సెక్స్, ఇలా క్లాసులు నిర్వహించి చెప్పవలసినదయితే ఇంత జనాభా కూడా పెరిగేది కాదు. సెక్స్ అనేది ప్రతి జీవరాశిలోను, జంతు, పక్షి, కీటక, మానవ తేడా లేకుండా ప్రకృతి సహజంగా జరిగే చర్య.

ఏదైనాగాని గుప్తంగా వుంటే అందం. దాని గురించి తెలుసుకోవాలనే ఆరాటం ఉంటాయి. అది కాస్త బాహ్యంగా వుంచితే సెక్స్ పట్ల అసహ్యం ఏర్పడే రోజులు రావచ్చు. ఎటు చూసిన సెక్స్ ఎడ్యుకేషన్ వల్ల యువతరానికి నష్టాలేకాని, లాభాలు లేవు. ఆచారాలు, కట్టుబాట్లు వున్న మన దేశంలో సెక్స్ ఎడ్యుకేషన్ వుండడం ఏమాత్రం సబబు కాదు.

–జే. వి. సురేష్ బాబు, నబికోట, కడప □






# గోపి

## వంటింటి మర

జీవితకాలం ఉచిత సర్వీసు



మర వేసిన పదార్థాన్ని సేకరించేందుకు గుండ్రని పాత్ర అదనం.

"వంటింట్లో గోపీ నాకెదురుగా వుంటే కష్టం తెలీకుండా పనిని చకచకా చేసుకుపోగల్ను! ఎందుకో తెల్సా? మూడు జార్లు, ఒక మెషీన్‌తో బాటు ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో గోపీ వుంటాడు – వీటన్నిటికీ అదనంగా ఖర్చు పెట్టాల్సిందేమీ లేదు.

పొడులు చేసుకోవాలనుకున్నా, పిండి రుబ్బుకోవాలనుకున్నా, క్షణాల్లో అందుకనుగుణంగా మార్చగల సౌకర్యం గోపీ దగ్గరే వుంది.

ఇంతేకాక కొన్ని ప్రత్యేకమైన పనులకు అవసరమైన అనుబంధ పరికరాలు చాలా వున్నాయి గోపీ దగ్గర. ప్రతిదీ విడివిడిగానే వుంటుంది. వాటిని విడివిడిగా కొంటే నాకెంత ఖర్చవుతుందో, గోపీవల్ల నాకెంత డబ్బు ఆదానో ఒకసారి ఆలోచించండి!

గోపీకున్న భారీ స్తోమతగల మోటారును నేను ఎంతసేపైనా నిర్భయంగా ఉపయోగిస్తాను.
వంటింట్లో గోపీవుంటే చాలు. వంటింట్లో పని రాకెట్ స్పీడుతో జరిగిపోతుంది నాకు.

కొత్తమార్పులతో రూపొందించిన లాకెట్టి సిస్టం, స్కాప్పర్ లిడ్, మరియు బహు విధాలుగ వుపయోగించే అందమైన థర్మోకోల్ ప్యాకింగుతో లభ్యమయ్యే గోపీ నిస్సందేహంగా మిక్సీల రాజే!

కొత్తమార్పులతో రూపొందించిన లాకెట్ట్ సిస్టం, స్కాప్పర్ లిడ్, మరియు బహు విధాలుగ వుపయోగించే అందమైన థర్మోకోల్ ప్యాకింగుతో లభ్యమయ్యే గోపీ నిస్సందేహంగా మిక్సీల రాజే!

ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడులలో విక్రయదారులు :

**త్రిప్త మార్కెటింగ్ ప్రయివేట్ లిమిటెడ్.**

బెంగుళూరు, ఫోన్: 563322 హైదరాబాద్. ఫోన్ : 281224 మద్రాసు, ఫోన్ : 88599

పెద్దకథ

# మిత్ర చతుష్టయం



వంగ మూలం: ప్రమథ చౌధురి

తెనుగు సేత: ముక్కామల వెంకటేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

ఆ రాత్రి మేమిద్దరం ఆరంభించిన జీవన నాటకాభినయం ఏడాది తరువాత మరో రాత్రి అంతమయింది. తొలి రేయి ముచ్చట్లు చెప్పాను. శేషరాత్రి విశేషాలు వివరిస్తాను. ఆ రెండు రాత్రుల విశేషాలే నాకు బాగా గుర్తున్నాయి. నా హృదయంలోని అదృశ్య తంత్రుల్ని 'రిణీ' తన చేతి వ్రేళ్లతో మీటి నా మనసుని బొమ్మలా ఆడించింది. నా అంతర్యంలో ఆమె రేపిన ప్రవృత్తిని 'ప్రేమ' అని అంటారో లేదో నాకు తెలియదు కాని ఆ ప్రవృత్తిలో అహంకారం, అభిమానం, అనురానం, పట్టుదలా వున్నాయి. వాటితో పాటు కరుణ, మధుర, వినమ్ర, స్నేహ రసాలు కూడా వున్నాయ్. ఆమె వేళ్ల సవరింపులో స్వరం ఒకోమారు అతి సుతారంగా ఒకోమారు అతి తీవ్రంగా వుండేది.

'రమణి కేవలం మన శరీరచ్ఛాయే'నని ఫ్రెంచి కవి అన్నాడు. దాన్ని బంధించాలని ప్రయత్నిస్తే పారిపోతుంది. దాని బారి నుండి పారిపోవాలని చూస్తే వెన్నాడుతుంది. పన్నెండు నిండు మాసాలు ఆ ఛాయతోనే దాగుడుమూత లాడాను. ఆ ఆటలో నాకేం మజా కనబడలేదు.. అలాగని ఆ ఆటను వదిలిపెట్టనూ లేకపోయాను. నిజానికి ఆట కట్టిపెట్టాలనీ అనిపించలేదు. మనసులోని ఈ కొత్త అశాంతిలో కొత్త జీవితంలోని సరికొత్త రుచి పట్ల అభిలాష వుండేది.

విశ్వ ప్రయత్నం చేసి కూడ 'రిణీ'ని హస్తగతం చేసుకోలేకపోయినందుకు నేను సిగ్గు పడటం లేదు. వాయు ఆకాశాల్నింతవరకూ ఎవ్వరూ హస్తగతం చేసుకోలేకపోయారు. ఆమె మనః స్థితి కూడా ఆకసంలాగానే క్షణ క్షణానికీ రంగులు మారేది. ఇవ్వాళ గాలీ వానా, విద్యుద్ఘాతాలూ; రేపు చల్లని వెన్నెల, వసంత గాలీ!

మేం నెలకు పది పన్నెండుమార్లయినా కలహించుకునేవాళ్లం. మళ్లీ జన్మలో ఒకరి ముఖాలు మరొకరు చూడరాదని దేవునిమీద ప్రమాణాలు చేసుకునే వాళ్లం, రెండు రోజులు పూర్తి కాకుండానే ఆమె దగ్గరకు చేరేవాణ్ని; లేదా ఆమె నన్ను సమీపించేది. ఆ కలయికలో పూర్వ వృత్తాంతమంతా మరచిపోయేవాళ్లం. అదే తొలి కలయికగా అనిపించేది. ఇలా రోజులూ, నెలలూ గడిచాయి. మా చివరి కలహం మాత్రం సుదీర్ఘమయినది. చెప్పడం మరచాను - నాలో అజ్ఞాతవాసం చేస్తున్న అసూయను మొదటగా వెదికి వెలికి తీసింది ఆమే!నేను భూమ్మీద అనేక మందిని అవహేళన చేసి వుండొచ్చు గాని ఇంతవరకూ ఎవరినీ హింసించలేదు. ముఖ్యంగా జార్జి వంటి వ్యక్తుల్ని హింసించడమంటే నాలాంటివాళ్లకు వేరే హీనతేముంటుంది? నాకున్నవల్లా ధన బలం, శరీర బలం. కాని హైన్యం నాలో చోటు చేసుకోవడానికి 'రిణీ'యే కారణం. ఆ దౌర్బల్యమే నా మనసుని బాగా హత్తుకు పోయింది. 'రిణీ' వుత్తరం రాయకుంటే ఎన్నడూ ఆమె ముఖం చూసి వుండేవాణ్ణికాదు. ఆ వుత్తరంలోని ప్రతి అక్షరం నాకు గుర్తుంది.

"మిమ్మల్ని చివరిసారిగా చూసినపుడు మీ శరీరం సడలిపోతున్నట్టు గమనించాను. మీకు ఛేంజ్ ఎంతో అవసరమని భావిస్తున్నాను. నేనున్న ప్రాంతంలోని గాలి మనుషులకు పునర్జన్మ యిస్తుంది. ఇది అతి సాధారణమయిన పల్లెటూరు. ఇది మీలాంటి వారికి అనువయిందికాదు. కాని దీనికి సమీపంలో ఎన్నో మంచి హోటళ్లు వున్నయ్. మీరు రేపె ఇంగ్లండు వదలి అక్కడికి వెళితే బావుంటుందని భావిస్తున్నాను. ప్రస్తుతం ఏప్రిల్ నడుస్తోంది. ఇంకా ఆలస్యం చేస్తే అంత అద్భుత కాలం మళ్లీ రాదు. మీ చేతిలో డబ్బు లేకపోతే నాకు టెలిగ్రాం ఇవ్వండి. డబ్బు పంపిస్తాను. తరవాత ఎపుడేనా వడ్డీతో సహా చెల్లించివేద్దురుగాని."

ఆ వుత్తరానికి నేను జవాబివ్వలేదు కాని మర్నాడు ఉదయమే ఇంగ్లండు వొదిలి బయలు దేరాను మీకా ప్రాంతం పేరు చెప్పను. రిణీ వున్న ప్రాంతం పేరు 'బి'తో ఆరంభమవుతుంది. దాని ప్రక్క స్టేషను పేరులోని మొదటి అక్షరం 'డబ్ల్యు'.

రైలు మధ్యాహ్నం రెండు గంటలకు 'బి' స్టేషను చేరుకుంది. ఫ్లాట్‌ఫార్మంతా కలయజూశాను.రిణీ జాడ లేదు. నా కళ్లు దూరంగా వెదకసాగాయి. ఫ్లాట్‌ఫారమ్ కవతల ఫెన్సింగ్‌కు దూరంగా రహదారి ప్రక్కనున్న చెట్టు నానుకుని నిలబడివుంది రిణీ. నిగనిగలాడే నల్లని గౌనుమీద ముదురు పసుపు రంగు జాకెట్ వేసుకుంది. ఆమె ముఖంలో, కనుల్లో నునుసిగ్గు రక్తిమ తొణికిసలాడుతోంది. సిగ్గుతో మొగ్గయిపోతూ కనులెత్తి నన్ను చూడ లేకపోతోంది. ఆమె ముఖంలోని సౌందర్య మాధుర్యాన్ని కళ్లతో తాగుతూ గుండెను నింపుకుంటూ వుండిపోయాను. ఆమెను ఎన్నడయినా ఆరాధనాసక్తితో చూసి వుంటే ఆరోజే, ఆ ముహూర్తంలో నేనని చెప్పాలి.

'బి' స్టేషన్లో ఒక నిముషం కంటే ఎక్కువాగలేదు రైలు. కాని ఆ ఒక్క నిముషం అనంతకాలంగా అనుభూతి చెందాను. మరో ఐదు నిముషాల్లో రైలు 'డబ్ల్యు' స్టేషన్లో ఆగింది.

సముద్రపు టొడ్డునే వున్న ఓ పెద్ద హోటల్లో దిగాను. ఎందువల్లనో ఆ హోటల్లో దిగగానే ఎంతో అలిసిపోయినట్టనిపించి బట్టలు మార్చుకొని నిద్రపోయాను. నా విదేశీ జీవనంలో అది మొదటిసారి పగలు నిద్రపోవడం. నా జీవితంలోనే అంత సుఖ నిద్ర ఎరగను. నిద్ర మేల్కొని చూసేసరికి సాయంత్రం ఐదయింది. గబగబా బట్టలు మార్చుకుని టీ తాగి సముద్రతీరం వైపు నడవసాగాను.

నాలుగడుగులు వేసి చూసేసరికి 'బి' గ్రామ పొలి మేరలో ఓ స్త్రీ సహించలేని నిరీక్షణలో వున్నట్టు అటూ యిటూ పచార్లు చేస్తూ కనబడింది. దూరం నుండి పోల్చుకోలేకపోయాను. ఇంతలోనే మళ్లీ డ్రస్సు మార్చింది కాబోలు రిణీ.

నన్ను చూడటంతోనే పరుగు లంఘించి పారిపోయింది రిణీ. అదే దిక్కుగా నేనూ మెల్లగా నడుస్తున్నాను. దూరంగా పారిపోయి ఓ చోట



నిలబడి చూస్తోంది. స్వర్ణ ముద్రాంకిత గ్రీకు రమణీమూర్తిలా వెలిగిపోతోంది రిణీ. ఆ మూర్తిలో సౌందర్యంతో పాటు కాఠిన్యమూ వుంది. సమీపించగానే రెండు చేతుల్తో ముఖం కప్పుకుంది. ఎదురుగా వెళ్ళి నిలబడ్డాను. ఇద్దరం మాటల్లేని బొమ్మల్లా నిలబడిపోయాం.

"ఇక్కణ్ణుంచి వెళ్ళిపొండి. మీ ముఖం చూడను. మీతో నేనసలు మాటాడను."

"రమ్మన్నా వెందుకు?"

"ఆరోజు మనసు బాగోక. బాగా ఒంటరితనం ఆవరించిందా రోజు. ఉత్తరం అందగానే వచ్చేస్తారనుకోలేదు. మీలాంటి నల్లజాతి వాళ్ళతో తిరుగుతున్నానని తెలిస్తే మా అమ్మ ఇంట్లోంచి వెళ్ళగొడుతుంది."

"మరి స్టేషను కెందుకు వచ్చావ్?"

"ఉత్తరం పోస్టు చెయ్యడానికి."

"ఉత్తరం పోస్టు చెయ్యడానికి అంత ముస్తాబు కావాలా?"

"మిమ్మల్ని చూడకుండా వుండలేననా మీ వుద్దేశం?"

"మరి కళ్ళు మూసుకున్నావేం?"

"నా కళ్ళకు వెలుతురు సరిపడదు. కళ్ళకు జబ్బు చేసింది."

"ఏది చూడనీయ్. ఏమయిందో?" అంటూ చేయి చాపబోయాను.

"మీ చేతులు తీసెయ్యండి. లేకుంటే కళ్ళు తెరవను. బలవంతంగా నా కళ్ళు తెరిపించలేరని తెలీదా?"

"బాగా తెలుసు. నేను జార్జిని కాదని. శరీర బలంతో నేనెవరి కళ్ళూ తెరిపించలేను."

"నా అంతట నేనే కళ్ళు తెరవగలను. మీలా నేనేమి అంధురాల్ని గాదు. ఇతరుల మనస్సుల్లోకి తొంగి చూడగల శక్తి మీకుంటే నన్నీ విధంగా బాధించరు. నాకెందుకు కోపం వచ్చిందో తెలుసా? మీ డ్రస్సు చూడలేక కళ్ళు మూసుకున్నాను."

"ఏం? నాకున్న దుస్తుల్లో కెల్లా అందమయిందే!"

"ఈ డ్రస్సులో నేనా నేను మిమ్మల్ని తొలిసారి చూసింది?"

ఆమె ప్రశ్న వింటూనే ఆమె దుస్తుల వంక పరిశీలనగా చూశాను. తను మాత్రం మా తొలి పరిచయంనాడు వేసుకున్న దుస్తులే వేసుకుంది.

"పురుషులే దుస్తులు ధరించినా మీకు ఒరిగే దేముంది?"

"ఏం? మేం మనుషులంగాదా? మాకు కళ్ళు లేవా? పురుషులు అందంగావున్నా, కురూపులుగా వున్నా మాకేం సంబంధం లేదనా మీ వుద్దేశం?"

"అనే నా వుద్దేశం."

"మరయితే నన్నెందు కాకర్షిస్తున్నట్టు?"

"రూపంతో."

"మీ మాటలు విని మోహంలో పడిపోయానని మీరనుకోవచ్చు. కొంతవరకు నిజమే. మీ మాటలు వింటుంటే ఎంతో బావుంటుంది. ఏదో మత్తు ఆవరిస్తుంది. ఏ దుర్ముహూర్తాన మిమ్మల్ని చూశానో గాని అపుడే అనుకున్నాను నా జీవితంలో అగ్ని రగుల్కొందని. నేను కావాలనుకున్నా వద్దనుకున్నా మీతో నాకు చిర సంఘర్షణ వుంటూనే వుంటుంది."

"ఇంతకు ముందెపుడూ ఈ విషయం ప్రస్తావించలేదేం?"

"అది చెవుల్తో వినేదికాదు. కళ్ళతో చూసేది. మీరు అంధులని వుత్తినే అంటున్నాననుకున్నారా? ఇపుడు విన్నారుగదా! రండి సముద్ర తీరాన కూర్చుందాం. మీతో ఇవ్వాళ ఎన్నో విషయాలు మాటాడాలి."

పది నిముషాలాగి నా చేతిని తన చేతిలోనికి తీసుకుంటూ మళ్ళీ ఆరంభించింది.

"మీ ముఖం కంటె మీ చెయ్యే నిజం చెబుతుందని మీకు తెలుసా?"

"అంటే?"

"మీరు ముఖంలో దాచిన భావం చేతిలో దాగదు. మీ రక్తంలో వున్న విద్యుత్తు వేళ్ళ ద్వారా బహిర్గతమవుతుంది."

"రిణీ! ఇవ్వాళ అదోలా మాటాడుతున్నావ్? దీనివల్ల నా అహంకారం పెరుగుతుందేగాని మనసు మారదు."

"నన్నాకర్షించింది మీ రూపమో? మనసో? నాకు తెలీదు. మీ ముఖంలో మనః ఛాయ ప్రస్ఫుటంగా



# మిత్ర చతుష్టయం

వుంది. నేను ఇవాళ మీతో నిజం చెప్పి తీరాలి. మీ అహంకారం పెరిగితే నాకు నష్టమే గాని లాభం లేదు."

"ఎలాంటి నష్టం?"

"నా పట్ల మీరు ప్రదర్శించిన నిష్ఠుర వైఖరికి మీ అహంకారమే గాని మరేది కారణం గాదు.

"నిష్ఠురంగా నేను ప్రవర్తించానా?"

"అవును. మీరే. ముందు సంగతి వదిలేయండి. గత నెల రోజుల్నుండి రోజూ పదిసార్లు పోస్టుమన్ వచ్చినపుడల్లా మీ వుత్తరానికి ఎదురు చూసేదాన్ని చివరకు అవమానం భరించలేక లండను వదిలి ఇక్కడకు వచ్చేశాను."

"అది నువ్వు కోరి తెచ్చుకున్న అవమానం."

"ఎలా?"

"నాకు రాస్తే తప్పక కలిసేవాణ్ని."

"ఆఁ దొరికిపోయారు! మీ అహంకారాన్ని మీరు వొదులుకోలేరు కాని నేను నా అహంకారాన్ని వొదులుకోవాలా?"

"కష్టం నీకేనా? నిన్ను చూసిన దగ్గర్నుండి నాకు కలిగిన సుఖం భగవంతుడికి మాత్రమే తెలుసు."

"ఈ సృష్టిలో జడ పదార్థాన్ని మినహాయిస్తే సుఖించే అర్హత ఎవరికీ లేదు. నేను మీ జడ హృదయంలో జీవనం వూదాను. అదేగా నా అపరాథం?"

రిణీ నా చెయ్యి వదిలి వేసింది. ఇద్దరం ఇసుకలో సముద్ర ముఖంగా కూర్చున్నాం. ఇరువురి మధ్య వున్న మౌనాన్ని చీలుస్తూ "రిణీ! నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?" అన్నాను.

"ఔను."

"ఎప్పట్నుంచి?"

"మిమ్మల్ని మొదటిసారి చూసినప్పటినుంచి. మీరు నన్ను ప్రేమించడంలేదా?"

"నీమీద నా భావా లనేకం."

"మీ మనసులో మాట మీ కంటే నాకే బాగా తెలుసు."

"నీకు తెలుసో లేదో నాకు తెలీదు."

"కేవలం నా మనసుతో ఆడుకుంటున్నట్టుగా మాత్రమే అనుకుంటున్నారా? మీరు!"

"ఎప్పుడు తెలుసుకున్నావ్?

"ఇవ్వాళే"

"ఎలా?"

"స్టేషన్లో మిమ్మల్ని చూసి"

"ఇనాళ్ళూ చూడలేకపోయావా?"

"లేదు. మీ మనస్సుకి నా మనస్సుకి మధ్య మన అహంకారపు తెర లుండిపోయాయి."

"నన్నెంతగా ప్రేమిస్తున్నావని కూడా నే నడగను."

"ఎందుకని?"

"నాకు తెలుసు గనుక"

"ఎంతవరకు?"

"జీవితంకంటె మిన్నగా. నేను నిన్ను ప్రేమించడంలేదని తెలిసినప్పుడు ఈ ప్రపంచంలో నీకు మిగిలేదేమి వుండదు. జీవితానికి ఓ అర్థమూ వుండదు."

"ఈ నిజ మెలా తెలిసింది?"

"నా మనసు ద్వారా"

నా జవాబు విని రిణీ లేచి నిలబడి "పొద్దుపోయింది. ఇంటికి వెళ్లాలి. పదండి మిమ్మల్ని స్టేషనుదాకా దిగబెడతాను" అంది.

దారి చూపుతూ ఆమె ముందు నడవ సాగింది. నేను ఆమెను అనుసరిస్తున్నాను.

పది నిముషాలు నడిచిన తరువాత ఆమె మాటాడింది.

"ఇన్నాళ్ళూ మనం ఆడిన నాటకం ఈనాటితో ముగిస్తే బావుంటుంది."

"వినోదాంతమా? విషాదాంతమా?"

"అది మీ చేతుల్లో వుంది."

"ఒకర్నొకరు విడిచి నెల రోజులు వుండలేనివాళ్ళం ఆ జన్మం విడిచి వుండగలమా!"

"అయితే కలిసి వుండాలంటే ఏంజెయ్యాలి?"

"వివాహం"

"అన్ని విధాలా ఆలోచించే అంటున్నారా?"

"నా కంకేమి ఆలోచించే శక్తి లేదు. నాకు తెలిసిందల్లా నిన్ను విడిచి ఒక్క రోజైనా వుండలేననే"

"రోమన్ కాథలిక్ కావడం ఇష్టమేనా?"

ఆ ప్రశ్న వినేసరికి మిన్ను విరిగి మీద పడినట్టయింది నాకు. ఏమి జవాబు చెప్పలేకపోయాను.

"బాగా ఆలోచించి రేపు చెప్పండి. అదిగో! ట్రియిన్ వొస్తోంది. టికెట్ కొని త్వరగా అందుకోండి!"

టికెట్ కొన్నాను మొదటి తరగతి కంపార్ట్మెంట్లో ఎక్కబోతూండగా జార్జి దిగుతూ ఎదురయ్యాడు.

ఇంతలో బండి కదిలింది. డోర్ వద్ద నిలబడి చూడసాగాను.

రిణీ, జార్జి పక్క పక్కగా నడుస్తూ వెళుతున్నారు.

ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. అలాగని మేల్కొనే లేను. ఉన్మాదావస్థకు నాందిలా మనసు వికల వికలంగా వుంది.

మరునాడుదయం మంచంమీది నుండి లేవబోతోండగా పని మనిషి వచ్చి ఓ వుత్తరం అందించాడు ఉత్తరంలో ఇలా వుంది.

"రాత్రి పన్నెండు గంట లయింది. మీకో శుభ వార్త అందించాలని ఎంతో తహతహగా వుంది. ఏడాది నుండీ చూపిన ప్రతీక్షకు ఈనాడు ఫలితం దక్కింది. జార్జి తనను పెళ్లి చేసుకోమని ప్రస్తావన తెచ్చాడు. ఒప్పుకున్నాను. స్టేషన్లో మిమ్మల్ని చూసి జార్జి చాల కంగారు పడ్డాడు. నా ప్రశ్నకు రేపటిలోగా మీరు జవాబిస్తారని తెలియగానే క్షణం కూడా విలంబన్న లేకుండా మా పెళ్లి నిశ్చయించాడు. దీనికి మీకు నేను ఆజన్మం రుణపడి వుంటాను. మీరూ నాకు జీవితాంతం కృతజ్ఞులై వుండాలి. నాతో పిచ్చిగా ప్రవర్తింపబోయారు. అదేమిటో మీకు భవిష్యత్తులో గాని తెలీదు. నేను వాస్తవికవాదిని.

నిజంగా నేను మీ విషయంలో రక్షితను. తారిణిని. మీ నుండి నే నాశించే దొ హటే. మళ్లీ జీవితంలో నన్ను చూడాలని ఆశించకండి. మనసంతా అదోలా వుంది. ఇంకేమీ రాయలేకపోతున్నాను. గుడ్ బై!"

నేను, జార్జి - ఇద్దరిలో ఎవరెక్కువ కృపా పాత్రలో ఈ నాటికీ నాకు బోధపడలేదు.

ఇంతలో సేన్ నవ్వుతూ, "సోమ్‌నాథ్! నీ అహంకారమే నిన్ను అగమ్యగోచరంగా వుంచింది. ఇందులో బోధపడక పోవడానికేముంది? రిణీ నిన్ను కోతిగా జేసి ఓ ఆట ఆడించిందని విస్పష్టంగా తెలుస్తూనేవుంది. శితేశ్ మోహం ఓ గంటలో విడిపోయింది. కాని నీ మోహం ఈ నాటికీ నిన్నొదల్లేదు. శితేశ్ అంగికరిస్తాడు. అహంకారం అడ్డురావడంవల్ల నువ్వు ఒప్పుకోవు. అంతే తేడా" అన్నాడు.

"లేదు, లేదు. కథ నువ్వనుకున్నంత సులువైనదికాదు. ఓ నెల్రోజుల తర్వాత ఓ నాటి సాయంత్రం పారిస్ హెటల్లో కూర్చుని వుండగా హఠాత్తుగా రిణీవచ్చి కూర్చుంది. ఆమెను చూసి నమ్మలేనట్టుగా "అయితే జార్జిని పెళ్లాడలేదా?" అన్నాను.

జవాబుగా ఓ చిరునవ్వు పారేసి "పెళ్లి కానిదే హనీమూన్‌కి ఎలా వచ్చామనుకుంటున్నారు? మిత్రుడున్నారని తెలిసి జార్జికి మాయమాటలు చెప్పి ఇక్కడకు తీసుకొచ్చాను. జార్జి తన స్నేహితుడింట్లో డిన్నర్‌కు వెళ్లాడు. నేను మెల్లిగా జారుకుని మిమ్మల్ని చేరుకున్నాను."

ఆ సాయంత్రమంతా రిణీ కబుర్లతో నే గడిపింది. అదంతా తన పెళ్లి గురించే.

సోమనాథ్ మాటల్ని మధ్యలోనే తుంచుతూ "ఇవన్నీ నువ్విప్పుడు కల్పించి చెబుతున్నావ్! క్షణం క్రితం సంభాషణలో 'బీ' స్టేషన్లో రిణీని ఆఖరిసారి చూశానన్నావ్! ఇంతలోనే పట్టుబడిపోయావ్!" అన్నాడు శితీశ్ తొందరపడుతూ.

"లేదు, మొదట చెప్పిందే అబద్ధం, చివరిదే నిజం" అన్నాడు సోమ్‌నాథ్ జంకూ గొంకూ లేకుండా పారిస్‌లో చూడడం చివరిసారిగాదు. లండన్‌లో రిణీని చాలసార్లు చివరిసారిగా చూశాను" అన్నాడు.

"అసలు ముగింపు జరిగిందో లేదో నాకు అర్థం గావడంలేదు" అన్నాడు శితీశ్ విసుగ్గా.

"ఎందుకులేదు. వుంది, పెళ్లయిన ఏడాదికి రిణీ జార్జిని వొదిలేసింది. తాగిన మైకంలో గాకుండా ప్రేమోన్మాదంలో ఆమెను జార్జి హింసిస్తున్నాడని కోర్టులో రుజువయింది. ఆ తరవాత స్పెయిన్‌లో ఓ కాన్వెంట్‌లో రిణీ తలదాచుకుంది.

"జార్జి మా మంచి పని చేశాడులే. నేనైనా అలానే చేసివుందును" అన్నాడు వుద్రేకంగా శితీశ్.

"ఆ స్థితిలో బహుశా నేనూ అలానే చేసి వుండేవాణ్ని. అలాంటి ధర్మచింతన ప్రతివాడికీ వుంటుంది" అన్నాడు సోమ్‌నాథ్.

సోమ్‌నాథ్ ప్రవర్తనా, చరిత్రా విభిన్నాలని అతని ప్రణయ చరిత్రే చెబుతోంది. గరళం కంఠంలో వున్నా మనసులోనికి చేరలేదు. నత్తగుల్ల పెంకులా బాహ్యరూపంలో కాఠిన్యం వున్నా జెల్లీ దేహంలా అతని మనసు మహ మెత్తన.

ఇంతసేపూ మేమంతా కథలో లీనమయి పోవడంతో బయటి ప్రపంచాన్ని మరచిపోయాం. అంతా మూగపోయినట్టు మిన్నకుండేసరికి ఆకాశంవంక తేరిపారజూశాను. మబ్బులు విడిపోయినయ్. చందమామ స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నాడు. నలుదిశలా వెన్నెల విహారం చేస్తోంది.

మళ్లీ నా కథనం ఆరంభించాను.

## నా కథనం

సోమ్‌నాథ్ చెప్పినట్టు లవ్ఈజ్ బోత్ ఎ మిస్టరి అండ్ ఎ జోక్ అని మనం ఒప్పుకుని తీరాలి. ఎందుచేతంటే ఈ ప్రేమలోపడే మనిషి కవిత్వమూ రాస్తాడు. ఆ కవిత్వమూ లౌకికమయినా ఆ శృంగారం అశ్లీలమయినా సమాజం అభ్యంతరం చెప్పదు.




దాన్తే, బొకాసియో ఒకే యుగానికి, చెందిన రచయితలు మాత్రమేగాదు. ఒకరు గురువు, మరొకరు శిష్యులు, డాన్ జువాన్, ఎపిప్ సిపిడియాన్ వుభయులూ కవిమిత్రులే. ఒకే గదిలో వుంటూ రచనలు చేశారు. అయినా విభిన్న ధృవాలవంటి మహారచయిత లందరికీ సమాన గౌరవ ప్రపత్తులున్నాయని మీకు తెలుసు

"బైరన్, షెల్లీలు ఆ రెండు గ్రంథాలను ఒకచోట. ఒకే కాలంలో రాశారని నా కింతవరకు తెలీదు" అన్నాడు సేన్.

అలా కాకపోయినా, అలా జరిగి వుండవలసింది. మీ ముగ్గురి కథనాలతో మనుషుల్ని మత్తెకించే మూడు ప్రహసనాలను రాసి వుండేవాణ్ని. సేన్ తను కవితలో చదివినదాన్ని పొందాలని తహతహలాడాడు. శితీశ్ తను జీవితంలరో పొందిన దాంతో కవిత్వ రచన చేయబోయాడు; సోమ్‌నాథ్ మాత్రం జీవితంలోని కావ్యాంశాన్ని పక్కకునెట్టి బ్రతకాలని చూశారు. ఫలితంగా ముగ్గురూ మూర్ఖులయ్యారు. ఎంచేతంటే సమాజ చక్షువులెపుడూ సూర్యరశ్మిలో గాని చంద్ర కాంతిలో గాని మనిషి మనసును లోతుగా చూస్తాయి. ఐతే మీరీనాడు మీమీ మనః ప్రతిబింబాలు చూసుకుంటోన్న వెలుగు ప్రకృతి సహజమయినదికాదు. మాయాకాంతి అందుచేతనే నేను చెప్పబోయే కథలో ఏమున్నా లేకపోయినా ప్రహసనంగాని, సిగ్గుపడవలసిన అంశంగాని లేవు.

ఇదో స్త్రీగాథ. కాబట్టి వుపోద్ఘాతంలో నా ప్రస్తావన అనవసరం. ఆమెలో ఏమీ విశేషం లేకపోవచ్చు గాని దొంగా గాదు, పిచ్చిదీ గాదు.

పోయిన జూన్‌లో కలకత్తాలో నేనొంటరిగా వున్నాను. అంత పెద్దింటిలోనూ రాత్రి ఇద్దరమే పడుకునేవాళ్లం- నేనూ, మా నౌకరు. ఒంటరిగా వుండే అలవాటు తప్పిపోవడంచేత రాత్రిళ్లు ఎంతకూ నిద్రపట్టేదిగాదు. ఏమాత్రం శబ్దం వినిపించినా ఇంట్లోకెవరో వచ్చినట్టుండేది. ఓనాటిరాత్రి విసుగూ విరామం లేకుండా టెలిఫోన్ మోగసాగింది. ఆత్మీయులెవరో ఆపదలో చిక్కుకున్నారేమో! అనిపించింది. లేకుంటే అంతర్రాత్రపుడు చేయవలసిన పనిలేదు. మంచం మీది నుండి ఒక్కదూకున వెళ్లి రిసీవరు అందుకుని "హలో!...." అన్నాను.

నూతిలో గొంతులా ఓ కంఠం "మీరు మిస్టర్ రాయేనా?" అంది ఆంగ్లంలో.

"అవును. నేనే!"

"ఎస్.డీ?"

"అవును, ఎవరు కావాలి?"

"మీరే!"

కంఠస్వరాన్ని బట్టీ వుచ్చారణను బట్టీ ఆమె ఎవరో ఆంగ్ల వనిత అనుకున్నాను.

"మీరెవరు?"

"గుర్తు పట్టలేదా?"

# మిత్ర చతుష్టయం

"లేదు"

"విదేశీ ఏనీ!"

జవాబు వినేసరికి గతమంతా కళ్ల ముందు తిరగ సాగింది. ఏనీ నా ముందు నిలబడినట్టయింది.

"ఓ బాగా గుర్తుంది. గోర్డన్ స్క్వేర్ భవనంలో నీలాంటి అందమయిన పనిపిల్ల దేశ దేశాల్లోనూ నాకు తారసపడలేదు."

"అందాల రాసినని తెలుసు. నీ కళ్లబడినట్టు మాత్రం తెలీదు."

"ఎలా తెలుస్తుంది? ఎలా కంటబడిందీ చెబితే అంత మర్యాదగా వుండదేమో!"

"చూశానని ఎలా చెప్పగలరు? రోజూ మీ సిటింగ్ రూం అరగంట సర్దేదాన్ని. ఎప్పుడూ న్యూస్ పేపర్లో ముఖం దాచుకునేవారు! లేదా తలొంచుకుని గోళ్లు గిల్లుకుంటూ కూర్చునేవారు. నన్నెప్పుడైనా కన్నెత్తి చూశారా?"

"ఆ మాట నిజమే, కన్నెత్తి తనివి తీరా చూస్తే ఏం మర్యాదగా వుంటుంది? అందుకనే దొంగ చూపులు చూసే వాణ్ని. అంతలోనే నీ ముఖం కందిర్నలా అయేది. పనిలో మునిగిపోయేదానివి. భయంతో కుచించుకుపోయేదానివనుకున్నాను."

"భయం వల్ల కాదు. సిగ్గు పడి...."

"సిగ్గెందుకు?"

"నా మనసుని చదివిపారేస్తారేమోనని. నలుగురికీ తెలిస్తే ఆ ఇంట్లో పనికి తిలోదకాలివ్వాల్సి వస్తుంది. రోజూ మిమ్మల్ని చూసే అవకాశం వుండదు. ఆ భయంతో నిస్సహాయురాలిగా వుండిపోయాను."

"నాకోసమేం జేశావ్?"

"చివరి సంవత్సరంలో మీకేమయినా అసౌకర్యం కలిగిందా?"

"లేదు."

"కారణం తెలుసా? మనసు లగ్నంచేసి మీ సేవ చేశాను."

"ఎందుకు?"

"మీకోసం మీరేమి చెయ్యరు. చేసే అవకాశం ఇతరులకూ ఇవ్వరు."

"నాగురించి ఇంత చేశానని నాకు నిజంగా తెలీదు. వచ్చేముందు మిసెస్ స్మితకు మాత్రమే ధన్యవాదాలు చెప్పాను."

"నేను ధన్యవాదాలు కోరలేదు. పనిపిల్లకు అవెలాగూ వుండవ్!"

"దాసీలు మాత్రం మనుషులుగాదా?"

"దాసీలకు మాత్రం తెలుసు వాళ్లూ మనుషులేనని. కాని పెద్దమనుషులే మరచిపోతూంటారు."

ఆమె చెప్పింది నిజంగా పచ్చి నిజం, జవాబేమి ఇవ్వలేకపోయాను.

"ఓ రోజు మీ టిఫిన్ పోగొట్టానని తిట్టారు. జ్ఞాపకముందా? మిసెస్ స్మిత్ దాన్ని తస్కరించారనే నగ్నసత్యం తర్వాత వెల్లడయిందనుకోండి."

"అసంభవం! మిసెస్ స్మిత్ నన్ను తల్లిలా చూసేది. వచ్చే రోజు కళ్ల నీళ్లు పెట్టుకుంది కూడాను!"

"ఓ అదా! ఆర్థిక కారణాలవల్ల! రూపాయి వస్తువిచ్చి మీ వద్ద రెండు గుంజేది."

"ఇన్నాళ్లూ నేను కనిపెట్టనే లేకపోయాను!"

"ఎలా కనిపెట్ట గలుగుతారు? మీ కళ్లు మీలోనే వుండిపోయేవి. దూరం పోయేవిగావు. అది ప్రస్తుతం అప్రస్తుతం అనుకోండి. నేను మాత్రం మీకు చెప్పకుండా ఓ వస్తువు తీసేదాన్ని. పుస్తకం చదివి మళ్లీ పెట్టేసేదాన్ని."

"నువ్ చదవగలవన్నమాట!"

"మేమంతా బోర్డు స్కూల్లో చదువుకున్నాం. ఎందుకు చదివేదాన్నో తెలుసా? భగవంతుడిచ్చిన అందానికి బుద్ధి మెరుగులు దిద్దడానికి."

"నీవంటి శుభ్రమయిన పనిపిల్లను దేశదేశాల్లో చూడలేదని అందుకే అన్నాను"

"శుభ్రంగా ఎందుకుండేదాన్నో తెలుసా? మిమ్మల్ని ఆకర్షించడానికి. పుస్తకాలెందుకు చదివేదాన్నో తెలుసా? మీ సంభాషణలు అర్థం చేసుకోగలగడానికి."

"నీతో సంభాషణే జరపలేదే!"

"నాతో కాదనుకోండి. భోజనం చేసేటప్పుడు మిత్రులతో మాటాడేవారుకదా! మీ సంభాషణ నాకెంత ముద్దొచ్చేదో! గ్రంథాల్లో ఇంగ్లీషు మాటాడేవారు కదూ! ఆ ఇంగ్లీషు అర్థం కావడానికి పుస్తకాలు చదివేదాన్ని."

"ఏం పుస్తకాలు చదివేదానివి?"

"ప్రేమ గ్రంథాలు. అది నా భవిష్యత్తుకెంతో తోడ్పడిందనుకోండి."

"అలాగా! చాలా సంతోషం"

"మొదట్లో కష్టంగా వుండేది."

"ఎందుకు?"

"వీడ్కోలు సమయంలో మిసెస్ స్మిత్‌తో ఏడాదిలోగా తిరిగొస్తానన్నారు. నిజమేననుకున్నాను.

"మిసెస్ స్మిత్‌ను వూరడించడానికి అలా అన్నాను. చిన్నపిల్లలా నిజమని నమ్మావా?"

"నా మనసు నన్ను ఎదక్కుండా బంధించింది. మీ రెళ్లిన మర్నాడే నేనూ పని మానేశాను."

"నోటీసివ్వకుండానే మిసెస్ స్మిత్ నిన్ను తొలగించిందా?"

"లేదు నోటీసివ్వకుండానే నేనే పని మానేశాను. ఆశ్మశానంలో ఒక్కరోజుకూడా వుండలేకపోయాను."

"ఆఁ తరవాత......?"

"ఆ తరువాతేముంటుంది? ఈ ఇంట్లో ఆ ఇంట్లో పనిచేస్తూ చాలాసార్లు మారాను. పెద్ద మనుషుల పెద్దరికం మాటున ఎంత కుత్సితం వుంటుందో తెలిసొచ్చింది. అందం, యవ్వనం, దరిద్రం అన్నీవున్నా అన్నిటినీ ఎదుర్కొంటూ వచ్చాను. ఎలానో తెలుసా?"

"క్రాస్ సహాయంవల్ల!"

"నా కది క్రాసే ననుకోండి. ఇతరుల దృష్టిలో మాత్రం క్రాస్‌కాదు. వెళ్లేముందు నాకో గినీ బక్షీస్‌గా ఇచ్చారు. జ్ఞాపకముందా? దానికి నల్లని దారంకట్టి మెళ్లో వేసుకున్నాను. బయటకు కన్పించేది స్వర్ణ ముద్రయినా, దానిలోపల మీ ప్రణయముద్ర దాగివుండేది."

"తరవాత.....?"

"మీ రెళ్లిన పది మాసాల తరవాత ఆస్పత్రిలో చేరాను"

"ఏమయ్యింది?"

"టి.బి."

"చాలా భయంకర వ్యాధి!"

"ఐనా హాయిగా వుండేది. మొదటి దశలో మృత్యువు జయించలేదు. ప్రాణం రోజు రోజుకీ క్షీణించి చిక్కి, శల్యమై అనంతమయిన అంధకారంలో కలిసి పోతుంది, ఎంతహాయి! అంతా కలలు! కలలే."

"ఎలాంటి కలలు?"

"మీ గురించిన కలలు. మీరే క్షణంలోనయినా ఆస్పత్రికి వస్తారని అనిపించేది. క్షయతోపాటు మనుషుల మీద ఆశకూడా పెరుగుతుంది. మీకు తెలుసుకదా! వస్తే ఎంత ఆనందించేదాన్నో!"

"నీ పాలిపోయిన ముఖం చూసి సంతోషించే వాడినా?"

"తప్పకుండా. ఇటాలియన్ చిత్రకారుని చిత్రాలన్నీ మీ గదిలో అలంకరించేవారు! అతని పేరేమిటో మరచిపోయాను.

"బొట్టిసెల్లి.

"ఔనౌను. మీరొచ్చి చూస్తే సరిగ్గా నా ముఖం అతని చిత్రాల్లాగానే వుండేది. సన్నని కాళ్లూ చేతులూ; పల్చని ముఖమూ; వెడల్పాటి కళ్లూ అచ్చం అలాగే వుండేవి."

"ఎన్నాళ్ళున్నావ్! ఆస్పత్రిలో?"

"ఎక్కువ రోజుల్లేను. పెద్ద పెద్ద వైద్యులంతా టి.బి: కాదని నిర్ధారణ చేశారు. ఉపవాసాలూ, చలివల్ల శరీరాదార్ఢ్యం సన్నగిల్లిందని కనిపెట్టారు. డాక్టరు దయతో మూడుమాసాల్లో ఆస్పత్రి వదిలాను."

"తరవాత.....?"

"ఆస్పత్రినుండి విముక్తి లభించింది. కాని శారీరక రోగం కుదిర్చిన వైద్యుని నుండి మాత్రంకాదు, నా కథంతా విని డాక్టరు నన్ను నర్సుగా మార్చాడు. ఆయన పట్ల నా కృతజ్ఞతను మాటల్లో వర్ణించలేను. నేను నర్సుగా మారడానికి ఓ బలమయిన కారణం లేకపోలేదు."

"ఏమిటా కారణం?"

"నర్సుగా మారితే కలకత్తా వెళ్లవచ్చుని, మిమ్మల్ని చూడగలుగుతాననీ, మీకు సుస్తీ చేస్తే నర్సుగా సేవజేసే భాగ్యం కలుగుతుందనీ."

"నాకు సుస్తీ ఎందుకు కలగాలి?"

"మీ దేశం ఒక అనారోగ్య దేశమని విన్నాను.

"అయితే నిజంగా నర్సయ్యావా?"

"అయ్యాను. అప్పుడమేగాదు. నన్ను నర్సుగా చేసిన డాక్టరు తనని పెళ్ళాడమని ప్రాధేయపడ్డాడు. కృతజ్ఞతతో నా సర్వస్వం ఆయనకు సమర్పించాను."

"నీ వివాహ జీవితం సుఖంగా సాగుతోందా?"

"లోకం దృష్టిలో అవకాశమున్నంత వరకు! ఆయన నా పట్ల లవలేశమయినా అనాదరణ చూపలేదు"

"మరి నువ్వో?!"

"నేనూ ఆయన్ను క్షణం కూడా బాధించలేదని నా నమ్మకం."

"ఐనా నన్ను మరచిపోలేదా?"

"లేదు. ఆ మాట చెప్పడానికే ఈ రోజు మీ వద్దకొచ్చాను."

"అంటే నీ భర్తనూ, నన్నూ ఇద్దర్నీ ప్రేమిస్తున్నావా?"

"సందేహం లేకుండా."

"నా కర్థం గాకుండా వుంది."

"ఎలా అర్థమవుతుంది? మీ జోట్నిసెల్ని చిత్రం జర్మన్ బాంబుదాడిలో ఛిన్నాభిన్నమైపోయింది."

"ఎక్కణ్నుంచి మాటాడుతున్నావ్?"

"పరలోకం నుంచి"

భయంతో ఫోను వదిలి ఇవతలకొచ్చేశాను. అజ్ఞానంలా ముంచుకొచ్చిన నిద్రలో సర్వస్వం మరచిపోయాను. మరునాడుదయం పదింటికి లేచాను.

కథనం ఆపి పరికించి చూడగా మిత్రలంతా పసిపిల్లల్లా నోరు వెళ్ళబెట్టి చూస్తున్నారు. ఒక్కరూ ఊం కొట్టడంలేదు.

హఠాత్తుగా శీతేశ్‌లేచి నిశ్శబ్దాన్ని చీలుస్తూ "రాయ్! నువ్వు పెద్ద రచయితవే కావొచ్చు. కాని ఇలాంటి కథల్ని మాత్రం పత్రికల్లో ప్రచురించకు. నలుగురిలో తలెత్తుకు తిరగలేను!" అన్నాడు.

"ఆ ప్రలోభాన్ని మాత్రం దాచుకోలేను." అన్నాను.

"నాకేం అభ్యంతరంలేదు." నేను చెప్పిందంతా నిజమే. జనం మాత్రం నమ్మరు." అన్నాడు సేన్.

"నాకూ ఏం అభ్యంతరంలేదు. ఎందుకంటే నేను చెప్పిందంతా కల్పితం. విన్నవాళ్ళు మాత్రం నిజమని నమ్ముతారు." అన్నాడు సోమ్‌నాథ్.

"సరిసరి! నేం జెప్పింది నిజంగా జరిగిందో, కలో తెలీదు. అందుకే ఈ కథలన్నీ రాసి ప్రచురిస్తా"నంటాను అన్నాను.

"మీ మాటలకేంలే? మీరంతా కవులు, సాహితీపరులు, తత్వవేత్తలు. నేనో మామూలు మనిషిని. నేను చెప్పేది మాత్రం పాఠకులు నమ్మితీరుతారు." అన్నాడు శీతేశ్.

"అయితే నువ్వు సిగ్గుపడవలసిన అవసరంలేదే?" అన్నాను.

"భలేవాడివే! నలుగురూ నాలానే అనుకున్నా పైకి మాత్రం ఛస్తే ఒప్పుకోరు. అంతా దుమ్మెత్తి మాత్రం పోస్తారు" అన్నాడు శీతేశ్.

దాన్ని సోమ్‌నాథ్ అందుకొని "రాయ్! అయితే ఓ పని చెయ్! శీతేశ్ కథనం నాదిగానూ, నా కథనం శీతేశ్ పేరా రాసి పడేయ్!" అన్నాడు.

ఈ ప్రస్తావనతో శీతేశ్ భయపడుతూ "వొద్దు, బాబోయ్ వొద్దు. నా కథనం నా పేరే వుండనివ్వండి. మహా ఐతే విన్నవాళ్ళు నలుగురూ నాలుగు అక్షింతలు వేస్తారు. సోమ్‌నాథ్ పాపం నా కంటగడితే మాత్రం ఇల్లూ వాకిలీ వదిలి సన్యాసుల్లో చేరిపోవాలి" అన్నాడు.

దాంతో కథ కంచికి చేరిందో లేదో గాని మేం మాత్రం ఎవరి గూటికి వాళ్ళం చేరుకున్నాం!

**(అయిపోయింది)**



## కుమారి ప్రియలక్ష్మి కూచిపూడి నాట్యరంగ ప్రవేశం

కుమారి ప్రియలక్ష్మి శ్రీ వరాహగిరి ప్రభాకరరావు గారి కుమార్తె. నాట్య ప్రవీణ శ్రీమతి కె. సూర్యశ్రీ వద్ద ఈమె కూచిపూడి నృత్యాన్ని అభ్యసించింది. కుమారి ప్రియలక్ష్మి కూచిపూడి నాట్యరంగ ప్రవేశం (అరంగేట్రం) మదరాసులోని రాణీ సీతై హాలులో జూన్ 20వ తేదీన వివిధ రంగాలకి చెందిన ప్రముఖుల సమక్షంలో జరిగింది.

ఆ ప్రదర్శనని చూసిన వారందరూ కుమారి ప్రియలక్ష్మి నృత్యాన్ని ప్రశంసించారు. ఆకర్షణీయమైన ముఖారవిందం కలిగి, అతి సున్నితమైన హావభావాలని సైతం సునాయాసంగా ప్రదర్శించిన కుమారి, ప్రియలక్ష్మికి కూచిపూడి నాట్యరంగంలో ఉజ్వల భవిష్యత్తు ఉన్నది.




సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

(గత సంచిక తరువాయి)

వారం రోజుల్నుంచి ప్రభాకర్ కంపెనీకి వెళ్ళటం లేదు.

అసలు ఇల్లు కదిలి బయటికి పోవటం లేదు. ఇంట్లోనే వుండి పూర్తి బెడ్ రెస్ట్ తీసుకొంటున్నాడు. పిల్లలిద్దర్ని దగ్గర కూర్చొపెట్టుకుని రోజంతా వాళ్ళతో కాలక్షేపం చేస్తున్నాడు.

ఏదో ఒక టైమ్‌లో నిత్యం అతని ఫ్రెండ్ డా ఆనంద్ వచ్చి అతన్ని పరీక్ష చేసి కాస్సేపు కాలక్షేపం చేసి వెడుతున్నాడు

రోజూ ఫ్యాక్టరీ నుంచి ప్రభాకర్ పి ఎ వచ్చి మాట్లాడి వెడుతున్నాడు.

వూపిరి తీసుకుందుకు కూడా వీలు లేనంత బిజీగా ఆదివారాలు కూడా హడావుడిగా వుండే భర్త ఎందుకు ఇంట్లో వుండిపొయ్యాడు అతని అనారోగ్యం ఏమిటో సీతకి మొదటి రోజు అర్థం కాలేదు

అడుగుదామనిపించినా మళ్ళీ ఆ ప్రయత్నం విరమించుకుంది

కాని రెండు రోజుల తర్వాత తెల్సింది. భర్త ఫామిలీ ప్లానింగ్ చేశాడని!

ఆమెకి "నవ్వు" వచ్చింది

నేను మాత్రం పది మంది కావాలని కోరుకున్నానా" అనుకుంది నిర్లిప్తంగా

వారం రోజుల రెస్ట్ తర్వాత అతను యథా ప్రకారం కంపెనీకి వెళ్ళటం మొదలుపెట్టాడు.

రోజులు నిశ్శబ్దంగా దొర్లిపోతున్నాయి

ఈ మధ్య ప్రభాకర్‌కి, సీతకి ఎక్కువగా మాటలు లేవు

ఇద్దరి మధ్య కనిపించని గోడలు లేచాయి ముక్తసరిగా మాట్లాడుకుంటున్నారు

సీత పట్ల ప్రభాకర్ ప్రవర్తన చాలా ఉదాసీనంగా వుంటోంది. ఆమె సీత పడటం కూడా ఇష్టం లేనంత ముభావకంగా ప్రవర్తిస్తున్నాడు.

అందుకు కారణం ఏమిటో సీతకి తెల్సు.

అయినా నిస్సహాయురాలు

తన ఒడి పండాలన్నదే ఆమె ప్రగాఢ వాంఛ!

ప్రభాకర్ కూడా ఎన్నోసార్లు తనలో తనే తర్కించుకున్నాడు

ఆమె పట్ల తన ప్రవర్తన గురించి అతనికి పశ్చాత్తాపం లాంటి భావం ఏదో కలగకపోలేదు

అయినా .. ఎందుకో.. ఎంత సరిపెట్టుకున్నా మనసు సమాధాన పడటం లేదు.

ఏవో శంకలు... అనుమానాలు. ఎంత ప్రయత్నించినా మనసుని పట్టి పీడిస్తున్నాయి. వాటిని తుడిచెయ్యటం అతని శక్యం కావటం లేదు

"రేపు సీతకి బిడ్డ పుడితే తన పిల్లల్ని ఇప్పుడు చూస్తున్నంత ప్రేమగా చూస్తుందా? ఎంతైనా ప్రతి మనిషికి "నా" అన్న స్వార్థం వుంటుంది కదా? సీత మారిపోతుందేమో?"

ప్రభాకర్ మనసుని ఇవే ఆలోచనలు పురుగులా తినసాగాయి

"మీ అన్న మీద నాకు ప్రేమ లేదు" అంది సీత

కాని-

డబ్బంటే ఎవరికి చేదు?

పుట్టకుండానే ఆమెకి కొడుకంటే తగని ప్రేమ! ఆ ప్రేమతోనే వాడి సుఖం కోసం ఎంతకైనా తెగించవచ్చు కదా? అన్న కోసం, స్వార్థంతో సవితి తల్లులు భర్త మొదటి భార్య సంతానాన్ని పరమ కిరాతకంగా విషం పెట్టి చంపేసిన కథలు, నీళ్ళల్లోకి తోసేసిన కథలు, ఎత్తయిన ప్రదేశాల మించి పడదోసిన గాథలు ఎన్ని లేవు? పైగా అన్న వాళ్ళకే రాణాని నోరు జారాడు కూడా ఆ కక్షంతా మనసులో పెట్టుకుని.. సీత "

మళ్ళీ అంతలోనే అతనికి ఇంకొక ఆలోచన కూడా వస్తుంది

"ఎంతో మంచితనంగా.. నెమ్మదిగా వుంటుంది. ఆమెలో కాగడా వేసి వెతికినా కపటం కనిపించదు మరి అంత దుర్మార్గంగా ప్రవర్తిస్తుందా ఆమె! తనవన్ని అనవసరపు భయాలు. " అనుకునేవాడు

మంచి- చెడు.

ప్రేమ- ద్వేషం

నమ్మకం- అపనమ్మకం.

సీత గురించి ఎటూ ఒక నిర్ణయానికి రాలేకపోతున్నాడు అన్ని భావాలూ కలగలపుగా అతడి గుండెల్లో చేరి వూపిరి ఆడనివ్వకుండా వుక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.

ఒంటరిగా వుంటే ఇవే ఆలోచన్లు ఉన్మత్తుడిలా అయిపోతున్నాడు.

సీతకి నెల్లు వస్తున్న కొద్దీ అతనిలో భయాలు మరీ ఎక్కువ కాసాగాయి

టూర్ వెళ్ళినా, ఆఫీసులో వున్నా, మనసుకి స్థిమితం చిక్కటం లేదు.

జరిగిన కథ-17 : సీత గర్భవతి అయింది. ఆ విషయం కూతురు మంజు ద్వారా తెలుసుకున్న ప్రభాకర్‌కి పట్టరాని ఆగ్రహం వచ్చింది. సీత తనని తల్లిని కావద్దని శాసించే అధికారం ప్రభాకర్‌కి లేదని, తనకంటూ ఒక బిడ్డ ఉండాలని అంటుంది. ప్రభాకర్ డా. ఆనంద్‌ను కలుసుకోవడానికి కారులో బయలుదేరాడు. అతనికి తను సంధ్యతో గడిపిన జీవితం అంతా జ్ఞప్తికి వస్తుంది

ధ్యాసంతా ఇంటి మీదే!

.........

"ఇంటి దగ్గర పిల్లలు ఎలా వున్నారో?

తన మీద కోపంతో అక్కసుతో సీత పిల్లల్ని నిర్లక్ష్యం చేస్తుందేమో?

నెల్లు నిండిన సీత ఓపిక లేక పిల్లల్ని సరిగా చూడకపోవచ్చు. నిర్లక్ష్యం చెయ్యచ్చు... లేదా మంచంలో పడి నిద్ర పోతుందేమో? ప్రెగ్నెంట్‌గా వున్నప్పుడు సంధ్య అస్తమానం తెగ నిద్ర పోయేది."

ఇటువంటి భయాందోళనలో ఇంటికి వచ్చేవాడు.

కాని గుమ్మంలో అడుగు పెట్టగానే పొంగుతున్న పాల మీద నీళ్ళు చల్లినట్లు ఆతని ఆవేశం అంతా చప్పగా అణిగిపొయ్యేది.

సీత ఎప్పటిలాగానే పిల్లల్ని ముస్తాబు చేస్తూనో, అన్నం తినిపిస్తూనో... కథలు చెప్పి లాలిస్తూనో... కనిపించేది.

ఆమె నెలలు నిండి భారంగావున్నా బాబు హరి ఎత్తుకోమని మారాం చేస్తే, విసుక్కోకుండా వాడ్ని అలాగే భుజాన ఎత్తుకుని ఒంటి చేత్తో అలసటగా పన్లు చేసుకోవటం చూస్తుంటే ప్రభాకర్ మనసు ప్రశాంతంగా, ఆహ్లాదంగా అయ్యేది.

అప్పటి వరకు మనసులో పడ్డ నరక యాతన అంతా చిటికెలో మర్చిపొయ్యేవాడు.

సీతని నమిలి మింగెయ్యాలి అన్నంత ఆవేశం అంతా అణిగిపోయి ఆమె అంటే ఎనలేని అభిమానం ఏర్పడేది.

తమ ఇద్దరి మధ్యా ఎన్ని మనస్పర్థలు, వాగ్వివాదాలు వున్నా పిల్లల విషయంలో ఎలాంటి పొరపాట్లు రానిచ్చేది కాదు సీత-

అందుకే ప్రభాకర్‌కి సీతని వేలెత్తి చూపటానికి కూడా అవకాశం చిక్క లేదు.

*　　　*　　　*　　　*　　　*

ఒకసారి-

ప్రభాకర్‌కి ఏదో అర్జంటు ఫైలు కావాల్సి వచ్చి వేళగాని వేళ మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో ఇంటికి వచ్చాడు.

కారు సర్వీసింగ్‌కి ఇవ్వటం వల్ల ఆటోలో వచ్చాడు.

రంగా గార్డెన్‌లో గులాబి కొమ్మలు కత్తిరిస్తున్నాడు.

ప్రభాకర్ లోపలికి వచ్చి గబగబా తన గదిలోకి వెళ్ళబోయినవాడల్లా సీత గదిలోంచి బాబు గొంతు వినపడటంతో ఒక్క క్షణం గడప దగ్గరే ఆగిపోయాడు. శబ్దం కాకుండా ప్రక్క కిటికీ పరదా చాటు నుంచి లోపలికి తొంగి చూశాడు....

సీత క్రింద చాప వేసుకుని దిండు మీద తల పెట్టుకుని పడుకుంది. హరిబాబు ఆమె మీద అడ్డంగా పడి మునుపటిలాగా ఒళ్ళంతా ఎక్కి తొక్కుతున్నాడు.



## జీవితం చేజారిందా

సీత పొట్టకి వాడి కాళ్ళు తగలకుండా చేతులు అడ్డం పెట్టుకుని వాడ్ని తొక్కొద్దని శత విధాలా వారిస్తోంది.

"ఒరేయ్... బాబు... నన్ను అలా తన్నకురా... నాకు నొప్పెడుతుంది... నా బంగారు కొండగా... ఇలా దా... కాస్సేపు పడుకో..." అని బ్రతిమాలుతూంది, చేతులు సాచి పిలుస్తూంది.

కాని బాబు అల్లరి మానటం లేదు. చెప్పిన మాట వినటం లేదు. ఇంక లాభం లేదని సీత భారగా లేచి చిన్నగా విసుక్కుంటూ దిండు తీసి గోడకి వేసి దాన్ని అనుకుని కూర్చుంది.

నడుం మీద చెయ్యి వేసుకుని రాసుకుంటూ మరో చేత్తో బాబుని పట్టుకొని-

"ఒరే... హరి... కాస్సేపు నన్ను విశ్రాంతిగా పడుకోనియ్యవు కదా? అల్లరి కన్నా... నీకు నిద్దర రాదట్రా అసలు.. వుండు నిన్ను పిల్లికి పట్టిస్తాను... అదిగో... పిల్లి ఇలా రా... మ్యావ్..." అని బెదిరించింది.

కాని హరిబాబుకి అదేమి పట్టినట్టు లేదు.

వాడి ధోరణిలో లోల్లిగా అల్లరి చేస్తూ... ఆమె జుట్టు పట్టి పీకుతూ, చిట్టి చిట్టి చేతులతో పిన్ని... పిన్ని... అంటూ సీతని కాళ్ళతో తన్నుతున్నాడు. చిట్టి చిట్టి చేతులతో అల్లరిగా కొడుతున్నాడు

చాటుగా వుండి అదంతా చూస్తున్న ప్రభాకర్ పెదవులపై సన్నటి చిరునవ్వు విరిసింది.

మనసు దూదిపింజలా అయ్యింది.

ఇది ఒక్కటే కాదు ... అలాంటి దృశ్యాలు ఎన్నో అతడి కంట పడి స్వాంతన పరిచాయి. మండే మనసుని మంచి గంధం పూతలా అతడ్ని వూరడించాయి.

ఎందుకో... అలాంటి క్షణాల్లో "సీత ప్రేమలో కపటం లేదు" అనిపించేది. ఆమెపై అవ్యాజను రాగం కలిగేది.

"కాని ఇదే ప్రేమ ముందు ముందు వుంటుందా?" అన్నదే అతని సందేహం!

* * * *

"కాలం" ఎలాంటి గాయాల్ని మాన్పే మందులా నిశ్శబ్దంగా సాగిపోతూంది.

సీతకి నెల్లు నిండుతున్నాయి. కొంచెం నీరసం, అలసట తప్పించి శారీరకంగా ఆమెకి ఎలాంటి అనారోగ్యం లేదు.

ఇంటి పన్లు విషయంలో గాని, ఎల్లల పోషణ విషయంలో గాని ఏ చిన్న లోపం రావటం లేదు. అంతా ఇంతకు ముందు లాగానే యధావిధిగా టైము ప్రకారం జరిగిపోతున్నాయి.

ఆ రోజు .... భార్యాభర్తలిద్దరి మధ్య వాగ్వివాదం జరిగిన తరువాత ఇద్దరి మధ్య కాస్త సన్నిహిత తత్వం మునుపటి ఆప్యాయత సన్నగిల్లింది.

తప్పనిసరి అయితేనే ఒకరితో ఒకరు మాట్లాడుకుంటున్నారు.

మిగతా సమయాల్లో ముభావకంగా ఎవరి దారిన వాళ్ళు వుంటున్నారు.

వాళ్ళు అవటానికి భార్యాభర్తలే అయినా, ఒకే ఇంటి కప్పు కింద బ్రతుకుతున్నా ఇద్దరి మధ్య కనిపించని చీకట్లు....

ప్రభాకర్ స్వతహాగా దుడుకు స్వభావి. కాస్త కోపిష్ఠి. పైగా అతనికి ఇష్టం లేనిది ఏదన్నా జరిగితే బాగా "మూడి"గ మారిపోతాడు.

ఒక్కగానొక్క కొడుకు కావటంతో చిన్నప్పట్నుంచి అతడు ఆడింది ఆటగా పాడింది పాటగా సాగింది. పెద్దయి అతనికి పిల్లలు పుట్టినా అతని వ్యక్తిత్వం మారలేదు.

సీతకి కూడా ఎందుకో ఈ మధ్య మనసు విరిగినట్లు అయ్యింది. చాలా విషయాల్లో నిర్లిప్తంగా వుండిపోతూంది.

భర్త .... పిల్లలు ... సంసారం ... అని తను తాపత్రయ పడటమే గాని అతనికి విసం ఎత్తు కూడా తనపై మమకారం లేదు.

ఎప్పుడూ "నేనూ ... నా పిల్లలు!" ఇదే మాట.

ఇవాళ కాకపోతే రేపయినా అతని మనస్తత్వంలో మార్పు వస్తుందేమో ... తనని హృదయపూర్వకంగా ఆదరిస్తాడేమో అని ఎదురు చూసింది. కాని ఆమెకి నిరాశే ఎదురయ్యింది. ఇప్పుడు సీత ఆశలన్ని "రేపు" మీదే! కలలన్నీ ....తనకి పుట్టబోయే ఆ పసికందు మీదే!

"చీకటి నిండిన తన జీవితంలో వాడు జీవనజ్యోతి. ఈ లోకంలో నన్ను నన్నుగా ప్రేమించే ఒక తోడు ...." అనుకుంటుంది ఆశగా.

ఆమె కళ్ళల్లో ఏ కొంచెం అయినా వెలుగు వుందంటే .... దానికి కారణం బిడ్డ.

సీతకి నెల జరిగినప్పట్నుంచి గర్భిణి స్త్రీలు తీసుకోవల్సిన జాగ్రత్తలు ఏవి తీసుకోలేదు. అసలు ఒక్కసారి కూడా డాక్టర్ని సంప్రదించలేదు.

కాని ఇంట్లోనే తన పరిధి మేరకు జాగ్రత్త పడి తన ఆరోగ్య విషయంలో శ్రద్ధ తీసుకుంది. సాధ్యమైనంత వరకు పిల్లలతో సరదాగా గడపటానికి ప్రయత్నించెది.

రోజూ అశ్రద్ధ చెయ్యకుండా భోజనంలో మంచి ఆహారం వడ్డించుకొని కడుపు నిండా తినేది.

నిత్యం పిల్లలతో పాటు తను కూడా విధిగా ఓ గ్లాసు హార్లిక్స్, పళ్ళరసం టైము ప్రకారం తీసుకునేది. విటమిన్ టాబ్లెట్లు తినేది. మధ్యాహ్నం టీ సమయంలో పళ్ళు బటర్ రాసిన బ్రెడ్ స్లైసెస్ తీసుకొనేది.

ఇదివరకులా మనసు బాగోకపోతే అభోజనంగా వుండటం లేదు... ఏదో ... లాంఛనంగా తిన్నాను అనిపించుకోవటం చేసేది కాదు.

తన కొడుకు మంచి ఆరోగ్యంలో అందంగా వుండాలి. అంతేగాని తెగుళ్ళ మారిగా ఈసురోమంటు పుట్ట కూడదు!

అందుకే సీత శ్రద్ధగా తనని తను పోషించుకుంది....

సీతకి కూతురు పుట్టటం ఇష్టం లేదు. కొడుకే పుట్టాలన్ని మనసారా కోరుకుంది. ఆస్థి వారసత్వం కోసం మాత్రం కాదు.

ఆడపిల్ల పుడితే ఏముంది? మళ్ళీ కన్నీళ్ళు – కష్టాలు.

తన జీవితమే పునరావృతం అవుతుంది, గాజుబొమ్మ బ్రతుకు.

కాలం మారింది – లోకం మారింది అంటున్నారు. కాని ఏం మారింది?

యుగాలు గడుస్తున్నా అనాదిగా ఆడదాని బ్రతుకు మారలేదు.

ఆమెపై జరిగే అత్యాచారాలు – దౌష్ట్యం అంతరించలేదు.

తన అమ్మమ్మలు నాయనమ్మల కాలంలో స్త్రీ ఎలాంటి సమస్యల్ని – సంఘర్షణల్ని ఎదుర్కొందో.... కాస్త అటు ఇటుగ ఇప్పుడు అలాంటి సమస్యల్నే ఎదుర్కొంటూంది. అయితే అప్పుడు స్త్రీకి చదువు లేదు. కాని ఇప్పుడు చదువుంది. అంతే తేడా!

ఇప్పట్లో ఈ స్త్రీ సమస్యలు అంతరిస్తాయన్న ఆశ కనిపించటం లేదు.

అందుకే –

ఆడపిల్లలంటే మమకారం వున్నా తనకి కూతురు పుట్టటం ఇష్టం లేదు సీతకి.



# గోదావరి

## డి.ఎ.పి.

## దుక్కిలో గాని దమ్ములో గాని వాడండి



## అధికదిగుబడులను పొందండి

మనరైతులు సాధారణంగా వరిపైరుకు దమ్ములోను, మెట్టపైర్లకు విత్తనాలతో పాటు ఎరువు వేస్తారు. వేసిన ఎరువునుంచి మంచి ఫలితము పొందాలంటే వలసినంత నత్రజని, కావలసిన పూర్తి భాస్వరము ఒకేసారి వెయ్యాలి. గోదావరి డి.ఎ.పి.లో పై విధంగా కావలసిన పాళ్ళలో అంటే 18 శాతము నత్రజని, 46 శాతము భాస్వరము ఉన్నాయి. భాస్వరం అధిక శాతంలో ఉండటం వలన పైరు వ్రేళ్ళు బాగా వృద్ధి చెంది పోషకాహారాలు బాగా లభించి కాయలను, గింజలను అధికంగా ఉత్పత్తి చేస్తాయి. గోదావరి డి.ఎ.పి. గుళికల రూపంలో ఉంటుంది. గొర్రుతో ఎదపెట్టడానికి, దమ్ము చేలో చల్లటానికి అనువైనది. ఎరువు గాలిలో కొట్టుకొని పోదు, వృధా కాదు. పైరుకు కావలసిన మిగిలిన నత్రజనిని గోదావరి యూరియా రూపంలో ధఫాలుగా చల్ల వచ్చును.

అందుకే గోదావరి డి.ఎ.పి. ఎరువు కొనండి, దుక్కిలోగాని, దమ్ములోగాని వాడండి. అధిక దిగుబడులు పొందండి. మీ రాబడిని పెంచండి.




**గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్**

వాణినిలయం, 50 సెబాస్టియన్ రోడ్, సికింద్రాబాదు - 500 003.




Priyadarshini

# కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ **మీ**ద పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

## జీవితం చేజారిందా

అదే కొడుకయితే తనకి అన్ని విధాలుగ అండదండలుగా వుంటాడు.

బాగా చదువుకుంటే ముందు ముందు వాడికి మంచి భవిష్యత్తు ఏర్పడుతుంది. తనని ఎవరు ఆదరించినా – ఆదరించకపోయినా వాడికి తను – తనకి వాడు కొండంత బలంగా మిగులుతారు.

కొడుకు పుట్టాలి అనుకోవటంలో సీత కోరిక ఇదే!

సీతకి నెలలు నిండాక పుట్టింటికి వెడతానని భర్తని అడిగింది.

ఎంత గర్భదరిద్రులు అయినా మొదటి కాన్పు పుట్టింట పోసుకోవటమే ఆనవాయితీ.

పురిటికి పుట్టింటికి వెళ్ళాలనిపిస్తోంది. మంచి జరిగినా చెడు జరిగినా తన వాళ్ళ మధ్య వున్నట్లు అవుతుంది అనుకుంది సీత.

ముఖ్యంగా.....

"ప్రభాకర్‌కి తను తల్లి కావటం అస్సలు ఇష్టం లేదు. అతడు తనని, తన బిడ్డని హృదయ పూర్వకంగా ప్రేమించలేడు. తనకి కొడుకుపుడితే అతనికి మరి అశాంతి, తన కొడుకు క్షేమంగా వుంటే కూడా మరి అసూయ చెందవచ్చు. అది తనకి – తన బిడ్డకి క్షేమం కాదు.........."

ఇలా ఆలోచిస్తే సీతకి అక్కడ ఇంకొక్క క్షణం కూడా వుండాలి అనిపించలేదు. పుట్టింటికి వెళ్ళిపోవాలి అనిపించింది.

ప్రభాకర్ తల్లి కూడా కొడుక్కి ఉత్తరం వ్రాసింది. డబ్బిచ్చి కోడల్ని పురిటికి పుట్టింటికి పంపమని. మొదటిసారి అక్కడ పోసుకోవటమే ఆనవాయితీ అని!

కాని ప్రభాకర్ సీతని పంపటానికి ఒప్పుకోలేదు.

"నీ మానాన నువ్వు పుట్టింటికి వెడితే పిల్లల మాట ఏమిటి?"

"నాతో మావూరు పంపండి. తీసుకు వెడతాను. మీరు కొద్దిగా డబ్బు ఇస్తే వాళ్ళకి అక్కడ ఏ లోటూ రాకుండా జరిపిస్తాను" అంది.

అయినా ప్రభాకర్ సమ్మతించలేదు.

"సీతా! నాకు ఇష్టంలేదు. నేను అన్ని రోజులు పిల్లల్ని చూడకుండా వుండలేను" ఖచ్చితమైన స్వరంతో శాసించినట్లు చెప్పాడు.

"చేతులో కారు వుంది. మీకు చూడాలనిపించినప్పుడల్లా వచ్చి చూసి వెళ్ళండి."

"కుదర్దు సీతా! నాకు కంపెనీ వ్యవహారాలు చాలా బిజీగా వుంటాయి."

"అయితే సరే! నేను ఒక్కర్తినే వెడతాను. ఈ రెండు నెల్లు పిల్లల్ని జాగ్రత్తగా చూసుకోండి. లేదంటే మీ అమ్మగార్ని రమ్మని వ్రాయండి. ఈ రెండు నెల్లు ఆవిడ చూసుకుంటారు."

"ఆవిడ రావటం కుదర్దు. నాన్న ఆరోగ్యం మంచిదికాదు."

"అయితే మీరే ఎలాగో మానేజ్ చేసుకోండి. సుబ్బులు వుండనే వుంది కదా?"

చురుక్కున ముల్లు గుచ్చుకున్నట్లు తల ఎత్తాడు ప్రభాకర్.

సీత మాటల్లో ఏదో విపరీతార్థం స్ఫురించింది అతనికి.

(అవును. నేను వూహించిందే నిజం అవుతూంది. అప్పుడే స్వంత బిడ్డ మీద మమకారం ఎక్కువై పోయింది. ఎన్నడూ పెదవి విప్పని సీత ఈనాడు సూటిగా తనకి జవాబు చెప్తూంది. నిన్నటిదాకా తను చెప్పినట్లు ఆమె వినేది. కాని ఈ రోజు తన మాట విననంటూంది. రేపు కొడుకు పుడితే వాడ్ని అండగా పెట్టుకుని తన నుంచి ఆస్తి కాజేసి దూరంగా పోయినా ఆశ్చర్యపడనక్కర్లేదు. ఆస్తి మీద మోజు లేదంది కాని డబ్బు చేదా? డబ్బు ఆశించి కాక రెండో పెళ్ళివాడ్ని ఎందుకు చేసుకున్నట్లు? తన పిల్లలమీద నిజంగా ప్రేమ వుంటే అలా విడిచి వెళ్ళగలదా?)

ప్రభాకర్ తలఎత్తి రెండు నిమిషాలసేపు సూటిగా..... రెప్ప వెయ్యకుండా సీత కేసి చూశాడు.

"సీతా!..... వాళ్ళెప్పుడూ నీ పిల్లలు కాదు..... నీ కేమీ సంబంధంలేదు అనుకుంటే మీ పుట్టింటికి ఈరోజే వెళ్ళు. నీకు ఇష్టం వచ్చినన్ని రోజులు వుండరా.....'

# దేహారోగ్యం




# ధర్మపథం

మనం ఏదైనా రోగంతో బాధపడుతున్నప్పుడు, డాక్టరు వద్దకు పోయి మందు తెచ్చుకుని అనారోగ్యాన్ని పోగొట్టుకొంటాము. శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకొంటే రోగాలు రాకుండా చూచుకోవచ్చు. శరీరం ఆరోగ్యంగా ఉండుటకు ఆరోగ్యకరమైన ఆహారం తీసుకోవడం, ఆ ఆహారం ఆయా వేళలను అతిక్రమించకుండా తీసుకోవడం, మంచి అలవాట్లు, స్నానపానాదులు ఒక పద్ధతి ప్రకారం ఉండడం ఎంతో అవసరం. ఇది స్థూల శరీరానికి సంబంధించినది. ఇది కాక సూక్ష్మ, కారణ శరీరాలు కూడా అందరికీ ఉన్నవి. జ్ఞానేంద్రియాలయిన చక్షురాదులు మున్నగునవి సూక్ష్మ శారీరాలు. ఇంద్రియాలను, ఇంద్రియార్థాల నుంచి మళ్లించడం సామాన్యులకు సాధ్యం కాదు. అయినా అవి ఆరోగ్యకరాలయిన వానిపట్లనే ఉపయోగించడం సాధ్యం కానిదేమీ కాదు. మనం స్పృశించేవి యోగ్యమయినవిగా ఉండడం, చూచేవి ఉత్తమ మయినవిగా ఉండడం, వినేవి మేలయినవిగా ఉండడం, రుచి చూచేవి సముచితమైనవిగా ఉండడం, వాసన చూసేవి మేలుగా ఉండడం అవసరం. స్పృశించేవి అయోగ్యంగానూ, హానికరంగానూ ఉండకూడదు. అసభ్యమైన వానిని, చూడరాని వానిని చూడకూడదు. వినేవి సత్ప్రవర్తనకు దారి చూపేవిగానూ, కర్ణామృతాలుగానూ ఉండాలి. సరియైన వాటినే రుచి చూడాలి. వాసన చూచేటప్పుడు దుర్గంధానికి దూరంగా ఉండాలి. ఇలా ఉన్నప్పుడే ఇంద్రియాలు ఆరోగ్యంగా ఉంటాయి.

కారణ శరీరాలయిన మనోబుద్ధ్యాదుల పట్ల కూడా సరియైన శ్రద్ధ తీసుకొంటేనే వాటికి ఆరోగ్యం సమకూరుతుంది. దురాలోచనలు లేకుండా ఉంటే మనస్సు నిర్మలమై ఆరోగ్యంగా ఉంటుంది. చెడు విషయాల మీద బుద్ధిని పోనియ్యకూడదు. అప్పుడే దానికి వికాసం కలుగుతుంది.

ఈ రీతిని వ్యక్తులు కేవలం శరీరారోగ్యాన్నే – అంటే స్థూల శరీరారోగ్యాన్ని మాత్రమే కాక ఇతర దేహాల ఆరోగ్యాన్ని కూడా మిక్కిలి శ్రద్ధతో గమనించ వలసి ఉంటుంది.

–బులుసు వేంకట రమణయ్య

---

ఆ మాటలు వాడిగా సీత గుండెని తాకాయి.

బాణం దెబ్బ తిన్న పిట్టలా ఆమె మనసు గిజగిజ మంది.

గుండె రగిలినట్లయి రోషంతో ఏదో అనాలని దూకుడుగా తల ఎత్తింది.

కాని ఎదురుగా ప్రభాకర్ లేడు.

అప్పటికే బయట అతని కారు శబ్దం వినిపిస్తోంది.

సీత చప్పున పరిగెత్తినట్లు హాలు దాటి డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చింది.

కాని అప్పటికి అతని కారు పోర్టికో దాటి రివ్వున గేట్లోంచి రోడ్డుమిదికి దూసుకుని పోయింది.

గేటు తెరిచిన రంగా తిరిగి గేటు మూస్తున్నాడు.

సీత హతాశురాలు అయ్యింది.

ఆమె శరీరంలోంచి రక్తం అంతా తోడేసినట్లు నిస్తేజంగా అయిపోయింది.

కళ్ళు గిర్రున తిరుగుతున్నట్లయి నిస్సత్తువతో ప్రక్కనే వున్న సోఫాలో కూలబడింది.

"వాళ్ళిద్దరూ నీ పిల్లలు కాదు అనుకుంటే, నీకేమి సంబంధం లేదు అనుకుంటే ఈరోజే మీ పుట్టింటికి వెళ్ళు!"

హుఁ.......

ఒక్కసారిగా ఎంత మాట అన్నాడు?

వాళ్ళిద్దరూ తన పిల్లలు కాదని ఎన్నడైనా అనుకుందా?

ఇనాళ్ళు ప్రేమగా చూసిందంతా గాలికి పోయినట్లేనా?....

ఇంకా వాళ్ళే తనని పరాయిగా చూస్తున్నారు. పైగా తప్పు తనదే అన్నట్లు వ్రేలెత్తి చూపుతున్నారు.....

సీతకి కళ్ళనిండా నీళ్ళు నిండాయి.

మనసంతా కలకబారినట్లు అయ్యింది.

పయిట చెంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ నెమ్మదిగా లేచి లోపలికి వచ్చేసింది.

సూట్‌కేస్‌లో సర్దుకున్న తన బట్టలన్ని తీసి తిరిగి బీరువాలో సర్దేసింది.

ఆమె పుట్టింటి ప్రయాణం ఆగిపోయింది.

ఆమె గట్టిగా వెళ్ళాలని నిర్ణయించుకుంటే ఆపేవాళ్ళు ఎవ్వరూ లేరు.

కాని–

"ఇప్పుడు అతని మాట కాదని వెళ్ళిపోతే ఆయన అనుమానాలన్నింటిని నిజం చేసినట్లే అవుతుంది. ఇంకా సంసారంలో కలతలు ఎక్కువ అవుతాయి" అనుకుంది.

అందుకే పురిటికి పుట్టింటికి వెళ్ళాలన్న ఆలోచన విరమించుకుంది.

తల్లికి వెంటనే బయలుదేరి రమ్మని ఉత్తరం వ్రాసింది.

(ఇంకా ఉంది)

## హైదరాబాద్ నోట్‌బుక్

## తెలుగు అకాడెమి భూతభవిష్యద్వర్తమానాలు :

తెలుగు అకాడెమి కళాశాల స్థాయి పాఠ్యపుస్తకాల ప్రచురణ విషయంలో గణనీయమైన కృషి చేస్తున్నది. జూన్ 30 వ తేదీన కొన్ని పాఠ్య పుస్తకాల ఆవిష్కరణ సందర్భంలో జరిగిన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో విద్యామంత్రి శ్రీ ముద్దు కృష్ణమనాయుడు ముచ్చటిస్తూ, తక్కిన అకాడెమీలను తెలుగు విశ్వవిద్యాలయంలో లీనం చేసినట్లు తెలుగు అకాడెమిని కూడా ఎందుకు లీనం చేయగూడదు? చేస్తారా? – అని నేనడిగిన ప్రశ్నకుసమాధానంగా ఒకేరకమైన కృషిలో తమ వనరులు, శక్తియుక్తులు పునరావృత్తం కాకుండా తెలుగు అకాడెమిలోని కొన్ని విభాగాలను తెలుగు విశ్వవిద్యాలయంలో లీనం చేసే ప్రతిపాదన ఎంత వరకు సమంజసమో, నిర్ణయించవలసిందిగా ఒక సంఘాన్ని నియమించినట్లు తెలిపారు. తెలుగు అకాడెమి 1968 ఆగస్టులో స్థాపితమైంది. ఇక నెలలో మైనారిటీ తీరుతుందన్న మాట. హైదరాబాద్‌లో నెలకొన్న ఇంగ్లీషు, విదేశ భాషా కేంద్రాధ్యయన సంస్థకు సమానమైన ప్రతిపత్తిలో తెలుగు అకాడెమిని రూపొందించి వికసింపజేయాలని ఈ సంస్థ రూపకల్పనకు ప్రత్యేకాధికారిగా నియుక్తులైన శ్రీ జి. పి. ఎల్. గ్విన్ నివేదిక ఆశిస్తున్నది. ఆ నాటి విద్యాశాఖా కార్యదర్శి శ్రీ గ్విన్. తెలుగు అకాడెమి రూపరేఖలు నిర్దేశించిన వారిలో హైదరాబాద్ విశ్వవిద్యాలయం నేటి వైస్ చాన్సలర్ డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి, ఆచార్య పింగళి లక్ష్మీకాంతం వంటి భాషా సాహిత్యవేత్తలున్నారు. అకాడెమి వ్యవస్థాపకాధ్యక్షులు నేటి కేంద్ర మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు, నాటి రాష్ట్ర విద్యాశాఖా మంత్రి • తొలివిడత పాఠ్యపుస్తకాల ఆవిష్కరణ సభలో అప్పటి ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి, శ్రీ పి. వి. నరసింహారావు అకాడెమి భవిష్యత్తు గురించి ఎంతో ఉజ్జ్వలంగా శుభాశంసనలు చేశారు. అప్పటి కేంద్ర విద్యాశాఖామంత్రి డాక్టర్ వి. కె. ఆర్. వి. రావు కూడ ఈ సంస్థ వికాసాన్ని, పటిష్ఠతను గూర్చి ఎంతో ఆశాభావం ప్రకటించారు. ఈ సంస్థ 1969 లో లిపి సంస్కరణను గురించి ఒక సదస్సును ఏర్పాటు చేసింది. దానిలో తెలుగు, కన్నడ లిపుల ఏకీకరణ ఉపసంఘానికి నేను కన్వీనరును. ఈ సంస్థ 1974 లో తెలుగు భాషా సాహిత్యాల ఆధునికీకరణను గురించి, 1975 లో భాషా సారస్వతాల వ్యాప్తిని గురించి ఇతర సంస్థల సహాయ సహకారాలతో సదస్సులు నిర్వహించిన మాట వాస్తవమే. అయితే ఈ 18 సంవత్సరాలలో అకాడెమి సాధించిన ఉత్కృష్ట కృషి, అకాడమి అనే పదానికి సార్థక్యం తెచ్చె విశిష్ట సాఫల్య స్మరణిక కనిపించవు. 18 సంవత్సరాల అస్తిత్వమంటే, ఏమీ తక్కువ వ్యవధి కాదు. ఇంటర్మీడియేటుకు, పట్టభద్ర స్థాయికి అనేక విషయాలలో పాఠ్యగ్రంథ ప్రచురణ చేపట్టి శక్తి సామర్థ్యాలతో నిర్వహించిన మాట వాస్తవమే. అయితే ఈ పాఠ్యగ్రంథాలను గూర్చి అనేక విమర్శలు కూడ వచ్చాయి. ఈ విమర్శలకు అకాడెమి సమాధానం చెప్పే ప్రయత్నం చేయలేదు. వీటిని ఇకముందు ఏ విధంగా నివారిస్తారో కూడ చెప్పలేదు. అభివృద్ధి చెందిన దేశాలలో ప్రజల నుంచి విమర్శ వెలువడగానే ఆ విమర్శను పట్టించుకొని, అందులోని యాథార్థ్యాన్ని సమీక్షిస్తారు. తగిన సంజాయిషీ కూడ ఇస్తారు. పాఠ్యపుస్తకాలను బహుళ సంఖ్యలో ప్రచురించడమే దీని లక్ష్యమైతే, పాఠ్యపుస్తక ప్రచురణ సంస్థలు ఎన్నో వున్నాయి. శ్రీ శ్రీనివాసయ్యంగారు లాంగ్మెన్స్ కంపెనీకి అన్ని విషయాలలోను వందల పుస్తకాలు వ్రాసి ఇచ్చారు. తెలుగు భాషా సారస్వతాల ఆధునీకరణ ప్రధాన ధ్యేయంగా అకాడెమి ప్రభావించినట్లు దీని ఆశయ నిబంధనావళిలో స్పష్టంగా వుట్టంకితమైంది. తెలుగులో ఇంతవరకు ఆధునిక భావాలను, అర్థాలను అర్థచ్ఛాయలను తెలుపగల నిఘంటువు లేదు. పదేళ్ల క్రిందట తెలుగు 'అకాడెమి వారు శబ్దసాగరమనే బృహన్నిఘంటు నిర్మాణానికి పూనుకున్నారు. దాని సలహా సంఘంలో నేను కొంత కాలం సభ్యుణ్ని. ఇంగ్లీషులోని ట్వెంటియత్ సెంచరీ డిక్షనరీ లాగ ఈ శబ్దసాగరం రూపొందాలని నాబోటి వాళ్లు ఆశించారు. ఆ సలహా సంఘానికి తర్వాత కాలం చెల్లింది. ఇటువంటి

మహానిఘంటువును నిర్మించడానికి పూనుకొన్నప్పుడు, సామూహికమైన ప్రయత్నంవుండాలి. రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు, పండితులు, భాషా శాస్త్రజ్ఞులు అందరూ ఈ కృషిలో భాగస్వాములు కావాలి. ముందుగా ఈ

నిఘంటు నిర్మాణ ప్రణాళికను బహిరంగ పరచి ఆసక్తి కల వారి సలహాలు పొందడం కూడ మంచిది. సూర్యారాయాంధ్ర నిఘంటువు నిర్మించే ముందు శ్రీ వేదం వేంకటరాయ శాస్త్రి తెలుగులోను, శ్రీ జయంతి రామయ్య పంతులు ఇంగ్లీషులోను తాము తలపెట్టిన నిఘంటు నిర్మాణ స్వరూప స్వభావాలను కరపత్రాల ద్వారా వెలువరించారు. అంతయినా, సూర్యారాయాంధ్ర నిఘంటువు వర్తమాన వ్యవహారానికి సుమారు అర్ధ శతాబ్ది వెనుకబడి వుంది. వాడుకభాషా పదాలు ఒకటి రెండు శాతంకన్నా లేవని శ్రీ గిడుగు రామమూర్తి పంతులు తీర్పు చెప్పారు. ఇరవయ్యో శతాబ్దం ముగిసి ఇరవయ్యొకటో శతాబ్దంలో అడుగుపెట్టనున్న తరుణంలో ఈ శతాబ్ది తెలుగు నిఘంటువు రూపొందించడానికి చేయవలసిన మహత్తర కృషి విజ్ఞులకు తెలియందికాదు. తెలుగు అకాడమిలో అంగబలం కాని, అర్థబలం కాని దీనికి సరిపడినంతవున్నా, విశ్వ విద్యాలయాల సహాయ్య సహకారాలు చాల అవసరం. ఇది వరలో నిఘంటువు-పనిలో అనుభవం వున్న వారి కృషిని పరిగణించాలి. శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రి వంటి వారు నుడికడవిరూపంలో ఎంతో కృషి చేసినా, వారి కృషి. వెలుగులోకి రాలేదు. శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రి, శ్రీ నిడుదవోలు వెంకటరావు వంటి పెద్దలు వ్యాసాలు, సమీక్షలు, సాహిత్య వివాదాల రూపంలో శబ్దార్థ చర్చ, సాధు పాఠనిర్ణయం విశేషంగా జరిపారు. వారి కృషి శబ్ద సాగరంలో చేరిందో లేదో తెలియదు. ఈ సంస్థ 18 సంవత్సరాల క్రిందటే నెలకొన్నది కాబట్టి నిఘంటు నిర్మాణానికి ఉపకరించగల విలువైన గ్రంథాలయం కూడా ఏర్పడాలి. మంత్రి శ్రీ ముద్దుకృష్ణమ నాయుడు అన్నట్టు అకాడెమిలోని కొన్ని విభాగాలే కాక పూర్తిగా అకాడెమియే తెలుగు విశ్వవిద్యాలయంలో లీనం కావాలి. అంత వరకు పాఠ్య పుస్తకాలనే కాక అదనపు పఠనీయ సామగ్రిని కూడ ఈ సంస్థ ప్రజలకు అందించడం అభిలషణీయం. అప్పుడు విద్యార్థుల భావాభివ్యక్తికి దోహదం జరుగదు. వారు విజ్ఞానవిషయాలు భాషా సాహిత్యాధునిక పరిశోధన ఫలాలు తెలుగులోనే ఎంత ఎక్కువగా చదివితే అంతగా వారి వాగ్విలసనం, లేఖన పాటవం పెరుగుతాయి. గడచిన రెండేళ్లుగా తెలుగు అకాడెమి స్థాయిసంఘం పని చేయడం లేదు. అందరూ ఆరో పిస్తున్నట్టు రద్దుల పట్టీలోకి ఈ స్థాయి సంఘం ఎక్కిందో లేదో గాని, గడువు ముగిసిన స్థాయి సంఘం పునర్నిర్మితం మాత్రం కాలేదు. ఇది నామిత్రులైన స్థాయి సంఘ సభ్యుల వల్ల తెలిసిన సంగతి, తెలుగు దేశంలోని ప్రముఖ విద్యా వేత్తలు, శాస్త్ర వేత్తలు ఈ సంఘంలో సభ్యులుగా నియమితులయ్యేవారు. అకాడెమి ద్వారా విద్యావిషయిక పథకాలు రూపొందింప చేయడం, వాటి నిర్వహణను అజమాయిషి చేయడం ఈ సంఘం పని. ఈ సంఘం ఎందుకు పునరుద్ధృతం కాలేదని నేను మంత్రిగారిని

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd.,*
*by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,*
*Editor: S. Radhakrishna; Phones :- Business : 61247, 61248, Editorial: 75667*



శ్రీ పి. వెంకటస్వామి, శ్రీమతి సరోజ

## ఇద్దరూ ఉద్యోగస్తులైతే!

# కానిస్టేబుల్ దంపతుల కష్టాలు!

"బీద కుటుంబంలో పుట్టడం వల్ల చదువుకోవాలన్న కోరిక ఉన్నా స్థోమత లేక పదవ తరగతితో ఆపేశాను. తల్లిదండ్రులకు భారం కాకూడదని కుట్టుమిషన్ ట్రైనింగ్‌కు వెళ్లాను. అది లాభసాటిగా కనిపించలేదు. ఆడపిల్లలు ఎందుకు ఉద్యోగం చెయ్యకూడదు? అన్న ప్రశ్న నాలో నేను వేసుకున్నాను.

మా నాన్న పోలీస్ కానిస్టేబుల్‌గా రిటైర్ అయ్యారు. నేనూ ఆ ఉద్యోగానికి ప్రయత్నం చేశాను. నాలుగేళ్ళ క్రితం విజయవాడలో ఉమెన్ కానిస్టేబుల్‌గా చేరాను. నన్నూ, నా ఉద్యోగాన్ని అర్థం చేసుకునే వాడు భర్తగా దొరకాలి కదా మరి! అందుకే శ్రీ వెంకటస్వామిని వివాహం చేసుకున్నాను. ఆయన కూడా పోలీస్ కానిస్టేబుల్!" అన్నారు ప్రస్తుతం విజయవాడ త్రీ టవున్ పోలీస్ స్టేషన్లో కానిస్టేబుల్‌గా ఉద్యోగం చేస్తున్న శ్రీమతి సరోజ.

"ఏ ఉద్యోగమైనా చెయ్యవచ్చుగానీండి. పోలీస్ కానిస్టేబుల్ ఉద్యోగం చెయ్యడం చాలా కష్టమండి. అం[illegible] ట్రాఫిక్ కానిస్టేబుల్ ఉద్యోగం మరి క[illegible]. రోజూ ఇరవై నాలుగు గంటలూ డ్యూటీ చ[illegible]ల్సి రావచ్చు. ఎండా కాలం లేదు, వానా కాలం లేదు. అన్నికాలాలూ రోడ్డు మీదే గడిచిపోతున్నాయి. అలాంటి సమయంలోనే నా జీవితంలోకి భార్యగా అడుగు పెట్టింది మరో కానిస్టేబుల్! ఇద్దరిది ఒకే వృత్తి కావడం వల్ల ప్రవృత్తులు కూడా ఒకటే అయ్యాయి." అన్నారు శ్రీ పి. వెంకటస్వామి. 'పి. అంటే పోలీసు వెంకటస్వామా?' నవ్వుతూ అడిగాను.

భార్యాభర్తలిద్దరూ నవ్వేశారు! శ్రీ వెంకటస్వామి ట్రాఫిక్ కానిస్టేబుల్‌గా పని చేస్తున్నారు.

"ఆయనేమో పిల్లలు కావాలంటున్నారు. నాకేమో వాళ్లను ఎలా పెంచగలనా అని భయం వేస్తోంది. వెధవది మా ఉద్యోగంలో మెటర్నిటీ లీవు మూడు నెలల కంటే ఎక్కువ ఇవ్వరు. పిల్లల్ని కనంగానే సరా? వాళ్లని ఎంత శ్రద్ధతో పెంచాలి? మాలాగా చదువు సంధ్యలు రాకపోతే ఎన్ని ఇబ్బందులు పడాలి? అందుకే ఇంకా కొంత కాలం ఆగుదామంటున్నాను." అన్నారు శ్రీమతి సరోజ.

"అలా అనుకుంటే ఎలా? ఉద్యోగం చేస్తూ విసుగెత్తి పోతున్న మాకు కాస్తన్నా సందడి ఉండాలి కదా? మనం పెరిగినట్టే వాళ్ళూ పెరుగుతారు?" అంటారు శ్రీ వెంకటస్వామి.

"మాకూ అందరిలాగే జీవితం సరదాగా గడపాలన్న కోరిక ఉంది. అందుకు మా ఉద్యోగంలో కుదరదు. మాకు పెళ్ళయి సంవత్సరం కావస్తోంది. ఇంత వరకూ నేనూ, మా వారూ కలిసి సినిమాకి వెళ్ళడం కూడా పడలేదు. పోలీసు ఉద్యోగంలో శలవలు ఉండవు. ఇచ్చినా ఒక్కపూట కంటే ఎక్కువ ఇవ్వరు. ప్రజా సంరక్షణలో నిత్యం మునిగి తేలుతూ ఉంటాము. అత్యవసరం వస్తే అర్ధరాత్రి కూడా డ్యూటీకి హాజరు కావలసి వస్తుంది. కుటుంబ విషయాలు పట్టించుకునే తీరిక మా ఇద్దరికీ ఉండదు. ఈ జీవితానికి అలవాటు పడిపోయాము. కాబట్టి సర్దుకు పోతున్నాము." అనే శ్రీమతి సరోజకు విధి నిర్వహణలో చాలా రివార్డులు వచ్చాయట!

"నాకు ఇప్పుడు చదువుకోవాలనిపిస్తోంది. చదువుకుంటే మా డిపార్ట్‌మెంటులోనే పరీక్షలకు వెళ్ళి ఇంకాస్త ఉన్నత స్థాయిని చేరుకోవచ్చు. ప్రయత్నం చేస్తున్నాను. ఫలితం ఎలాఉంటుందో" అంటున్న శ్రీ వెంకటస్వామిలో పట్టుదల కనిపించింది.

"నేరస్థులు మొగవాళ్ళలోనే కాదు. ఆడవాళ్ళల్లో కూడా ఉన్నారు. మొగ నేరస్థులు చాలా తేలికగా దొరుకుతారు. ఆడ నేరస్థులు దొరకడం చాలా కష్టం. వాళ్ళను పట్టుకోడానికి స్త్రీ పోలీసులు చాలా అవసరం. పోలీసు ఉద్యోగమంటే తేలిక భావం చూపించకుండా ప్రజాసేవ చెయ్యడానికి పోలీసుల్లో చేరడానికి కొంతమంది స్త్రీలన్నా ముందుకు రావాలి! ఇది వరకటి రోజుల్లో పోలీసు కానిస్టేబుళ్ళు లంచగొండులని, నడవడి సరిగ్గా లేని వారందరూ (దొంగలు కూడా) పోలీసుల్లో చేరారని అనుకునేవారు. కానీ పరిస్థితులు మారాయి. పెద్ద పెద్ద డిగ్రీలు చదివిన వారు కూడా కానిస్టేబుల్ ఉద్యోగంలో చేరుతున్నారు. తమ ఆత్మగౌరవం కాపాడుకోడానికి ప్రయత్నిస్తున్నారు. ఇది మాలో మంచి మార్పు. మా పై అధికారులు కూడా మా కష్టసుఖాలను ఆలోచిస్తున్నారు. కాబట్టి భవిష్యత్తు బాగుంటుందని ఆశిస్తున్నాము." అన్నారు శ్రీమతి సరోజ.

—కృష్ణాజీ

---

ప్రశ్నించగా, పాలక మండలి పనిచేస్తున్నదని విద్యామంత్రి సమాధానం చెప్పారు.

ఎం. ఫిల్., పి. హెచ్. డిలు కూడ సార్వత్రిక విశ్వ విద్యాలయ సహకారంతో తెలుగు అకాడెమి ప్రవేశపెడుతుందని విద్యామంత్రి చెప్పారు. సార్వత్రిక విశ్వవిద్యాలయం ఎలాగూ పోస్టల్ ట్యూషన్లకోసం పాఠ్య పుస్తకాలు సిద్ధపరుస్తున్నది. అయినప్పుడు ఈ సంస్థను తనలో లీనం చేసుకొని తక్కిన పాఠ్య పుస్తకాలను ప్రచురించవచ్చు. పరిశోధన విషయంలో ఆంధ్రప్రదేశ్ విశ్వవిద్యాలయాలలోనే పరిశోధన కార్యక్రమం ప్రతిభాదారిద్ర్యంతో ఉందని విమర్శలు వెలువడుతుండగా, కొత్తగా ఈ సంస్థలు పరిశోధనరంగంలో ప్రవేశించబోయేముందు తగిన వనరులు ఏర్పరచుకోవాలి. చిన్న తరగతులకు వాచక పుస్తకాలు వ్రాయించడానికి ఉపయోగపడే పదజాలం రూపొందించే ప్రణాళికను తెలుగు అకాడెమి చేపట్టింది. ఆ ప్రణాళిక ఏమైందో తెలియదు. ఏ శ్రేణికి కావలసిన పదాలు ఆ శ్రేణికి తయారు చేస్తున్నామని అనాటి వార్షిక నివేదికలో ఈ సంస్థ పేర్కొన్నది. కాని, ఆ పదజాలం ప్రకటించడం ఇదివరకు జరుగలేదు. శబ్ద సాగరం తుది స్వరూపం ఎప్పుడు నిర్ధారణ అవుతుందో తెలియదు. ఇంగ్లీషు – తెలుగు నిఘంటువుపైన కూడ విమర్శలు వచ్చాయి. కనుక దానిని పునస్సంస్కరించి ప్రకటించ వలసిన అవసరం వుంది. తెలుగు అకాడెమి నుంచి తెలుగు విశ్వ విద్యాలయానికి చేరే విభాగాల విషయం నిర్ణయమైన తర్వాత తెలుగు అకాడెమి భవిష్యత్కార్యక్రమాలు స్పష్టం కాగలవేమో! హైదరాబాద్ నోట్‌బుక్ పదే పదే సూచించినట్టు సాహిత్యాది అకాడెమిలు అన్నీ తెలుగు విశ్వ విద్యాలయాలలో లీన మయ్యాయి. తెలుగు అకాడెమిని కూడ లీనం చేయాలని హైదరాబాద్ నోట్‌బుక్ సూచించింది. ఆ విధంగా జరిగి, అక్కడి విద్వాంసుల ప్రతిభా విశేషాలు దేశానికి వినియోగ పడుతాయని ఆశిస్తున్నాను.

### ఉపశ్రుతి :—

పంజాబులో అంతటి దౌర్జన్యకాండ జరుగుతున్నది. ఇతర రాష్ట్రాలలో ప్రతీకార వాంఛ చెలరేగితే ఇబ్బందిగదా?— అని నా మిత్రుడైన ఒక శిఖ్ఖు పెద్ద మనిషిని అడిగాను. నిజమేనండి. అలా జరుగరాదని గురువులను ప్రార్థిస్తుంటాను. అక్కడి దౌర్జన్య వాదులకు తెలివి వుండాలి గదా!— అని ఆయన విచార పడ్డాడు.

—తిరుమల రామచంద్ర

# గ్లూకోన్-డి సూపర్‌హీరో.

ఉక్క పోస్తూ అలుపు
పుట్టించే రోజున కూడా
ఉరకలు వేసే శక్తి.




అలుప తెచ్చే వేసవి రోజున మీ అబ్బాయికి కావలసింది గ్లూకోన్-డి: గ్లూకోజు, విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్సు గల తక్షణ శక్తినిచ్చే పానీయం.

గ్లూకోన్-డిని పళ్లరసం, పాలు, టీ, కాఫీ, లేదా నీళ్లలో కలిపారంటే కుటుంబం మొత్తానికి ఒక ఉల్లాస పానీయంగా తయారై పోతుంది.

100, 200, 500 గ్రాముల ప్యాకులలో లభిస్తుంది.

గ్లాక్సో వారి గ్లూకోన్-డి.

## గ్లూకోన్-డి ®

సూపర్‌హీరో అమితంగా ఇష్టపడే శక్తినిచ్చే పానీయం.

GLL-2389